# రు. 2,000 ల బహుమతులు

## మేనర్స్ నూతన అదృష్ట పిల్లల పోటీ

## క్రొత్తగా జన్మించిన పాపలకు

శుభవార్త! మేనర్స్ అదృష్ట బాలల పోటీ యిప్పుడు ఏడాదికి ఆరు సార్లు జరుగుతుంది–1963 జనవరి నుండి రెండు మాసాల కొకసారి. ప్రతి పోటీకి బహుమతుల మొత్తం రు. 2,000 లు.

మీ పాప పాల్గొనుటకు : మీ పాప పుట్టిన తేది, కాలము మాకు పంపండి. మీ పాప పేరు, మీ చిరునామా, మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ అట్ట పెట్టె పై మూత, న్యాయ మూర్తులచే నిర్ణయించబడిన తేదీకి, కాలమునకు అతి దగ్గరలోనున్నవాటికే బహుమతులు యివ్వబడును.

ఈ అదృష్ట పరంపరలో మొదటి పోటీకి పాల్గొనే పాపలు యీ సంవత్సరం జనవరి, ఫిబ్రవరి. నెలలలో పుట్టిన వారై వుండాలి. ఆఖరు తేది 1963 మార్చి 5. మీ వ్యాపారుని వద్ద నుండి ప్రవేశ పత్రాలు, వివరాలు పొందండి.

1వ బహుమతి రు. 1,250/-(నెలకు రు. 22.60 ల చొ॥న 5 ఏళ్లకు)*

2వ బహుమతి రు. 500/-లు నగదు

3వ బహుమతి రు. 250/-లు నగదు

ప్రవేశ పత్రలు ఈ చిరునామాకు పంపండి:
మేనర్స్ లక్కీ బేబీ ఫెస్టివల్, పోస్టు బ్యాగ్ నెం. 10116, బొంబాయి-1.

తర్వాతి నెలలలో పుట్టిన బాలలకు పోటి వివరాలు తెలుసుకొనుటకు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ ప్రకటనలను చూడండి.

* డెఫర్డ్ ఎష్యూరెన్స్ పాలిసి







మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ పాపను చిరునవ్వులతో వుంచును.

ASP/GM/BF3/1 TEL

GEOFFREY MANNERS & CO. LTD.

# వ్యాస రచన పోటీ

## మొదటి బహుమతి: రు. 100
## రెండవ బహుమతి: రు. 75
## మూడవ బహుమతి: రు. 50

మనదేశం మొత్తంమీద, ప్రజలందరికీ అందుబాటులోవుండి వినోదాన్ని కలిగించే సాధనాల్లో సినిమా ముఖ్యమైందనే చెప్పాలి. అంతేకాక సినిమా జాతీయ సమైక్యతకు మంచి సాధనమనికూడా చాలామంది అంటున్నారు. హిందీ తదితరమైన ఉత్తరభాషా చిత్రాలు దక్షిణ భారత దేశంలో ప్రదర్శించడటం, ప్రదర్శించే చిత్రాలసంఖ్యా, రోజు రోజుకూ ఎక్కువౌతున్నది. చిత్రాల్లో సంగీతంకూడా ఇప్పుడు అన్ని భాషా చిత్రాల్లోను ఒకేరీతిగా, ఒకేస్థాయిలో ఉన్నట్లు కన్పిస్తున్నది. ఒకవిధంగా చిత్రాలు జాతీయ సమైక్యతకు దారితీస్తున్నవని చెప్పవచ్చు.

మరి కొంతమంది, కొన్ని సినిమాలు దేశంలోని వర్గవర్ణ వైషమ్యాలు తదితరమైన అవాంఛనీయమైన విషయాలను రెచ్చగొట్టి, విచ్ఛిన్నకరశక్తులుగా మారిపోతున్నవని అంటున్నారు.

పై రెండు అభిప్రాయాలలోఏది వాస్తవం అన్న విషయంపై పాఠకుల అభిప్రాయాలు తెలుసుకునే ఉద్దేశ్యంతో ఈ పోటీ నడుపుతున్నాము.

తమ అభిప్రాయాలను వ్యాసరూపంలో పొందుపరుస్తూ 28–2–63 లోపుగా మా కార్యాలయానికి అందజేయవలసిందిగా పోటీలో పాల్గొనే వారిని కోరుతున్నాము.



● వ్యాసాలు 5 అరఠావు పేజీలకుమించి ఉండరాదు. ● కాగితం ఒకవైపుననే రాయాలి. ● కవరుపైన 'సినిమా వ్యాసరచన పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి. ● తుదినిర్ణయం సంపాదకునిదే. దీనిపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. ● త్రిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్ళలు అంటించిన కవర్లు జతపరచి పంపాలి. ● బహుమతి పొందిన వ్యాసాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది సంచికలో ప్రచురిస్తాము.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

సంక్రాంతి పండుగ గొప్పతనాన్ని, గ్రామీణ వాతావరణంలో పెరిగిన పల్లెపడుచు సహజ సౌందర్యాన్ని ప్రతిబింబింపచేసే "సస్యలక్ష్మి" ముఖచిత్రం చాలా బావుంది.

గుంతకల్ చిన్నయ్య (విజయవాడ)

* * *

రాజశ్రీ ఆ పోజులో ఎలా ఉందనుకొన్నారు. అచ్చు అప్సరసలాఉంది. అసలింతకూ ఆ చిత్రం ఏ చిత్రంలోనిదో తెలుపవలెనని కోరు చున్నాము.

విజయ, మారుతి (బందరు)

## కథలు

11—1—63 తారీఖు సంక్రాంతి పత్రిక చాలా బాగుంది. ముఖ్యంగా సింగరాజు రామచంద్రమూర్తిగారు వ్రాసిన "వేట" కథ మా ఇంట్లో అందరికి నచ్చింది. అంతం మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది. రచయితగార్కి మా అభినందనములు తెల్పగలరని ప్రార్థన.

ఎర్రమల్ల కృష్ణ, గంధం లక్ష్మీ నారాయణ, (షాద్‌నగరు)

* * *

సింగరాజు రామచంద్రమూర్తిగారు వ్రాసిన 'వేట' కథలో అందమైన మేనమామ కూతురు కన్పించగానే ప్రేమించిన యువతి (సుబ్బలక్ష్మి)ని మరిచిపోయాడు అనే దానికన్నా అసలు సుబ్బలక్ష్మిని ప్రేమించలేదు అంటే బాగా ఉండేదేమో?

ఎం. రాము (విజయవాడ)

* * *

"వాకీ పెళ్లి వద్దు" చదివిన తర్వాత "వాకీ అదృష్టం చాలదు" అనిపించింది.

చంద్ర (కాకినాడ)

## కార్టూనులు

11—1—63 తేదీ (సంక్రాంతి సంచిక) ఉత్తరాల శీర్షికలో 'వట్టే హైమవతిగారు 4—1— తేదీ ముఖచిత్రంలో కార్టూను విషయమై సందేహము తీర్చమని అడుగగా, మీరు "మీ రిచ్చిన అర్థమే సరియైనది అనుకుంటున్నాము" అని అనడం ఏమి అంత సమంజసంగాలేదు. ఎందుచేతనంటారా? మీరు కార్టూనులు అర్థం చేసుకొని, అది పత్రికలో వేస్తారు. ఒకవేళ మీరు అర్థం చేసుకొనకుండా వేసుంటే దానికి అర్థంలేదు. ఇకముందైనా దయచేసి, సందేహాలను కోరినవారికి సరియైన సమాధానాలు ఇస్తారని ఆశిస్తున్నాను.

బి. వెంకట్రావ్ (బొబ్బిలి)

* * *

11—1—63 సంచికలో (హమేషా తమాషా శీర్షిక క్రింద) వైరావ్‌గారి కార్టూన్ చాలా ఆశ్చర్యం కలిగించింది. సిటీ బస్సులకు డోర్‌లు ఎడమవైపునే ఉంటాయి. ఈ కార్టూన్‌లోని లావుపాటి వ్యక్తి కుడివైపునుంచి దిగినట్లుంది. పైగా సిటీ బస్సుల స్టాపువెప్పుడూ రోడ్డుకు ఎడమవైపునే యుంటాయి. ఈ విషయాన్ని వైరావ్‌గారు గమనించినట్లులేదు.

పి. యస్. రావు ([illegible]) ★

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 1—2—63

శుభకృన్నామ సం॥ మాఘమాసం॥ శు॥ అష్టమి

సంపుటము: 55 సంచిక: 22

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకులు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకులు:
శివలెంక రాధాకృష్ణ

**ఒక సంవత్సరం చందా వివరాలు**

ఇండియా: రూ. 13.00 ఇతర దేశాలు: ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

*

విడిప్రతి: 25 న.పై.
సంవత్సర చందా: 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





వాసవీ వారి "అనుబంధాలు" లో స్వర్ణ.

## మనలోమాట

'కథేనండీ' కథ(?)కు బొమ్మలు వేసిన శ్రీ జయదేవ బాబుగారి కార్టూన్లు ఆంధ్ర సచిత్ర వార పత్రికలో చాలా పడ్డాయి. వారి బొమ్మలు కల మరికొన్ని రచనలు త్వరలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించబోతున్నాము!

శ్రీ జయదేవ బాబుగారు ప్రస్తుతం మద్రాసు పచ్చయప్ప కాలేజీలో ఎం. ఎస్‌సి. చదువుతున్నారు

* *

ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకులకు సుపరిచితులయిన మరొక 'వ్యంగ్యచిత్రకారుని' బొమ్మలు కూడా (వ్యంగ్య రచనలతో పాటు)! త్వరలో పాఠకులకు అందచేయగలము...!

* * *

ఈ వారంతో 'మాలతి తండ్రి' అయిపోతుంది. తమిళం నుంచి దానిని తర్జుమా చేయటానికి అనుమతి నిచ్చిన కీ. శే. కల్కి వారసులకు కృతజ్ఞులము.

* * *

'తెరమీద — తెర వెనుక' శీర్షిక ఈ నెలలోనే ప్రారంభించగలము. తేదీ వివరాలు వేరే ప్రకటిస్తాము.

ఈ నెలలోనే నాలుగు కొత్త శీర్షికలు ప్రారంభమవుతున్నాయి! ఇవిగాక బొంబాయి ఆంధ్ర మహాసభ పోటీలో బహుమతి పొందిన కథలు కూడా ఈ నెలలోనే ప్రారంభించి వరుసగా వేస్తాము.

* * *

[పోయిన వారం ముఖచిత్రం ఫోటో తీసినవారు శ్రీ ప్రభాకర్]

## లోకంపోకడ



"మద్యనిషేధం వద్దనే వాదానికి మద్దత్తు యిస్తాను గాని బాబ్బాబూ! ఆ మాట కాగితంమీద అననూనొద్దు... మా ఆవిడ చంపేస్తుంది!..."

## విషయానుక్రమణిక



జాతిపిత మహాత్మాగాంధీ వర్ధంతి జనవరి 30 వ తేదీన జరిగింది.

# ప్రపంచానికి అంతుపట్టని చైనా తంత్రాంగం: అసమగ్రంగా ఉన్న మన రక్షణ సన్నాహాలు

శ్రీ కృష్ణ

ఏమైతేనేం, మొత్తంమీద కొలంబో పథకాన్ని అంగీకరించాలనీ, తదుపరి చైనాతో చర్చలు కొనసాగించాలనీ అనుకున్నాం ఓ వారంలోగా వెలువడిన సంయుక్త ప్రకటనలో ప్రభుత్వం, ఈ పథకం పట్ల ముఖాముఖంగా ఎటూ చెప్పకుండానే ఉందనీ, పథకాన్ని గూర్చి పార్లమెంటు శాసిస్తే తప్ప, ఆమోదించేది లేదని పేర్కొంది పార్లమెంటులో అసంఖ్యాకంగా ఉన్న తన పార్టీ సభ్యుల మద్దతు, పైపెచ్చు కమ్యూనిస్టు సభ్యుల తోడ్పాటు ఉంటుందని తెలుసుకున్న ప్రభుత్వం ఈ నిర్ణయానికి రాక ఏం చేస్తుంది ?

పెద్దపెద్ద మాటలు చెప్పటానికీ, వాస్తవ విషయాలను ఎదుర్కోటానికీ, చాలా తేడా ఉంది. మన అసన్నద్ధ రక్షణ పుణ్యమా అని భారతదేశం నేఫాలో దారుణమైన అపజయాలను పొందిందన్నది అలాంటి వాస్తవాల్లో ఒకటి చైనా వాళ్ళను మెక్‌మాహన్ రేఖకు అవతల నిలబెట్టగల శక్తి సంపాదించాలంటే మన ప్రభుత్వానికి ఎంతలేదన్నా మూడేళ్ళన్నా పడుతుంది. కొలంబో ప్రణాళికను ఆమోదిస్తున్నదీ అంటే భారతదేశం సైనికంగా బలం పుంజుకోగల అవకాశాన్ని కొనుక్కుంటున్నదన్నమాట!

చైనాతో సంప్రదింపులు జరిపేందుకు భారతదేశాన్ని ముందుకు తోసే పనికి పూనుకున్న దెవర్టు ! సింహళీయుడు శ్రీ ఫెలిక్స్ బండారనాయకే ముఖ్య పాత్రధారుల్లో ఒకరనీ, లోగడ న్యూఢిల్లీలో, ఎక్కువకాలం చర్చలు కొనసాగించిన వ్యక్తి ఈయనే నని చాలామంది ఊహిస్తున్నారు.

చైనాతో ఈ సంప్రదింపుల విషయంలో చాలా సందేహాలు కలుగుతున్నాయి. భారతదేశం సంప్రదింపుల కొప్పుకోవటం ద్వారా, తను బలం పుంజుకొనే కాలాన్ని సంపాదించుకుంటున్నదని చైనాకు బాగా తెలుసు. తన విస్తరణ కార్యక్రమాన్ని ఎదుర్కొనే నాటి ఉద్దేశ్యంతో భారతదేశం సైనికంగా బలపడుతుంటే, చైనా చేతులు ముడుచుక్కూచుంటుందా అనే విషయం ఏప్రియల్ నెల తర్వాత గాని తేలదు. ఏది ఏమైనా చైనావాళ్ళు **ఎందుకు దురాక్రమణ జరిపారో, మళ్ళీ ఎందుకు** ఏకపక్ష యుద్ధ విరమణ, ఉపసంహరణ కొనసాగించారో ఎవరికీ అంతుపట్టటంలేదు. అలాగే ఏదో మనం ఊహాగానాలు చేయటమే తప్ప, చైనా భవిష్యత్కార్యక్రమ తంత్రాంగం వాళ్ళకి తప్ప ఇతరులకు ఘస్తే తెలియదు!

ఇక రెండో సమస్య, అన్నిటికన్న ముఖ్యమైనది. సైనికంగా అభివృద్ధి అయ్యేందుకు తన కాలాన్ని, అవకాశాన్ని వినియోగించుకుంటున్నది మన దేశం. ఈ అభివృద్ధి మాటలతో అయ్యేది కాదు. చాలా మాటలు కావాలి. అంతేకాదు. మూక ఉమ్మడిగా సైనిక సహాయం కూడా కావాల్సి ఉంటుంది మరి !

అదికాక, ఇంకో విషయం ఏమిటంటే, దేశంలో అసాధారణ పరిస్థితి ప్రకటించటం, భారత రక్షణ చట్టం అమలు, ఆర్థిక, రక్షణల సహకారశాఖ నెలకొల్పటం వినా, యుద్ధసన్నాహాలకు పరిపాలనాంగరీత్యా ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు చాలా కొదియనే చెప్పాలి. పరిపాలనలో ఉత్తేజం కలిగించమంటే ప్రధానమంత్రి వల్ల కాదన్నారు! మంత్రిమండలిలో సంఖ్య తగ్గించాలన్న ప్రతిపాదనను తిరస్కరిస్తూ ప్రధానమంత్రి, మండలిలో ఉన్న ప్రతివాడు ఉపయోగకరమైన పనులే చేస్తున్నాడులే! అని కూడా చెప్పారు. రక్షణమంత్రిత్వ శాఖేగాక, రక్షణావసర వస్తూత్పత్తి శాఖను కూడా నెలకొల్పుకోవటంవల్ల ఇబ్బందులు ఏర్పడుతాయని ఆయనకు చెప్పటం జరిగింది కూడా ! రక్షణావసర వస్తూత్పత్తి అనేది, రక్షణ, ఆర్థిక సహకార శాఖలో భాగంగానే ఉండాలి. ఈ వాదనలోని సత్యం ప్రధానమంత్రికి తెలిసినా, సహజంగా, సబబుగా కన్పించినా, మంత్రివర్గ సౌహార్దంలో ఆయనకు సంపూర్ణ విశ్వాసం ఉన్నట్లు తెలుస్తున్నది కొత్త రక్షణ మంత్రి శ్రీ వై. బి. చవన్ దృష్టి అంతా తా నునుకొన్న పద్ధతులపైనే తప్ప, ఈ సహకార యుద్ధ ప్రయత్నంపైన లేనట్లుంది పైగా ప్రధానమంత్రి కూడా ఇంతవరకు జోక్యం కల్పించుకోకుండా, ఉపేక్షతోనే ఉన్నారాయె!

ఒక్కమాటలో చెప్పాలంటే కేంద్ర మంత్రిత్వ శాఖలో ఒక్కొక్కటి ఒక్కొక్క సర్వసత్తాక స్వతంత్రదేశాల మాదిరిగా ఉన్నాయి. శ్రీ నెహ్రూ ప్రతిపాదించిన 'పంచశీల' ఆ దారినే నడుస్తున్నవి. పైగా ఆర్థిక, రక్షణ సహకారాలశాఖ చొరవతీసుకొని చేసే ఏ ప్రయత్నమైనా, పై పంచశీల దృష్ట్యా సార్వభౌమత్వానికి ప్రతిబంధకాలు కల్పించటమే అవుతుందిట. నౌకాశాఖ మంత్రి శ్రీ కె డి మాలవియా రక్షణ ఆర్థిక సహకారాల శాఖకు, నౌకా ఉత్పత్తి శక్తిని పెంచవలసిందిగా పంపిన ఉత్తరాలను ఉదాహరణగా తీసుకోవచ్చు ఆయనకు ప్రధానమంత్రి అండకూడాఉంది !

చైనీయులు దురాక్రమణ ప్రారంభించిన

55 వ పేజీ చూడండి


పార్లమెంటు చర్చలు
ఏది ఏమైనా మళ్లీ వాళ్లల్లో వెనుకటి ఐకమత్యం సన్నగిల్లుతోంది
బాబోయ్! నేమునిగి పోతున్నాను దేముడోయ్!
నగల వర్తకుడు
బంగారం కంట్రోలు
" మీ బిడ్డను సంరక్షించండి "
ఉద్యమించండి
ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లో
అంతః కలహాల అగ్ని



# తెల్లమబ్బులు

డి. హనుమంతరావు

"సాయంకాలం అందంగా ఉంది" అనుకొంది జానకి అద్దంముందు నిలబడి. వేళ్లమధ్య జుట్టుపాయలు మెలికలు తిరుగుతున్నాయి.

అప్పుడే, ఓ జడి కొట్టి వెలిసి, యిళ్లు, రోడ్లు చెట్లు అన్నిట్నీ స్నానం చేయించింది; నీరెండల కాంతుల్లో అంతా కొత్తగా వెలుగుతోంది.

ఇరవై ఆరేళ్లంటే ఎన్నిరోజుల ? మూడు వందల అరవై అయిదు పెట్టి గుణించాలి...ఎంత?

ఎంతో నోట్లో కట్టుకలిగితే బాగానే ఉండును బ్రతుకు ! జాలిగా నవ్వుకొంది జానకి.

ఇన్నివేల రోజుల్లో, ఆ రోజు కో ప్రత్యేకత ఉంది. అలాంటి దింకొకటి యీ బ్రతుకులో మళ్లీ వస్తుందని ఆమె అనుకోడంలేదు. ఎక్కువ ఆనందకరమైనదీ, ఎన్నటికీ మర్చిపోరానిదీ, ఏదో ఒక రోజు ప్రతివారికీ ఉంటుంది. జానకి జీవితంలో అలాంటిది, ఆ రోజే.

ఆ రోజు రకరకాల ఆలోచనలు ఒకదాని తర్వాత ఒకటి తొందర తొందరగా తోసుకొచ్చి ఏదో చెప్పలేని సంతోషాన్ని కుమ్మరిస్తున్నాయి. ప్రపంచమంతా చాలా అందంగా, ఆనందంగా కనబడ్తోంది. రంగుల అందమైన పూల తోరణాలు ఎన్నో !— మనసులోనూ, బయటా ! రెండేళ్లలో ఎంతమార్పు!

రెండేళ్ల క్రితం పుట్టినరోజు పండగ బాధగా మూగగా ఏ వెలుగూ లేకుండా వెళ్లిపోయింది, అంత క్రితం చాలావాట్లలాగే. అంతకన్నా ఎక్కువ నోచుకోలేదేమో అనే నిరాశ, నిస్పృహ అసలు పుట్టినరోజన్న ధ్యాసే రానీయకుండా దూరంచేశాయి.

జానకి పుట్టిన రెండేళ్లకి తల్లిపోయింది. తండ్రి పెంచి పెద్దచేశాడన్న మాటే గాని, ఆమె కో దారి చూపెట్టకుండానే జారుకున్నాడు. ఆ తర్వాత పదేళ్ల పాటు అక్కయ్య దగ్గర. ఆ పదేళ్లూ తన బ్రతుకు బాటల్ని ఏ పాడు గ్రహాలు తీర్చాయో—తల్చుకుంటే యిప్పటికీ గుండెల్నెవరో కోసినట్లుంటుంది. యీడొచ్చి యిన్నాళ్లయినా పెళ్లి కాలేదని హేళనలు, పరిహాసాలు—వీటన్నిటితోనూ మగ్గి కుళ్లడం కన్నా ఏ నుయ్యో గొయ్యో చూసుకోడం మంచిదని ఆ పదేళ్లలో ఎన్నిసార్లనుకుందో ! నాన్నమీద విపరీతమైన కోపంవచ్చేది. తను బ్రతికుండగానే ఎవరో ఒకరికి ముడిపెట్టకుండా నట్టనడి సంద్రాన లాగ యీ లోకంలో చిల్లిగవ్వైనా లేకుండా వదిలేసి తప్పుకున్నాడు !

పాపం, నాన్నమాత్ర మేం చేస్తాడు? బ్రతికున్నంతకాలం ఎలాగోలాగ బావకే ముడెట్టాలని నానా తంటాలు పడ్డాడు. కాని,....మామూలు కథే! పేదరికం అడ్డొచ్చింది. అది పైకి చెప్పలేక, ఏదో వంకపెట్టి కాదన్నారు మామయ్యా, అత్తయ్యా. తను పుట్టిన నక్షత్రం మంచిదికాదట ! అదీ తను చేసిన పాపం !

"బావా ! ఎంత పిరికివాడివి కాకపోతే, నువ్వా భయాలన్నీ నమ్ముతావు ? యిప్పుడేమయింది ? అన్ని నక్షత్రాలు గుణించి కట్టుకొన్న పెళ్లాన్ని క్షయాస్పత్రిలో జేర్పించి ఏం సుఖపడ్తున్నావు ? నాకు చేసిన అన్యాయానికి దేవుడు నీకు వేసిన శిక్ష యిది ?...."

జానకి కళ్లలో నిండిన నీటిపొరల్ని కొంగు కొసతో తుడుచుకొంది....ఏమిటో పాడు ఆలోచనలు !

"క్షమించు బావా ! యివాళ యెవరికీ కీడు తలచలేను. నీ కసలు ఎన్నటికీ తలవను. ఏదో క్షణంలో బాధ కలిగి అనుకున్నానంతే....నన్ను కాపాడిన దైవమే నీకూ మేలు జేస్తాడు....నా కేదన్నా లోపం జరిగితే, ఏదైనా తక్కువై, తృప్తి, ఆనందం దొరక్కపోతే—అప్పుడు, మరొకర్ని చూసి అసూయ

—50 వ పేజీ చూడండి



జాతీయ అభివృద్ధి మండలి సమావేశంలో పాల్గొనడానికి ఢిల్లీ వెడుతూ ఇటీవల బేగంపేట విమానాశ్రయంలో శ్రీయుతులు కామరాజ్, నిజలింగప్ప, సంజీవరెడ్డిగారలు కలుసుకున్నప్పటి చిత్రం

# అనారోగ్యానికి ఆటపట్టైన మన రాజధానీ నగరం

మున్సిపాలిటీవారు తరుచు తీవ్రమైన విమర్శలకు గురికావటం సహజం అందులోనూ హైదరాబాద్ పట్నంలాంటి విశాల నగర పాలకులకు ఎన్నో బాధ్యతలున్నాయి వాటిని సక్రమంగా నిర్వర్తించలేక సతమతమవుతూనే ఉంటారు మొదటి కారణం అసమర్థత రెండోది నిర్లక్ష్యం ఈ రెండూ కూడా సహించరానివే! దినదినాభివృద్ధి చెందుతున్న ఈ జనాభా పెరుగుదల వేగాన్ని తట్టుకుంటూ, అంత వేగంతోనూ సౌకర్యాలు కల్పించాల్సి వస్తుంది అంచనాలు వేసుకుంటూ కూర్చుని, కార్యక్రమాల్ని కార్యరూపంలోకి తీసుక వచ్చేటప్పటికి పొద్దు వాలిపోతుంది మళ్ళీ లెక్కలు మొదటి నుంచీ ప్రారంభించాలి సుమారు పధ్నాలుగు లక్షలు గల ఈ రాజధాని నగరంలోని పురజనులకు ఏ విధమైన సౌకర్యాలు కలుగజేయాలి, పట్నాన్ని పరిశుభ్రంగా ఉంచాలంటే ఎలాంటి చర్యలు తీసుకోవాలి, అనే విషయాల్ని ఆలోచన చెయ్యటానికి, ఊహాశక్తి, యోచనాశక్తి, పరిపాలనా సమర్థత, రూపొందించిన ప్రణాళికలను అమలు జరుపగల స్తోమత మొదలైనవన్నీ ఉండాలి వీటితోపాటు ప్రపంచ జ్ఞానం, ముందుచూపు కూడా తగినంత మోతాదులో సమకూర్చుకోవాలి అయితే వీటి ప్రాముఖ్యత పాలకులకు అర్థమయినట్టు కనబడదు

ముందుచూపంటే జ్ఞాపకం వచ్చింది అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనాన్ని ప్రారంభించటానికి పనికట్టుకుని ఎస్ కె పాటిల్ అంతటి వ్యక్తి హైదరాబాదు నగరానికి విచ్చేశారు వారి గంభీరోపన్యాసంలో పంచవర్ష ప్రణాళికా కర్తల ముందుచూపును గురించి ప్రస్తావించారు మొదటి పంచవర్ష ప్రణాళికను తయారుచేసినప్పుడు హిందూ దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చటానికి భారీ ఎత్తున పరిశ్రమల స్థాపనకు, అభివృద్ధికి కావలసిన ఏర్పాట్లను ఉదహరించారుట తీరా కార్యరంగంలోకి దిగేటప్పటికి, గొప్ప చిక్కు సమస్య ఎదురయిందిట పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలే కరువయిపోయినాయిట! దీనికి కారణం వ్యవసాయమే ప్రధాన వృత్తిగా గల మన హిందూ దేశంలో పరిశ్రమల్లో మూడు వంతులు వ్యవసాయాన్నుంచి ఆవిర్భవించినవే అన్నమాట విస్మరించారట! అందువలన వ్యవసాయోత్పత్తికి ప్రాధాన్యము ఇవ్వాలని, రెండో పంచవర్ష ప్రణాళికలో తప్పులు దిద్దుకున్నారుట! మన ప్రణాళికా కర్తలే ఈ విధంగా ప్రవర్తిస్తుంటే ఈ 'ఛోటా' పాలకుల సంగతి వేరే చెప్పాలా? అయితే సమర్థవంతంగానూ, బాధ్యతాయుతంగానూ చెయ్యాలంటేనూ, చెయ్యవలెననుకుంటేనూ, అవకాశము లేకపోలేదు ఎవరికి వారు తమకేమి పట్టనట్టుగానూ దులపరించుకుపోతా ఉంటారు

మొన్నీమధ్యనే మునిసిపల్ బడ్జెట్ సవరించటం జరిగింది జమాఖర్చులు, తలపెట్టిన కార్యక్రమాల పట్టిక, నివేదిక అన్నీ బాగానే ఉంటాయి అసలు మునిసిపల్ చట్టంలోనే తప్పనిసరిగా నిర్వర్తించాల్సిన విధులు కొన్ని ఉన్నాయి రోడ్ల మరమ్మతు, పురజనుల ఆరోగ్యం విషయంలో శ్రద్ధ, వీధి దీపాలు, పార్కులు, ఆటస్థలాలు ఏర్పాటు చేయటం, పట్నాన్ని పరిశుభ్రంగా ఉంచటం మొదలైనవి వీటిలో తప్పించుకునేవేమీ లేవు విధిగా చెయ్యాల్సిన పనులు ఇవికాకుండా, ఇంకా ఇతర సౌకర్యాలు కూడా ఆర్థికస్తోమతనుబట్టి, అవసరాన్ని, అవకాశాన్ని బట్టి కల్పించవచ్చు కూడా కేవలం కొత్త పన్నులు లేవి విధించటం లేదంటే, పురజనులు సంతోషపడేదేమీ లేదు కొత్త పన్నులు విధిస్తే బాధపడేదానికన్నా, విధించిన పన్నులకు ప్రతిగా, సౌకర్యాలు కల్పించలేకపోయారే అనే బాధ ఎక్కువగా ఉంటుంది సరసమైన ధరలకు విక్రయించే మందులషాపులు, ఆహారపదార్థాలు సప్లయిచేసే చౌక దుకాణాలు, ఇంకా ఏమేమిటో చేస్తామని కూడా ఆ నివేదికలో ఉదహరించారు ఇంకా ఏవేవో పెద్ద పెద్ద ప్లాన్లే చూపెడుతున్నారు ఇవన్నీ బాగానే ఉన్నాయి, అసలు వాటి మాటేమిటి?

ఈ జంట నగరాల్లో రోడ్ల దుస్థితి చూస్తే, ఎవరూ కూడా నోరు మెదపకుండా ఉండలేరు గళ్ళుపడ్డ రోడ్ల విషయం పట్టించుకోవటమే లేదు అవట్లా ఉండిపోవాల్సిందే! వచ్చి వచ్చి అమాంతం గోతిలో దిగబడ్డప్పుడు మునిసిపాలిటీ వారిని 'తలుచుకోకుండా' ఉండరు ముఖ్యమైన చోట్ల, అందులో రద్దీ ఎక్కువగా ఉన్న ప్రదేశాల్లో కూడా మట్టిరోడ్లే! ధూళి యింతెత్తు లేచి, మనుష్యుల్ని ముంచేస్తూ ఉంటే, దులుపుకుంటూ, పణుక్కుంటూ వెళుతూ ఉండాల్సిందే! ఇంకో వింతేమిటంటే కొన్ని సందుల్లో, సిమెంటు రోడ్డు వచ్చి వచ్చి, దభాలన ఒకాయన యింటి

౬౫-వ పేజీ చూడండి

# హరివంశము

## ఉజ్జయినీ పర్వం- 12

అనుష్ఠానములవేళకు ఆచార్య సాందీపని తన యాశ్రమమును చేరుకొనెను. ఆచార్యాణియు, ఆయనతో వచ్చెను. రాజాధిదేవి మిత్రవిందను గూడ వారితో ఆశ్రమమునకు పంపెను. సప్తమినాడు గదా! నామాక్షిని పెండ్లికూతురును చేయుట— ఇప్పుడెందులకు? సప్తమినాటి ఉదయమున పంపుము అని ఆచార్యాణి యన్నది. ఆచార్య డామెను విచిత్రముగ · చూచెను. ఆ కన్నులతోడనే రాజును చూచెను. మందహాసము చేసెను.

"ఆచార్య! అట్లు నా వంక చూచెదరేమి! మా మహారాణిగారిని చూడుడు" అనినాడు మహారాజు

"ఆచార్య! మహారాజుగారి గుంభనపు మాటలు నాకు అర్థముకావు" అన్నది రాజాధిదేవి.

"ఇందులో అర్థము కావలసినదేమియున్నది పిల్లవాడు వచ్చినాడు. పిల్లను చూచుకొనును గదా యని సప్తమినాడుగాని, దానిని తీసుకొని పోవంటిని" అన్నది ఆచార్యాణి.

మహారాజు నవ్వినాడు: "తల్లీ! తమరు వైదికులు. అందువలన అట్లు మాటాడినారు. ఏనైన నేమి యాదవుల యాడబడుచుకన్న తెలివికలవారు" అన్నాడు

రాజాధిదేవి విస్ఫారిత నేత్రములతో ఆచార్యాణిని చూచినది. ఆచార్యుని చూచినది. మహారాజును చూచినది. ఆమె ముఖమున ఆనందము గోచరించినది. ఆమె కన్నులలో ఆ ఆనందము విరిసి, దాని తుదలలో విషాదము విరిసినది. ఆమె అన్నది:

"తల్లీ! తమరు ఇక్ష్వాకులకు అరుంధతమ్మ ఎట్లో అట్టివారు. మీ దీవన ఫలమునకు లోక ఎట్లుండును."

మహారాజు మాటాడలేదు. ఆయన గంభీరుడయ్యెను. పిల్ల ఎచ్చటనో అంతఃపురములో నున్నది తనకు అది ఒక్క కూతురు. దాని జీవితము చిన్నతనముననే ఆరడియగుచున్నది. ఒక కన్య క్షత్రియ యగుటయే దోషము. బహు రాజన్య లోకము వలన దాని జీవితమున దానికి తెలియకయే రాజకీయములు ప్రవేశించుచున్నవి. పిల్లయేమో మేనబావను ప్రేమ చేయుచున్నది. రాజన్య లోకమున నే కొందరో తప్ప తక్కిన యందరును నతనిపై విరోధము చేయుచున్నారు. ప్రధానముగ జరాసంధుడు యాదవ రాజన్య మండలమున కెదురుగ నరి మండలమును నంతను మిత్రమండలముగ నను కూర్చుకొనుచున్నాడు. ఇది శ్రీ కృష్ణునకు తెలియదో! మహారాజున కా యాదవ వటువును చూడగా విచిత్రమైనది. అతని కీ విషయములే పట్టినట్లు లేదు. యాదవ రాజన్య మండలము గూడ నొక్క విధముగలేదు. ఉగ్రసేనుని రాచరికమును వారిలో నందరును అంగీకారము చేయుటలేదు. కంసుడు రాజుగా నుండగా నాతనియందనురక్తి నెరపిన వారందరను యదువృష్ణిభోజాంధకులైన రాజలం సున్నారు. వారు యదు రాజన్య మండలమున నంతశ్శత్రువువలె, ఇంటిలోని పాములవలె భయమును తెచ్చిపెట్టుచున్నారు. శ్రీ కృష్ణుడేలకో మిన్నకుండెను అనుకొని మహారాజు తనలో తాను నవ్వుకొనెను.

"మహారాజు తనలోనే తాము నవ్వుకొనుచున్నారు" అన్నది మహారాణి.

"కారణము లేకపోలేదు" అనినాడు ఆచార్య సాందీపని

ఆచార్యాణియు, రాజాధిదేవియు వారిని విచిత్రముగ చూచిరి.

ఆచార్యు డనినాడు:

"మహారాజ! మేము బ్రాహ్మణులముగదా! అనుష్ఠానములున్నవి. ద్విజులు గనుక తమకును యున్నవి. మేము పోయి వచ్చెదము."

మహారాజు సరియేనన్నారు. ప్రతీహారిని పిలిచి రథమును సిద్ధము చేయింపుమన్నారు

ఆచార్యాణి యన్నది

"జయత్సేన! మా రథమున్నది దారుకుడో, మాతలియో కట్టుకొని వచ్చెదరు. మరి ఇంకొక రథము నేల పూన్పవలయును!......"

మహారాజామెకు నమస్కరించినాడు. "తల్లీ! ఆచార్యులు నన్ను మహారాజా యన్నారు తమరు జయత్సేన యన్నారు. మా యమ్మ యన్నట్లన్నారు. మరి ఆచార్యులు నన్నట్లే సంబోధించవలెను.

"జయత్సేన! ఆచార్యులనే యడుగుము."

ఆచార్య సాందీపని మాటాడలేదు

"జయత్సేన! ఇక మేము పోవలయును" అనెను

"చిత్తము! స్వామి!"

అందరు మహారాజు నగ్నిమందిరమును వీడి యావలకు వచ్చిరి. వాకిట దారుక సారథికమైన రథము సిద్ధముగా నుండెను ఆ రథమును చూడగా మహారాజునకు నవ్వు వచ్చెను.

"తల్లీ! మీకు మంచి శిష్యుడు దొరికినాడు. మీ మనస్సులోని మాటగా రథము వచ్చి వాకిట నాగినది" అన్నాడు.

ఆచార్యాణి యన్నది·

'జయత్సేన! ఎన్ని రాజ్యముల తపస్సు పండినదో, నా తండ్రి నా ఇంటికి శిష్యరికము వచ్చినాడు. వాడు స్నాతకుడై పోవునాటి కొక ఇంటివానిని చేయనెంచుచున్నాను. నీ వేమందువు!"

మహారాజు ముఖము వివర్ణమైనది. ఎటులైనదనగా, ఆ వివర్ణమగుట యాయనకేగాని, మరియొక్కరికీ తెలియని విధముననైనది. అంతలో ఆయన తన్ను తాను సంబాళించుకొనెను. "తల్లీ! నన్ను అడిగి ఏమి లాభము. క్షత్రియులదంతయు పిల్ల ఇష్టము ననుసరించియు, పిల్లయొక్క తల్లి ఇష్టము ననుసరించియు జరుగును పిల్లదాని తల్లినే యడుగుడు. ఈ యాదవుల యాడుబడుచు నన్ను వరించగా, ఆ వసుదేవుడు తక్కిన రాజన్య లోకమును ధిక్కరించి నాకు నొసంగెను. మరి దీనిని తెచ్చుకొని నే నేమైతిని. యాదవుల చుట్టమును మాత్రమైతిని. నేను మిగలలేదు" అనినాడు,

రాజాధిదేవి యాయనను చురచుర చూచినది.

"తల్లీ! మహారాజు సంగతి తమకు తెలియనిదేమియున్నది. ఆయన యెప్పుడును అట్లు పుల్ల విరుపుగానే మాటాడును నిజము చెప్పమందురా! ఈయనతో నేను కాపురము చేయలేకపోవుచున్నాను. ఈ ఇంట కోడరికము చాల కష్టముగా నున్నది ."

మహారాజు గట్టిగా నవ్వినాడు.

"తల్లీ! దీని కొక యత్త యున్నది ఇప్పుడున్నట్లు. అమ్మ, ఈమె కాపురమునకు వచ్చిన క్రొత్త దినములలోననే పోయినది. అప్పుడు అందరును అనుకొనినారు......"

"ఏమి అనుకొనినారు మహారాజా! ఈ కోడలు మంచిదికాదనుకొనినారు. ఈమె పాద మెట్టెదనుకొని వారు. అంతియేనా ...." రాజాధిదేవికి కళ్ల నీళ్ల పర్యంతమును అయినది.

"ఆచార్య! ఆచార్యాణి! మీరలున్నారు. పైన భగవంతుడున్నాడు. నే నేమి యన్నాను. మా ఇంటి నరుస చూచినారుగదా: నే నేదో యందును అది ఇట్లు కుందును. నాకు దీనితో కాపురము చేయుట చేతనగుటలేదు......"

మహారాణికి నవ్వు వచ్చినది. "స్వామీ! తమకు పెద్దతన మెప్పుడు వచ్చును ...."

"చూచితిరా! ఆచార్య! నానప్రస్థమునకు సిద్ధముగా నన్ను పెద్దతన మెప్పుడు వచ్చుననుచున్నది. సరి సరి. ఆచార్యులకు వేళ యతిక్రమించుచున్నది. నేనును అగ్ని నారాధించవలయును. ఏమిరా! దారుక! మీ మహారాణి మాటలు నీకును నవ్వును కల్గించుచున్నవి. ఇంతకును మీ యానల్లని దేవు డెచ్చటనయ్యా! వచ్చినది మొదలు కన్పించలేదు. ... "

"తమ పుత్రులతో కలిసి కోటను తిలకించుచున్నారు."

"నిజముగనా!" అన్నది రాజాధిదేవి.

"ఓసి! రాజాధి! ఎంతయైనను వారును వారును మేనయత్త మేనమామ బిడ్డలు" అనినాడు మహారాజు.

"అందుకే వ్యవహార మిట్టులున్నది" అన్నది రాజాధిదేవి.

ఆచార్యుడును ఆచార్యాణియు రథము నధిరోహించిరి. దారుకుడు పగ్గములు సడల్చి గుర్రములను నడిపించినాడు. అవి వాని యాజ్ఞ మేరకు ముందు నెమ్మదిగ, తరువాత నాతి వేగముగా, అనంతరము వేగముగ ముందుకు సాగిపోయినవి. రథము పోయినంత మేర చూచుచు రాజును, రాణియు నట్టులే నిలుచుండిరి.

దూరమున కోట కొమ్మలలోనుండి వారికి వేణుగానము విననయ్యెను

"రాజాధి! మన కోట నేడు బృందావనమగుచున్నది" అనినాడు మహారాజు

"అంత అదృష్టమును తల్లి కాత్యాయని మన నుదుట వ్రాసినదా యని ఆలోచించుచున్నాను" అన్నది మహారాణి

జరత్ సాయం సంధ్యా బంధుర సుందర మందేహ రాక్షస జీవన సందేహమూర్తి సూర్యనారాయణమూర్తి ఆర్తిగనిన పశ్చిమ దిగంగనా సంగత బుద్ధి ప్రవర్థ వృద్ధ నారాయణమూర్తి అమ్మవారి యందలి పరమ శివుని ప్రేమమువలె భాసించెను.

మహారాజు ఏమియు ననక మహారాణిని చూచి హసించెను.

—హారీత శివశర్మ. ☆




### జరిగిన కథ

సిరిపాలెంలో సూరపరాజుకరణం సూర్యనారాయణగార్ల కుటుంబాలు ప్రశస్తికెక్కినవి. సూరపరాజు తల్లి లక్ష్మమ్మ. ఆ ఇంట పెద్దముత్తైదుగా రున్నది, సూర్యనారాయణకి నలుగురు పిల్లలు. ఆ ఊరికి వరదలువచ్చాయి నరసింహంగారూ, వచ్చారు అంతకుక్రితం కూరపాడులో వేంకట శాస్త్రిగారి కూతురు పెళ్లి మున్నుబు సాయంలో జరిగింది కాని,ఆమె మానభంగమైందనే అవమానంలో ఆత్మహత్య చేసుకుంది. శాస్త్రిగారు మరణించాడు ఆయన ఇల్లు తగలడిపోగా, కొడుకు మాయమయ్యాడు కొత్తగావచ్చి నరసింహం సూరపరాజు మద్దత్తులో సిరిపాలెంలో బడి పంతులయ్యాడు. సూరపరాజు కుమారుని వివాహం కారణంగా సూర్యనారాయణగారికి ఆయనకు స్పర్థ ఏర్పడుతుంది. సుబ్బారావు కుటుంబం ఆర్థికంగా చితికిపోతుంది సూరపరాజుగారి మరణానంతరం సుబ్బారావు విశాఖపట్నంలో కాంట్రాక్టు వ్యాపారంలో నష్టపడి ఇంటికి వస్తాడు. తన కుమారుడు సూర్యాన్ని ఎలాగో అలా స్కాలర్‌షిప్‌లు సంపాదించి కాలేజీలో చేర్పిస్తాడు

## 16
### ప్రణయం

సూర్యం కాలేజీచదువు స్కాలర్‌షిప్పు ఆధారం మీద అప్పుడప్పుడు నరసింహంగారి సహాయంతో సాగిపోతోంది. నరసింహంగారు అప్పుడప్పుడు వచ్చి కలుసుకుని అన్ని సదుపాయాలూ చూసి వెళ్లేవారు. సుబ్బారావు రాలేకపోయేవాడు తనలాంటి తండ్రి అని అక్కడ నలుగురూ చూస్తే కొడుక్కి నామర్దాగా ఉంటుందని భయపడేవాడు. సూర్యమే సెలవలకీ పండగలకీ ఇంటికి వెళ్లేవాడు. ఇంటికి వెడితేవాళ్లు పడుతూన్న యమయాతనలు చూసే గుండె తరుక్కుపోయేది. తనకి ఏదోవిధంగా కావలసినవన్నీ అమరుతున్నాయి. తమ్ముడికీ చెల్లాయికీ పండగలకేనా కొత్తబట్టలు లేవు. తండ్రి ఇంతయాతన సంసారం ఎలా నెట్టుకొస్తున్నాడో పాలుపొయ్యేదికాదు. తనుపైకివచ్చి తనతండ్రిని సుఖపెట్టాలని, తమ్ముణ్ణీ చెల్లెల్నీ పైకి తీసుకురావాలనీ కలలు కనేవాడు. తనేదో పెద్ద ఉద్యోగంలో ఉండి వూళ్లవీ తిరుగుతుంటే అమ్మానాన్న ఇంటిని కనిపెట్టుకునుండి హాయిగా కాలం గడుపుతున్నట్టూ, చెల్లెలికి మంచి సంబంధం చూసి పెళ్లిచేసినట్టూ, తమ్ముడికి తనలాంటి బాధలు లేకుండా చదువు చెప్పిస్తున్నట్టూ కలలొచ్చేవి ఆ కలల్లో ఎక్కడో మధ్యన తన 'కమల' కూడ ఉండేది.

సూర్యం బాగుండదని ఒకటి రెండుమాట్లు సిరిపాలెం కూడా వెళ్లాడు. అక్కడి అందరి ఎదటా పడి వాళ్ల సవాలక్ష ప్రశ్నలికి సమాధానం చెప్పడం చాలా కష్టమైనాను. నరసింహంగారింట్లోనే ఉండేవాడు. తమ పూర్వపు ఇంటికేసి చూస్తే కడుపు తరుక్కుపోయి కళ్ల నీళ్లొచ్చేసేవి. సాధ్యమైనంత ఆచాయలకే వెళ్లేవాడు కాదు. ఆ యింట్లో ఇప్పుడెవ్వరున్నారో కూడా కనుక్కునేందుకు ప్రయత్నం చేయలేదు ఎప్పుడునూ. తనకీ ఈ వూరికీ ఇంక ఏమిటి సంబంధం అనుకునేవాడు. అంతలోనే బెదురు కళ్లతో నవ్వుముఖంతో కమల కనబడేది. ఆ అమ్మాయికప్పటి కింకా పదకొండు, పన్నెండేళ్లు అంతే రోజు లింతగామారి ఉండకపోతే అప్పటికి పెళ్ళై అత్తవారింటికి వెళ్లిపోయే ఉండేది ఆ వయస్సుకే.

తన మనస్సు ఈ అమ్మాయివైపుకి మొగ్గుతోంది ఇది తన వయసువాళ్లకుండే సాధారణమైన ఆకర్షణో, అంతకంటె లోతైనదో తెలియదు. కాని ఇది ఇంతకన్న కొంచెం ముదిరితే తను నెగ్గుకురాగలడా. తనవాళ్ల నందర్నీవదిలి తను పెళ్లిచేసుకు తన సౌఖ్యం చూసుకుంటాడా. అయినా ఈ శాఖ భేదం అనే అడ్డుని దాటడం సాధ్యమేనా! ఇలా అనుకుంటూ ఉండేవాడు

కాలేజీకి వెళ్లాక కూడా అప్పుడప్పుడు సాయంత్రమప్పుడు కొంచెం దిగులుగా ఉండేవాడు. జనార్దనం "ఏరోయ్ దేవదాసూ. ఎవర్నైనా పార్వతిని ఒదిలేసి వచ్చావామీ ఊళ్లో" అనేవాడు.

## 17
### అనోరగ్జియాన్

ఇంటర్మీడియట్ ఫస్టుక్లాసులో 'రాంక్'లో

45—వ పేజీ చూడండి

# కథేనండి

యం. పూర్ణచంద్రరావు




"ఏమైనా సరే నే నిప్పుడు పెండ్లి చేసుకోను. చేసుకుంటే తెలుగు సినిమా చూసినంతొట్టు" అని దొడ్లో వున్న కుండ తెచ్చి బద్దలుకొట్టి మరీ చెప్పాడు. అప్పుడే సినిమా చూసొచ్చిన రఘు.

"ఏమిటోయ్ నీ పిచ్చివాగుడు. చెప్పేదేదో సరిగా చెప్పక అనవసరంగా కుండబద్దలు కొట్టట మెందుకు."

"ఎఫెక్ట్, అసలీ ఎఫెక్టులేకే మన సినిమా లిట్లా ఏడుస్తున్నాయి" అని సినిమాలను గురించి లెక్చర్ ఇవ్వబోయి, ఎదురుగావుంది తండ్రి అని గుర్తుకొచ్చి నాలుక కటుక్కున కొరుక్కొని, ఎవరు తల్చుకున్నారబ్బా అని, వారిని తల్చుకుంటూ వూరుకున్నాడు రఘు.

"అది సరేనోయ్! ఇప్పుడు నువ్వు పెళ్ళి చేసుకోటానికి వచ్చిన అడ్డంకేమిటి."

"అదికాదునాన్నా! ప్రతి వ్యక్తికీ జీవితంలో ఒక ఆదర్శముంటూ ఉంటుంది. నేను ఉద్యోగం దొరికేవరకు పెళ్ళి చేసుకోనని మీ కిదివరకే చెప్పాను. ఎప్పుడైనా అదృష్టం ఉద్యోగం రూపంలో వచ్చి, నన్ను వరిస్తేనే, నే నెవ్వరినైనా వరించేది" అంటూ జేబులో సిగరెట్ పాకెట్ తియ్యబోయి, ఎదురుగా ఉంది తండ్రి అని మళ్ళీ గుర్తుకొచ్చి ఊరుకొన్నాడు రఘు. రఘుకు ఏదైనా విషయం దొరికిందంటే దానిమీద ఎదుటివాళ్ళు విన్నా, వినకపోయినా లెక్చర్ దంచటం, లెక్చర్ దంచేటప్పుడు సిగరెట్ తాగటము అలవాటు. ఎం. ఏ. చదివి, లెక్చరర్ అవ్వాలనుకున్న రఘు, క్లాసులో సిగరెట్ తాగటానికి వీలులేదని ఆలోచించి బి. ఏ. మూడేళ్ళు చదివి, జనతా క్లాసు తెచ్చుకొని అదే ట్రయిన్‌లో ఇంటి కొచ్చేశాడు.

"చూస్తున్నాంగా అదృష్టం. రెండేళ్ళగా ఏ బాధ్యతా లేకుండా తిరుగుతున్నావు పెళ్ళి చేసుకుంటే పిల్ల అదృష్టంవల్లనైనా ఉద్యోగం వస్తుందేమో! నోరు మూసుకొని పెళ్ళి చేసుకో. (పెళ్ళప్పుడు మంత్రాలన్నీ చెప్పాలిగదా! నోరు మూసుకుంటే ఎట్లా అనే విట్టు వెయ్యటానికి జంకాడు రఘు) అన్నారు ఆడవాళ్ళ అదృష్టంమీద నమ్మకమున్న సూర్యనారాయణగారు. ఈ రెండేళ్ళగా ఆయన గ్రహించిన నగ్న సత్య మేమంటే, పెళ్ళికాని ఆడపిల్లనన్నా భరించొచ్చుగాని, ఉద్యోగంలేని కొడుకును పోషించటం కష్టం అని.

ఇక అక్కడ నిలబడితే తండ్రికి లొంగిపోవలసి వస్తుందని తన రూములోకివెళ్ళి, సిగరెట్ వెలిగించి, ఆ పెళ్ళివిషయం ఆలోచిస్తుండగా "రఘూ" అనే పిలుపు వినిపించింది. "నన్ను విసిగించకండి చెప్పేదేదో యిందాకనే చెప్పాను" అన్నాడు రఘు.

"మీ నాన్నకాదోయ్ ! నేను యిటుచూడు" అదే కంఠం ఆ మాటలు వచ్చినవైపే చూస్తూ ఆశ్చర్యపోయాడు రఘు. అచ్చం తనలాగే అద్దంలో వ్యక్తి తనవైపు తీక్షణంగా చూస్తున్నాడు. రఘు ధైర్యంచేసి "ఎవరు నువ్వు" అన్నాడు.

"ఇన్ని సినిమాలుచూచి నే నెవ్వరని అడుగుతావా, పిచ్చివాడా నేనే నువ్వు, నువ్వే నేను" అంది ప్రతిబింబం.

"ఓ నువ్వా! యిదేం సినిమాకాదుపో" అన్నాడు రఘు

"కాదు లేవోయ్ ! సినిమా అయితే నీలాంటి వాడు యిటువంటి సీనులో యాక్టు చెయ్యలేడు. దానికి చాలాఅనుభవం కావాలి, నా మాటవిని పెళ్ళి చేసుకో, ఉద్యోగం ఆదేవస్తుంది. అసలు మన దేశంలో యిప్పుడు నిరుద్యోగు లెక్కు వెందుకున్నారో యిదివర కింతమంది ఎందుకులేరో తెలుసా ? ఇప్పుడెవ్వడూ ఉద్యోగం వచ్చిందాకా పెళ్ళిచేసుకోవటంలేదు. పెళ్ళిచేసుకోందే ఉద్యోగంరావటంలేదు, కావాలంటే పెళ్ళిచేసుకొన్న తరువాత ఉద్యోగం వచ్చినవాళ్ళ కథలు చెబుతాను విను" అంది ప్రతిబింబం.

"నాకేం కథలక్కరలేదు, నేనూ చిట్కాలు చదివినవాణ్ణే కావాలంటె లక్ష కథలు నేనూ

చెబుతాను. మువ్విప్పుడన్నీచెప్పినా నేను పెళ్లిచేసు కోను.... చేసుకోను ... కోను'' అని కళ్లుమూసు కుని సినిమా డైలాగుల్లాచెప్పి కళ్లుతెరచిచూచి అద్దంలో వ్యక్తిలేడని తెలుసుకొని 'హమ్మయ్య' అని నిద్రకుఉప్రక్రమించాడు రఘు. కాని నిద్ర ఎలా పడుతుంది. పెళ్లిచేసుకోమని ఒకటేగోల, తనకు మాత్రం చేసుకోవాలనిలేదూ ! ఇప్పుడు ఉద్యోగం యిచ్చేవాడుంటే రేపే పెళ్లిచేసుకుంటాను. కాని ఆడవాళ్లమీద నమ్మకంలేని తనకు వాళ్ల అదృష్టం మీద నమ్మక మెలాకుదురుతుంది అదృష్టవంతుణ్ణి వెడిపేవాడూ లేడూ, దురదృష్ట వంతుణ్ణి బాగు చేసేవాడూ లేడన్నట్లు తనకు లక్ లేకపోతే, అదృష్ట వంతురాలైన భార్య దొరుకుతుందని గ్యారంటీ యేమిటి ? సంపాదన లేనివాడంటే కట్టుకున్న దానిదగ్గరనుంచి, కన్నతల్లిదాకా అందరికీ చులకనే. ఏమైనాసరే ఉద్యోగం సంపాదించాలి. ఉద్యోగం చూడరా అని ఆ హరిగాడికి రాస్తే నన్ను రమ్మం టాడు. కాని రెండుమూడు నెలలు ఉద్యోగం లేకుండా రోడ్లమీద తిరుగుతూ, ఎక్కడ కెళ్తున్నావని ఎవ డైనా అడిగితే ఆఫీసుకని సమాధానమిస్తూ, ఏ ఆఫీసుకు అంటే 'ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి' అని చెబుతూ గడపటానికి ఇబ్బందిపడిస్తాడు అని ఆలోచిస్తూ నిద్రపోయాడు రఘు.

మరునటిరోజే హరి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఇక్కడ ఉద్యోగం ఉంది వెంటనే రమ్మని. ఆరోజే హరికి టెలిగ్రామ్‌యిచ్చి, జి. టి లో ఖాళీలేక పాసింజర్‌లో హైదరాబాద్‌కు బయలు దేరాడు రఘు

హరి స్టేషన్‌లో స్వాగతం యిచ్చి, హోటల్‌లో టిఫిన్ యిప్పించి, తన రూముకు తీసుకొని వెళ్లాడు రఘును. రూము తాళం తీసి లోపలకువెళ్లి రఘు కోసం తిరిగిచూచాడు. రఘు గుడ్లు తేలవేసి గుమ్మం నుంచి యింటివైపు చూస్తున్నాడు.''

''ఒరేయ్ ! నన్ని రూములో నాలుగు కాలాల పాటు వుండనివ్వరా బాబూ ! నాలుగు నెలలు తిరిగి సంపాదించుకున్నాను.'' అని రఘును లోపలకు లాక్కువచ్చి కూర్చోబెట్టాడు.

''నా మనసు దోచుకొన్న ఆ సుందరాంగి పేరేమి'' అన్నాడు రఘు.

''సోర్మయ్యిరా ఫూల్, ఉద్యోగంకోసం వచ్చిన వాడివి నీ పనినీవు చూసుకోక వెధవ వేషాలేమిటిరా, పైగా ఉద్యోగం దొరికేదాకా పెళ్లిచేసుకోనన్నావట కదూ'' అంటూ కసిరాడు హరి.

''అన్నాను కాని''అనిఆగి కేలండర్‌చూసి, టైము చూసుకొని ఒక నిముషం రెండున్నర సెకండులు ఆగి ''నేనా అమ్మాయిని ప్రేమించాను'' అన్నాడు ముహూర్తము మంచిదేనని.

''అబ్బ ! చాలాగొప్పపని చేశావుకాని వెధవవేషాలు వెయ్యక 'ఈ బుక్ చదువు రేపు యింటర్వ్యూకు వెళ్ళాలి నువ్వు''

''ఒక బుక్కేమిటి, మహాభారతం ప్రపంచసాస్త్రవ్ వగైరా పుస్తకాలన్నీ అప్పచెబుతాను ఆ కోమలాంగిపేరు చెబితే.''

అవన్నీ వద్దుగాని నేను యింటర్వ్యూలో అడిగి నట్లు, నాలుగు ప్రశ్నలు అడుగుతాను. సమాధానం చెప్పు, నీకెంత తెలివుందో కొంతైనా తెలుస్తుంది''

''షైనావాడిలాగా దావురించావురా బాబూ! సరే అడుగు'' అన్నాడు రఘు.

''నువ్వు జాన్సన్ ఉత్తరాలు'' ఎప్పుడైనా చదివావా ?''

''లేదు, నాకు ఇతరుల ఉత్తరాలు చదవటం బొత్తిగా అలవాటులేదు. నన్నడిగితే పెద్ద దురలవా టంటాను'' అంటూ సిగరెట్ వెలిగించి, ఇంకా ఏదో చెప్పబోయాడు రఘు

''తగ్గరా తగ్గు, ఇట్లా ఇంటర్వ్యూలో సమాధాన మిచ్చావంటే దేశంలో ప్రతి ఆఫీసుకు నీ ఫోటో పంపిస్తారు ఉద్యోగం ఇవ్వవద్దని'' అనాడు హరి.

''లేకపోతే ఏమిటోయ్! ఈ ఇంటర్వ్యూ చేసే వాళ్లకు బుద్ధిలేదు నా—ఎన్—శా ఎవడైతే మనకెందుకు, ఎవరెన్ని ఎంత ఎత్తుంటే మన కెందుకు ఇవి తెలియకపోతే ఆఫీసుపనే చెయ్యలేరా! నాకే ఉద్యోగాలిచ్చే అర్హతవుంటే ఎవడు ముందు అప్లై చేస్తే వాడికే ఇస్తాను'' అని క్లుప్తంగా ముగించాడు రఘు కిటికీలోంచి బయటకుచూస్తూ.

కిటికీలోనుంచి, బెదిరిన చూపులతో, అజంతా శిల్పంలాగా రెండు జడలతో (అజంతా శిల్పానికి రెండు జడలుంటయ్యని అర్థంకాదు) తనవైపే చూస్తున్న సుకుమారి లావణ్యాన్నిచూస్తూ తనను తానే మరచిపోయి, మెలికలు తిరిగిపోతున్నాడు రఘు ఇంతలో 'మాలతీ' అనే పిలుపు వినిపించి, 'వస్తున్నా' అంటూ ఇంట్లోకి వెళ్లిందా సుందరి. మంచి కల సగంలో మెలకువ వచ్చినట్లుయింది రఘుకు.

''వదలిపోయింది పీడతో నాజూకుగా'' అంటూ హరినేను ''తిరిగి నువ్వు చెప్పకపోతే తెలిదనా,ఆవాలిపేరు పేరు మాలతి, ఆమె పలుకే వీణా స్రవంతి, దోచు కుంది నామతి, కావా లామె నాసతి, నీవేరా నాగతి'' అంటూ హరికాళ్లు పట్టుకున్నాడు ఇదే కాళ్లనుకో అన్నట్లుగా. ఆనాడు వసుదేవుడంతటివాడు గాడిద కాళ్లు పట్టుకునాడు, నే నీ గాడిద కాళ్లు పట్టు కుంటే తప్పేమిటనే ధైర్యంతో.

''మిత్రమా ఈ విషయంలో నేనేమీ చెయ్య లేను. నువ్వే చూసుకో. కథ అడ్డం తిరిగి, ఇక్కడి నుంచి వెళ్లగొడితే. నాకు వేరే రూముచూసే బాధ్యత మాత్రం నీ భుజాలమీద వేసుకో'' అనాడు హరి.

''అట్లా అంటే ఎలారా బాబూ! ఉదాహరణకి ఈమధ్య ఎన్ని కథలలో నాయకులకు స్నేహితులు సాయం చెయ్యలేదు నువ్వు కూడా అటా గేచేసి



కథ ముగించి గొప్పవాడివైపో''

''ఏమీ లాభంలేదు'' అన్నాడు హరి విలన్‌లాగా.

''ఇంతేనా నీ స్నేహం. ఒక్కసారి మనం చదువు కున్న రోజులు గుర్తుతెచ్చుకో. ఒకే హోటల్‌లో భోజనంచేసి, ఒకే రూములో పండుకొనేవాళ్ళం, అదంతా మరచిపోయి, ఆపదలోఉన్న స్నేహితుడిని ఆదుకోటానికి కూడా మనసొప్పటంలేదా! ఆహా! కాల మెంత మారిపోయింది.''

''అవును. అరగంటయ్యింది నువ్వు బోరు మొదలుపెట్టి'' అన్నాడు హరి. ''అదీకాక, ఈ కథ

44-వ పేజీ చూడండి

# అందాలకు చిట్కాలు

## వైరాణి

ఇవి కేవలం చిట్కాలుమాత్రమే కాబట్టి సౌందర్య పోషణకి సంబంధించిన సూచనలు కొన్నిచేస్తాను—అంతే!

ఈసారి 'మేకప్' గురించి కొంచెం చెబుతాను. 'మేకప్' అంటే ఏమిటో అందరికీ తెలుసు! అయినా కొంచెం విపులంగా చెప్పాలంటే, పవ్‌డర్, స్నో మొదలగువవి వాడటాన్నే 'మేకప్' అంటారు.

మేకప్ ఉద్దేశ్యం ఏమిటి ? ప్రతి వ్యక్తి మొహం లోనూ కొన్ని భాగాలు తక్కినవాటి కంటే అందం గానూ ఉండొచ్చు — లేదా మరోవిధంగానూ ఉండొచ్చు. మేకప్ సాధనాలతో వీటి రూపాన్ని కొద్దిగా మార్చి, అందం ఎక్కువ అయినదనే భావం చూసేవారిలో కలిగించటమే!

### ఫవుండేషన్ :

మొహంమీద పవ్‌డర్ సరిగ్గా నిలిచేందుకు 'ఫవుండేషన్' (స్నో, పవ్‌డర్‌ల లాగే ఇది సౌందర్య సాధనాల కోసం వాడే పరిభాషలో ఒక పదం!) అవసరం. అంతేకాక, చర్మంలో ఎత్తుపల్లాలు సమంగా కనిపించేట్టు చేసి, చర్మసౌందర్యం అధికంగా అవటానికి ఫవుండేషన్ తోడ్పడుతుంది.

'వానిషింగ్ క్రీమ్, స్నో' మొదలయినవి ఘన రూపంలో ఉన్న ఫవుండేషన్‌లు. ద్రవరూపంలో ఉన్న ఫవుండేషన్‌లు సయితం బజారులో దొరుకుతాయి.

(ఇటీవల, పవ్‌డర్‌లు కలిపిన ఫవుండేషన్‌లు కూడా దొరుకుతున్నాయి.)

ఫవుండేషన్‌లు తెలుపులోనే కాక రంగు రంగులు గానూ లభ్యమవుతాయి. మేకప్ జాగ్రత్తగా వేసుకునేవారు ఈ 'సూత్రాలు' పాటించొచ్చు. కళ్ల కింద చర్మం రంగుని బట్టి ఫవుండేషన్ రంగులు మార్చుకోవచ్చు. కొంచెం వల్లగా ఉంటే లేత రంగు ఫవుండేషన్, కొంచెం పాలిపోయి ఉంటే ముదురు రంగుది. ముక్కు వెడల్పు తక్కువగా కనిపించాలనుకుంటే రెండు వైపులా ముదురు రంగు ఫౌండేషన్ వాడాలి. గడ్డంకింద మరొక 'గడ్డం' వస్తూఉంటేనూ ఇటువంటిదే వాడాలి. గడ్డం చిన్నదిగా ఉందనుకుంటే లేతరంగు ఫవుండేషన్ ఉపయోగించాలి.

ఫవుండేషన్ ఎలా పట్టించడం ? ముందు, చుక్కలు చుక్కలుగా మొహంమీదంతా పెట్టి, క్రమంగా వేళ్లతో చర్మంమీద అన్ని భాగాలపైనా సమంగా అంటేట్లు పట్టించాలి.

కింద పెదవి దిగువ నుండే పల్లంలోనూ, ముక్కుకి ఇరువైపులా, దట్టంగా, రెండు మూడు 'పొరలు' గా ఫవుండేషన్ పట్టే ప్రమాదం ఉంది! ఇది మాత్రం జరుగనివ్వరాదు.!!

మెడమీదా, గొంతుకమీదా ఫవుండేషన్ వాడటం మర్చిపోకండి. ముదురుపైన పట్టించేటప్పుడు జుట్టుకి మరీ దగ్గరగా రాస్తే పవ్‌డర్, ముద్దలు ముద్దలుగా అంటుకోవచ్చు. ఈ భాగాలలో శుభ్రముగా తుడిచెయ్యాలి కనురెప్పలమీద పట్టించటం చాలా అవసరం.

గమనిక—కళ్లకి కాటుక పెట్టుకునేవాళ్ళు ఫవుండేషన్ ఉపయోగించిన తర్వాత పెట్టుకుంటే మంచిది. (బుగ్గలకు రూజ్—రంగు! కూడా ఇప్పుడే వెయ్యాలి.)

### పవ్‌డర్‌లు :

వ్యక్తినిబట్టి పవ్‌డర్ రకం నిర్ణయించాలి. చర్మం రంగు, స్వభావం, వాటిని మనస్సులో ఉంచుకుని పవ్‌డర్ కొనండి. కొద్దిగా, జిడ్డుగా ఉండే చర్మాలకు 'హెవీ' (Heavy) గా ఉండేవి ఉపయోగించాలి. (ఇవన్నీ ఇంగ్లీషు పేర్లతోనే అమ్ముతారు కాబట్టి పై పదాన్ని వాడాను.) పొడిగా ఉండే చర్మానికి 'లైట్' (Light) పవ్‌డర్‌లు బావుంటాయి.

పవ్‌డర్ సరియైన పద్ధతిలో వాడితే చాలాసేపు చెదరిపోకుండా ఉంటుంది ముఖ్యంగా గమనించదగ్గ విషయం—ధారాళంగా వాడండి మీకెంత అవసరం అనుకుంటారో దానికంటే అధికంగా వాడండి.

దూదితోగాని, పఫ్‌తోగాని పట్టిస్తున్నా రనుకోండి — దానిని పవ్‌డర్ బాగా అద్దుకోవాలి. తర్వాత దానిని గట్టిగా చర్మం మీదకు నొక్కాలి. ఒక నిముషం అలాగే వదిలెయ్యండి. (పగటివేషంలా కనిపించినా సరే!) ఆపైన, సున్నితంగా ఎక్కువగా ఉన్న పవ్‌డర్‌ని తీసెయ్యండి.

నుదురుమీద అడ్డంగానూ, మొహంమీద మిగతా భాగాలమీద నిలువుగా, కిందుగానూ దులపాలి. ఇది చాలాముఖ్యం! (ముఖంమీద చిన్న చిన్న వెంట్రుకలుంటాయి. ఇవి కిందుగా మొలుస్తాయి.)

పవ్‌డర్ చాలాసేపు అలాగే ఉండాలనుకుంటే — చల్లని నీళ్లతో, బహుకొద్దిగా తడిపిన దూదితో, పవ్‌డర్‌వేసిన ముఖంమీద అద్ది కొన్నిసెకండ్ల తర్వాత మరొకసారి పవ్‌డర్ వెయ్యాలి చెమట బాగా కారే సమయాలలో ఈ పద్ధతి పనికొస్తుంది.

### కనుబొమలు :

కొందరు వాటికి రంగు వేస్తారు ముఖ్యంగా గమనించవలసినది—ఏదీ అతి చెయ్యకండి! చివరలను పైగా 'దువ్వండి'—బ్రష్‌తో.

### మరో చిట్కా :

పొద్దువపూట మేకప్ వాడవలసివస్తే, మొదటిసారి కొంచెం ముదురురంగు పవ్‌డర్‌వాడి, దానిమీద లేతరంగు పవ్‌డర్ మళ్లీ అద్దండి!

### లిప్‌స్టిక్ :

పత్రికలలో ప్రకటనలనుబట్టి వీటి వాడుక ఎక్కువవుతున్నట్లు తోస్తుంది. ఏమైనా, మనిషికి సరిపడ్డరంగు 'ఎన్ను'కోవటం చాలాముఖ్యం.

ప్రయోగం ఎలా ? బ్రష్‌తోవేస్తే 'ఫలితాలు' బాగా ఉంటాయి. బొమ్మలకి రంగువేసినట్లే లిప్‌స్టిక్, పెదిమలకు వెయ్యాలి. అధరాలు ఎంతవరకూ ఉంటాయో లిప్‌స్టిక్‌కూడా అంతవరకే వాడండి.

కాని, కొన్ని చిట్కాలు గుర్తుంచుకున్నా తప్పులేదు : నోరు చిన్నదనుకుంటే అంచులమీద కొంచెం ముదురురంగు లిప్‌స్టిక్ కొద్దిగా వాడొచ్చు. పెద్దదిగా ఉందనిపిస్తే ముందుగా కొంచెం లేత రంగు ఫవుండేషన్‌వాడి దానిమీద లిప్‌స్టిక్ ప్రయోగించాలి

### ఇంకో చిట్కా :

మధ్యాహ్నం మేకప్ చేసుకోవలసివస్తే ? ముందు మొహంమీద మేకప్ ఏదన్నా ఉంటే, పూర్తిగా శుభ్రంచేసి కొత్త మేకప్ వాడటం మంచిది! పవ్‌డర్‌రంగు కొంచెం నదరుగా ఉంటే బావుంటుంది

ముఖ్యమైన గమనిక — ఏది ఎలాఉన్నా, దేశకాల పరిస్థితులనుబట్టి అలంకరణచేసుకోవాలి, చిట్కాలన్నీ తర్వాతే!

**పై వారాలలో మరికొన్ని చిట్కాలు— ఏయే [illegible]**

## మనోబలం

ఒక వైపు తల్లి దండ్రులను పిల్లల మనస్తత్వం తెలుసుకోమని, కాలానికి ఎదురీదడం వ్యతిరేకమనీ వుద్బోధచేస్తూ, వరకట్నాలు, కులగోత్రాల పట్టింపులు మంచికంటే చెడే ఎక్కువ చేస్తున్నాయని చెప్తుతూ 'ప్రేమకలాపాలు' దగ్గరకు వచ్చే సరికి నీళ్ళునములారు మరి యీ 'ప్రేమకలాపాల' వల్ల కులగోత్రాలు, వరకట్నాల బెడదవుండదుగా! ఇందులో కూడా తల్లిదండ్రులు కాలానుగుణ్యాన్ని ఎందుకు నడచుకోకూడదు ? 'స్త్రీ'లలో ఆత్మహత్యలకు చాలావరకు కారణం వారి ప్రేమవివాహాలని తల్లిదండ్రులు ఆమోదించకపోగా వారిమీద కొన్ని ఆంక్షలను వుంచడం రచయిత్రిగారికి యీ ప్రేమ వివాహాలంటే కినుక ఎందుకో ?

వి. యల్ నడిమింటి (హైదరాబాదు)

## విమర్శ

'వనితావాణి'లో వ్యాసాలు ఏమీ బాగుండటము లేదని కొందరు సోదరీమణులు వ్రాస్తున్నారు.

# వనితావాణి

కథలుగా వాటిపై ఒక అభిప్రాయం ఉంచుకొని విమర్శించటానికి కాదండి అవి నిత్యజీవితంలో అలాంటి సంఘటనల నెదుర్కొనే వారికి ఉపయోగపడటానికి

'సిటీలో సినిమాలు', 'భార్యలు బానిసలా', 'చదువుకొన్నవారికేనా గర్వం !' ఇవేనా సమస్యలంటే అని వ్రాశారు ఒకసోదరి తెలివితేటలు లేనివారికన్ని సమస్యలే గదండి ?

భార్యలను బానిసలుగా ఉపయోగించుకొని బాధించేవారు లేరా ? నిత్యజీవితంలో ఉపయోగించుకొనేవి వ్రాయమన్నారు ఉపయోగించుకొంటే ఇవి అన్నియు ఉపయోగములే

మనము వ్రాయకపోయినా వ్రాసినవారిని చిన్న చిన్న తప్పులకు అంతపెద్దదిగా విమర్శించటము బావుండలేదు.

సమార్తి ప్రమీల. (పెనమల్లి)

## సవరించుకోవలసిన లోపాలు

స్త్రీలలోకూడ సవరించుకోవలసిన లోపాలు చాలా కలవు స్త్రీ స్వేచ్ఛగా మాట్లాడితే అనుమానించే భర్తలు వుంటారు అటువంటి అప్పుడు వాళ్ళ దాంపత్యం నరకంతో సమానంగా వుంటుంది. అప్పుడు తనలోనికొన్ని మార్పులను, పద్ధతులను మార్చుకుంటే వాళ్ళ సంసారం సుఖంగా వుంటుంది స్త్రీ స్వేచ్ఛగా మాట్లాడటం తప్పుకాదు. పురుషులు, స్త్రీలు, సమానస్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను గుర్తెరిగిననాడు మాట్లాడుతె పర్వాలేదు కేవలం పురుషులలోనేకాదు లోపాలు స్త్రీలలోకూడ ఉన్నవి. యిద్దరుకలిసి వాటిని సవరించుకుంటే చాలా బాగుంటుందని నా అభిప్రాయం

శ్రీమతి జి రాఘవులు (తుంగతుర్తి)

★

# వంటలు

## నూరేళ్ళు నిలిచిన వంట

## రసగుల్లా

క్రొత్తొక వింత, పాతొక రోత అన్నారు పెద్దవాళ్లు. కాని కొన్నాళ్లకి కొత్తమీది మోజుపోయి పాత చింతకాయే పసందుగా వుంటుంది జనానికి. (వేవిళ్ల వాళ్ళకు ఊరుగాయ మోజు మామూలుగా) కొత్తను కొన్నాళ్ళ పాటు అట్టే పాతను పైకి తీయటంలో ఈ కొత్తపాతల కలయికలో మరొక కొత్త విషయం బయటపడ్తుంది అన్నీ అలాటివే. ఆఖరికి బెంగాలీ పిండివంట రసగుల్లా కూడా. అదిప్పటికి 96 ఏళ్ళ నుంచి బెంగాలీ ప్రజలకు ప్రియమైన తినుబండారాల్లో ఒకటి.

అన్ని చరిత్రలమాదిరే రసగుల్లా చరిత్రకూడా. 19వ శతాబ్దంలో తెల్లవారి ఆచారాలు, అలవాట్లు వస్త్రాలమీద మోజు పెరిగిపోతున్న రోజుల్లో, పాతకాలపు వంటలను పునరుద్ధరించాలని కొంతమంది చేసిన ప్రయత్నమే ఈ బెంగాలీ రసగుల్లా ఏర్పడటానికి కారణం.

అన్ని శాస్త్ర పరిశోధనలు మాదిరిగాను బెంగాలీవారు పిండి వంటలపైన కూడా పరిశోధన సాగించారు. కొత్త పరిశోధనవల్ల పిండి బదులుగా సెనగపిండి పదార్థాన్ని ఉండగా తయారుచేసి, చిక్కని పంచదార పాకంలో విరిసిపోకుండా ఉడకపెట్టేవారు. (బహుశా బెంగాలీ లందరికీ దీర్ఘ కాలిక అజీర్ణ వ్యాధిఉండటంవల్లనేమో) ఇదేంబ్రహ్మవిద్యా? అనుకోనేరు! బ్రహ్మవిద్యకన్న గొప్పది! అదివరకు పరిశోధనలన్నీ, ఉండగా కలవక విరిసిపోవటం వల్లనే పాడైపోయాయి!

ఏదైనా కొత్తది కనిపెట్టచ్చు. కాని ప్రచారం మార్గం కష్టం. ఈ రసగుల్లా తయారుచేసిన నబీన్ దాస్ అనే ఆయన దీని ప్రచారంలోకి తీసుకువచ్చి అమ్మటమెలాగా అని ఆలోచించాడు జిలేబీలమీద మోజు పెరిగిన జనం, అసలు దీన్ని కొనేవాళ్లు కారు.

చివరకు నబీన్ దాస్ కలకత్తాలో బాఘ్‌బజార్ ప్రాంతంలో ఉన్న ఓ మార్వారీ మిత్రుణ్ణి పట్టుకున్నాడు. ఆయన ఈ రసగుల్లామీద పెద్ద పెద్ద ఉపన్యాసలిచ్చి, మిత్రులకు విందులో రసగుల్లాలు పందారం చేసి దీన్ని ప్రచారంలోకి తీసి కొచ్చాడు.

నబీన్ దాస్ మిత్రుడొకాయన తన ఇంట్లో రసగుల్లా తయారు చేయాలనుకున్నాడు కాని ఫలితం దక్కలే సెనగపిండి విరిసిపోవటం మొదలెట్టింది. ఆయన కొంచెం పిండి, పాలు కలిపి ముద్ద చేసేందుకుపయోగించి చూశాడు బాగానే వచ్చిందిగాని రసగుల్లాకున్న రుచి లేదుట. అందుకని ఆ వుండల్ని నేతిలో వేయించి పంచదార పాకంలో నానపెట్టాడు అదే రసగుల్లా నుంచి పుట్టిన పంతువా, ఇప్పటికీ బాగా ప్రచారంలో ఉన్న ఇంకో పిండి వంట

పై రెండు పిండివంటల నుంచి ఇంకా కొన్ని పిండివంటలు పుట్టాయి. రసగుల్లా రుచి తప్పుతున్నప్పుడు మళ్లీ పంచదార పాకంలో ఉడకబెట్టితే వచ్చిన పిండి వంట దాన్‌దార్ అంటారు.

నబీన్ దాస్ వంశం వాళ్ళకు ఇప్పటికి కూడా ఈ రసగుల్లా తయారీలో చాలా సిద్ధహస్తులని పేరుంది.

★

# Eight new fashion-fresh colours!




Choose your shade of creamy HI-FI lipstick from this exciting range! Luscious, light, bright colours from party pinks through golden-orange tones to brilliant clear reds.

# MAX FACTOR

SOLE SELLING AGENTS **T. T. KRISHNAMACHARI & CO.**

BOMBAY - CALCUTTA - DELHI - MADRAS

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జీర్ణాశయ వ్రణములు: వాటి చికిత్స

ఆధునిక శరీర ధర్మశాస్త్రరీత్యా మనస్థితినిబట్టి శరీరం ఏవిధంగా మారుతున్నది?

కండరములు ఇచ్ఛాధీనములనీ, అనిచ్ఛాధీనము లనీ రెండు రకములుగదా? ఇందులో ఇచ్ఛాధీన కండరములు, వాటికిపోయే నర శాఖలను ప్రేరే పిస్తే సంకోచమును పొందుతవి లేదా మెదడు నుంచి వచ్చే ఆదేశములవల్ల సంకోచ వ్యాకోచములను పొందుతవి. ఈ కండరములకు ప్రారంభాంతమనీ, (Origin) ప్రవేశాంతమనీ (Insertion) రెండు అగ్రములు ఉంటవి సంకోచకాలంలో ఇచ్ఛాధీన కండరం ప్రవే శాంతమునుంచి ప్రారంభాంతమువైపుకు మాత్రమే పోతుంది ఈ అంతములు సాధారణంగా కీలుకు అటూ, ఇటూవున్న రెండు ఎముకలను అతుక్కొని ఉంటవి ఇందులో కొన్ని కీలును వంచేవి. కొన్ని బాచేవి. ఈ విభేదమునుబట్టి కండరం ప్రారం భాంతము ఏర్పడుతుంది అంటే ఇచ్ఛాధీన కండ రముల సంకోచము ఒకే దిశలో జరుగుతుందన్న మాట.

అనిచ్ఛాధీన కండరముల సంకోచము ఇట్లా కాదు. అవి ఏ వైపుకైనా జరగవచ్చును. ప్రేగుల్లో తరంగ చలనము పైనించి క్రిందికీ ఏర్పడవచ్చును క్రిందినుంచి పైకి పోవచ్చును స్థానికంగా ఉంగరం లాగా బిగుసుకుని పోవచ్చును. ఈ చలనములన్నీ అనిచ్ఛాధీన నరములు మెదడునుంచి వచ్చే ఆదేశ ములు ప్రేరేపించినప్పుడు జరుగుతవి జీర్ణకోశం అంతటిలోనూ ఇచ్ఛాధీన కండరం ఒక పోగు కూడా లేదు

భయము, దుఃఖము, క్రోధము మొదలయిన ఉద్రేకములు ఏర్పడగానే ఆర్టెరీలు సంకోచించ డమో, వ్యాకోచించడమో జరుగుతుంది ఈ మార్పు సింపతెటిక్ పేరా సింపతెటిక్ నరముల ద్వారా జరుగుతుంది సింపతెటిక్ నరములవల్ల సంకోచం జరిగితే, పేరా సింపతెటిక్ నరములు వ్యాకో చం కలిగిస్తవి పేరా సింపతెటిక్ నరములు సంకో చం కలిగిస్తే సింపతెటిక్ నరములు వ్యాకోచం కలిగిస్తవి. ఇట్లా స్వచ్ఛంద నరాశయంలోవుండే రెండు భాగములు, అన్యోన్యము, విరుద్ధములై, శరీర కార్యక్రమం స్వస్థంగా జరిగిపోడానికి ప్రయ త్నిస్తూ ఉంటవి. వీటిమధ్య ఈ సమన్వయమును చేసే శక్తి ఏదో నిర్వచించలేము. 'ప్రాణశక్తి' అంటే వివాదం ఉండదు మనస్సు, బుద్ధి, అహంకారం మహత్‌అనే ప్రాణశక్తి విచక్షణను, ఆధునిక విజ్ఞానం ఇంకా కనుక్కోలేదు. మనలో ఒకపని చేయుమనీ ప్రేరేపించే శక్తీ, అదే సమయంలో ఆపని చేయ వద్దని చెప్పే శక్తీ రెండూ ఉన్నవి ఇది అనుభవ సిద్ధమైన సత్యము. ఈ రెంటినీ మనస్సు, "బుద్ధి" అని మనవారు నిర్వచించారు ఈ రెంటికీ సంఘ ర్షణ వ్యాధి హేతువవుతుంది భయము, దుఃఖము ఆర్టెరీలను కేపిలరీలను విస్తరింపినందున మెదడులో నెత్తురుపోటు తగ్గి, మైకం వస్తుంది ఈ స్థితిని మూర్ఛావస్థ అంటాము. కోపము అధికమైనప్పుడు ఆర్టెరీలు సంకోచిస్తవి ఈ సంకోచం ఆర్టెరీ పొడుగునా జరగదు. అది స్థానికం కావచ్చును అటువంటి సంకోచం శిరస్సులో జరిగినప్పుడు ఆర్టెరీ, బుడిపెలాగా ఉబ్బి, సన్నిహితములయిన మెదడు భాగములను నొక్కవచ్చును. అప్పుడు శరీరంలో కండరములూ, ముఖంలోవుండే కండ రములూ దవడ కండరములూ, బలవత్తరంగా సమన్వయ రహితంగా సంకోచిస్తవి కనుబొమలు దగ్గిరబడడం, పళ్లు పటపట కొరకడం, గుప్పిటి బిగించడం, బిళ్ళ బిగుసుకుపోవడం జరుగుతుంది. ఆ సమయంలో ఆర్టెరీవల్ల మెదడుకు కలిగే ఒత్తిడి నుండి మెదడును కాపాడడానికై, చర్మంలో, ముఖ్యంగా ముఖ చర్మంలోవుండే కేపిలరీలు విస్త రించి, కోపంవల్ల కలిగిన నెత్తురుపోటును తగ్గించ డానికి ప్రయత్నిస్తవి. అందుకే కోపం అధికమై నప్పుడు ముఖం కందగడ్డలాగా ఎర్రబడిపోతుంది భయాతిరేకంతో ఆర్టెరీలు విస్తరించి నెత్తురు పోటు తగ్గిపోతుంది అప్పుడు ముఖంలోవుండే కేపిలరీలు సంకోచించి మెదడులో నెత్తురుపోటును పెంచడానికి ప్రయత్నిస్తవి అందువల్ల మొఖం తెల్లబడి పోతుంది తప్పు పని చేస్తూ, పట్టుబడి నప్పుడూ, భయమూ, ఆందోళన కలిగి కేపిలరీలు సంకోచిస్తవి అందుకే "తెల్ల మొఖంవేస్తారు" ఈ స్థానికమయిన ఆర్టెరీ సంకోచం శరీరంలో ఏ ప్రదేశంలోనయినా జరగవచ్చు ఏ ఉద్రేకం, ఏ ప్రదేశంలో ఆర్టెరీలను సంకోచిస్తుందో నిశ్చ యంగా చెప్పలేము శరీర కార్యక్రమాన్నీ, ముఖ్యంగా గ్రంధుల స్పందనాన్నీ అనిచ్ఛాధీన కండరముల సంకో చాన్నీ శాసించడానికి మెదడులో కేంద్రములున్నవి. జుగుప్స కలిగినప్పుడు వాంతి కేంద్రం ప్రేరేపితమై వాంతి చేసుకుంటాము పట్టరానికోపం వచ్చినప్పుడు పసరుతిత్తిని శాసించే కేంద్రం ఉద్రిక్తమై, పసరు కడుపులోకి వచ్చి వాంతి అవుతుంది మాన సికస్థితికీ, శరీర కార్యక్రమానికీ ఎంత సంబంధం ఉన్నదో నిరూపించడానికి ఈ అనుభవములే చాలును ఇవన్నీ తెలిసి జరిగే మార్పులు, మనకు తెలియ కుండానే దీర్ఘమయిన ఆందోళన, ఆశాభంగం వల్ల కలిగే దుఃఖం ఆప్తనష్టంవల్ల కలిగే శోకం, అవమాన జనితమైన వ్యధ శరీరంలో ఎన్నో మార్పు లను నిరంతరం కలిగిస్తూనే వుండి, అనిచ్ఛాధీన కండరములలో స్థానికములయిన మార్పులను కలి గిస్తూ ఉంటవి. ఆర్టెరీలు సంకోచించినప్పుడు పరిసర ప్రాంతములకు రక్తం సరిగా ప్రసరిం చదు హృదయానికి రక్తం సరఫరాచేసే కారొనరీ ఆర్టెరీ (Coronary Artery) మహత్తర మైన ఉద్రేకం కలిగినప్పుడు హఠాత్తుగా సంకోచించి మూసుకుపోవచ్చును. ఈ ఉద్రేకం క్రోధాది నిరానందకరములయిన ఉద్రేకములవల్ల మాత్రమే జరగదు. పట్టరాని ఆనందంవల్ల కూ ఈ వివరీత సంకోచం ఏర్పడవచ్చును అందుకే నిరుపేదకు లక్ష రూపాయల లాటరీలో వచ్చిందని తెలిసినప్పుడు గుండె ఆ పోవడం జరగవచ్చు. స్థానికంగా అనిచ్ఛాధీన కం రములు సంకోచించినప్పుడు సన్నిహితములయి ధాతువులు చిట్లవచ్చును. ఆవిధంగా ఏర్పడిన గాయ మానడానికి కొంతకాలం పట్టవచ్చును. ఏ కారణ వల్ల ఈ పని జరుగుతున్నదో ఆ కారణం నిత్యమూ అనుక్షణమూ జరుగుతున్నప్పుడు దెబ్బమీద దెబ్బ తగిలినట్లు ఆ గాయం పెద్దది కావచ్చును. ఒ మాటు 'జీర్ణకాశంలో అతి సున్నితమయిన మ్యూక మెంబ్రేనులో 'భంగం' (Interuption ఏర్పడితే, దానికి కొంతకాలం విశ్రాంతి చిక్కితేగాని అది మానదు. కాని, జీర్ణకోశం నిత్యమూ సంకో వ్యాకోచములను పొందుతూనే ఉంటుంది. అందుల గ్రంధులు స్పందించడమో, స్పందించకపోవడమో జరుగుతూనే వుంటుంది. ఒక్కొక్కప్పుడు విప తంగా స్పందించి, ఆ తర్వాత స్పందించకనే పోవడమూ జరుగుతుంది

తల్లి కడుపులో అనుకూలమైన శీతోష్ణ స్థితీ, నిశ్చయమయిన ఆహారప్రాప్తి సంరక్ష లోని పిండం బయటికివచ్చి, శిశువై, తన వూపి తను తీసుకుని, తన పాలు తను జీర్ణించుకు వరకూ, భయంకరమైన ఆందోళన లోనే ఉంటుంది ఇలా జీవితమే ఆందోళనతో ప్రారంభమౌతుంది దైహిక మానసికావసరములు, దుఃఖరహితంగా క్షేమ కరంగా లభించే జీవిత విధానాన్ని, ప్రతి జీవీ కాంక్షి స్తుంది అందుకు ప్రయత్నిస్తుంది. ఆ ప్రయ త్నంలో విజయానికి ఒక్క విజ్ఞానం మాత్రమే చాలదు. జీవితంలో నైసర్గిక వ్యత్యాసాలను వివరించ గలిగిన అధివిజ్ఞానం కావాలి

ఇది యుగ సంధి, పూర్వాభిప్రాయాలు పోయి నూతనాభిప్రాయాలు వస్తున్నవి. తల్లిదండ్రు లకూ, పిల్లలకూ, భార్యా భర్తలకూ, సోదరులకు స్నేహితులకు మధ్య నిత్య జీవితంలో అనుక్షణమూ బేదాభిప్రాయాలు, కొట్లాటలు, ఎక్కువౌతున్నవి అనుకూల పరిస్థితులలోవున్నవారు, తమమీద ఆర్థికం గానో, ఆపేక్షకోసమో ఆధారపడేవారిని తూలనా డడం, తిరస్కరించడం అవమానించడం, అధిక మౌతున్నది వారితో తెగ త్రెంపులు చేసుకోలేక, వారుచేసే చిత్రవధ భరించలేక, క్షణ మొకయుగంగా గడపడం జరుగుతున్నది ఈ పరిస్థితులు శరీరంలో ఏ మార్పులు కలిగిస్తవో సోదాహరణంగా వివరించ డానికి, వివరంగా వ్రాశాను. ఆందోళన లన్నిం టిలోనూ, ప్రేమకీ, వ్యక్తిత్వానికీ ఏర్పడే సంఘ ర్షణ ప్రభావం జీర్ణకోశంలో భయంకర పరి

45 వ పేజీ చూడండి.





## నీతి శతకం

తినదగు నెవ్వరు పెట్టిన
తినినంతనె త్రేన్పులిడక క్షీణిల పడదగున్
తిని, రుచియు, నరుచి యెరిగిన
మనుజుడె మఖభోజనుండు మహిలో సుమతీ!

ఎప్పటి కెయ్యది దొరకిన
నప్పటి కా తిండి తినుచు, అన్యులతోడన్
చెప్పించక, తా చెప్పక
తప్పించుక తినెడివాడు ధీరుడు సుమతీ!

అప్పిచ్చు లావములతో
నెప్పుడు భోజనముపెట్టు ఇళ్లో, హొటలో
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు జొరకుము సుమతీ!

అక్కరకు రాని వంటను
మ్రొక్కిన నొక కప్పు టీని పోయని హితునిన్
చక్కెర వేయని కాఫీ
గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ!

కనకపు పళ్లెరమందున
తినుబండారములు పెట్టి తినుమని కోరన్
తిన చేతకాని ధీరుడు
వెనుదిరుగక పారిపోవు వినరా సుమతీ!

పి. ఎస్. రంగారావు (భద్రాచలం)

* * *

సోమయ్యగారూ ఆయన శ్రీమతీ కలిసి కారులో ప్రయాణం చేస్తూఉండగా అది బోల్తా పడి కాలిపోయింది. వెంటనే కారు భీమా చేసిన కంపెనీవద్దకు వెళ్లారు. భీమా కంపెనీవారు కొత్త కారు ఇప్పిస్తామన్నారు.

"పైకం ఇప్పించరా?"

లేదు కొత్త కారు మాత్రమే! ఏం వెళ్లి పోతున్నారు?"

"అబ్బే, ఏంలేదు, జీవిత భీమా కంపెనీకి పోతున్నా. నా భార్య జీవితం భీమా చేయించాను, అదృష్టవశాత్తూ!"

* * *




## అత్రయం

ప్రజలంతా నాయకులైతే
నాయకులే ప్రభువులు అయితే
ఆ ప్రభువులు ప్రజలై ఉంటే
చూడాలని నా కొక వేడుక!

ప్రేక్షకులే తారలు అయితే
ఆ తారలు దర్శకులైతే
దర్శకులే ప్రేక్షకులైతే
చూడాలని నా కొక వేడుక!

పార్టీలే క్లీడర్లయితే
క్లీడర్లే జడ్జీలైతే
జడ్జీలే పార్టీలైతే
చూడాలని నా కొక వేడుక!

పేషంట్లే నర్సులు అయితే
ఆ నర్సులు డాక్టర్లయితే
డాక్టరులే పేషెంట్లయితే
చూడాలని నా కొక వేడుక!

మానవులే తాపసు లయితే
తాపసులే దైవాలయితే
దైవాలే మానవులయితే
చూడాలని నా కొక వేడుక!

పాఠకులంతా రచయితలైతే
రచయితలే సంపాదకులైతే
సంపాదకులే చదువరులైతే
చూడాలని నా కొక వేడుక!

మీరంతా మేమే అయితే
మేమంతా మనమే అయితే

మనసంతా ఒకటే అయితే
చూడాలని నా కొక వేడుక!
(శ్రీశ్రీ అద్వైతానికి అనుసరణ)

'శ్రీశ్రీ'

* * *

## హితోక్తులు

అక్కరకు రాని 'బస్సు'ను
చక్కగ 'సినిమా'కు రాక సణిగెడు భార్యన్
ఉక్కగ నుండెడి ఇంటిని
గ్రక్కున విడిచేసి పోవ గలుగును సౌఖ్యం 1

తప్పుల బట్టెడివానిని
గుప్పున పొగ మొగమునూదు గడుసరివానిన్
అప్పిచ్చి అడుగువానిని
చెప్పుతో కొట్టంగవలయుచెలువముతోడన్ 2

కేలంగి లేని 'పిక్చరు'
"జాలీ"గా బ్రతుకనీని జాయను మరియున్
తాలింపు లేని కూరను
పాలే లేనట్టి 'కాఫీ' వదిలెయ్ భాయీ. 3

అడుగడుగు కాగిపోయెడి
మిడిమేలపు 'బస్సు'నమ్మి మిడుకుటకంటెన్
వడిగల రిక్షా కట్టుక
వడివడిగా బోవచ్చు పొంథా వినరా. 4

హోటలుకు స్నేహితులతో
ధాటిగ బోబోకు వారు తమ తమ బిల్లుల్
మూటిగ నీ ముందుంచియు
మాటాడక పోదురయ్య మహిలో మనుజా. 5

వి. వి. హనుమంతాచార్యులు (చిట్టిగూడూరు)

* * *

ఒక పెద్దమనిషి బోనెక్కి సాక్ష్యమిచ్చేముందు, నిజం చెప్తానని ప్రమాణం చేశాడు. ఆ సాక్ష్యం ప్రారంభించి పది మాటలు చెప్పేలోపల న్యాయవాది పదిసార్లు అడ్డుకొన్నాడు.

"అయ్యా నా కంగా తికమకగా ఉంది. ఏం చెయ్యమంటారు." అంటూ అసలు సంగతి బయట పెట్టాడు.

"నేను నిజం చెప్పబోతున్నప్పుడల్లా న్యాయవాది అడ్డుకుంటున్నాడు."

రమామణి (పొన్నూరు) ★

## పడుప్రభావం — బి. వి. సత్యమూర్తి











# సరాగమాల

వి ఎ కె రంగారావు

ఆమధ్య పాఠకులు కొందరు నన్ను విమర్శించారు రెండువారాలు వరుసగా దక్షిణామూర్తినే విమర్శించానని, తక్కిన ఇమిటేషన్ సంగీతకారుల గురించి వ్రాయలేదని నేను వారి గురించి ఒకేసారి వ్రాశాను కాని, స్థలాభావంచేత రెండుగా విభజింపబడి, రెండు వారాల సరాగమాలలో వచ్చింది మరొక సంగతి, దక్షిణామూర్తి ప్రసక్తి వచ్చింది కాబట్టి వారి సంగతి చెప్పుకొన్నాము ఆ తదుపరివారం రాజన్—నాగేంద్రుల ప్రసక్తి వచ్చింది కాబట్టి వారి సంగతి అనుకొన్నాము తక్కిన సంగీత దర్శకుల సంగతి రాలేదు కాబట్టి వాళ్ళమీద దండయాత్ర చేయలేదు అంతేగాని, తక్కిన వాళ్ళెవ్వరూ అనుకరణ సంగీతాన్ని వినిపించలేదని నా ఉద్దేశం కాదు తెలుగు సినిమాలలో నాటకపు సంగీతం, మరాఠీ మెట్లు నుకాక, కొత్త సంగీతం వినిపించినవారిలో ప్రథములైన శ్రీ బిఎన్నార్ దగ్గరనుంచి, ఇటీవల ఈ రంగంలో ప్రవేశించిన బి శంకర్రావుదాకా అందరూ ఎప్పుడో ఒకప్పుడు కాపీ సంగీత పానము చేసినవారే కాదని యెందుకంటాము ఎలాగ అనగలము?

పైగా దక్షిణామూర్తిగారికి, నాకూ ఎటువంటి వైరమూలేదు వారి సంగీతమంటే నా కెంతో గౌరవం అందుకోసమే అంత పరిశీలనగా వారి గురించి బహిరంగంగా ఆలోచించవలసి వచ్చింది ఎవరైన సలహాలు, మంచివారికి, పైకి వచ్చేవారికి, ఇతోధిక ప్రజ్ఞావంతులకే ఇస్తారుగాని, మూర్ఖులకు, వెడ్డవారికి, బుద్ధిమాంద్యులకు ఇవ్వరు ఏమంటారు?

* * *

తెలుగు సినిమాలలో వినపడిన ఇతర భాషల పాటలు: "అపూర్వ సహోదరులు" చిత్రంలో "వళ్ళిక్కన్నైంద మురుగేశన్" తమిళం, "బణ్ణ వుట్ట హెణ్ణ కండు" కన్నడం, "కడకణ్ణిన్ తలప్పత్తు" మళయాళం, "ఆజా రాజా మేరే" హిందీ, "వరుడు కావాలి"లో "మనోహరా" సింహళం, "కృష్ణ నీ బేగనే బారో" కన్నడం, "ఇవరుక్కుం తెనక్కుం" తమిళం, "నీలా కరుమ్గిల్" మళయాళం, పై పాటలన్నీ భానుమతి పాడినవే "మై హస్తీ గాతీ ఆ ఈ", "పుష్పాంకి రాణీ" మీనా కపూర్ పాడిన హిందీ పాటలు, "నా యిల్లు" చిత్రంలోనివి, మొదటిది తెరపై విద్యావతి పాడుతుంది. రెండవది నృత్య నాటికలో మేనక పాత్రధారిణి పాడుతుంది "వచ్చిన కోడలు నచ్చింది" లో జమున పాడిన టిక్కీ పాటలు: తమిళం, "వినాల్ ఇన్నువెన్", కన్నడం "తకధిమి తకధిమి", మళయాళం "వాడాద మలరిల్లా", హిందీ "ఇస్ మెహఫిల్ మే" ఇవన్నీ కాక, హితకాంపు నటుడు ప్రభాకరరావు తీసిన "ఇది మా కథ", ఉరవు "మంగళసూత్రం", ఉరవు "ఎక్స్‌క్యూస్‌మి" చిత్రంలో "తెల్లారిందోళ" పాటలో తమిళ, హిందీ భాషల్లో రెండేసి పంక్తులున్నట్లు జ్ఞాపకం

ఒకరిద్దరు సంస్కృత గీతాల గురించి వ్రాశారు ఇతర భాషలన్నప్పుడు నా ఉద్దేశంలో సంస్కృతం లేదు కనుక వాటి గురించి వ్రాయుడంలేదు

* * *

దాదాపు సంవత్సరం క్రిందట శివుని గురించి ఒక పౌరాణిక చిత్రం విడుదలైనది ఆ చిత్రానికి సంగీతం సమకూర్చినవారితో నే నన్నాను టైటిల్సు చూపేటప్పుడుగాని, వేరే ఏదైనా సన్నివేశంలోగాని కాని "శివ దీక్షాపరురాలనురా" గాత్రమునగాని, వాద్యగోష్ఠినగాని వినిపించకూడదా అని. వారు హేళనగా నవ్వి, నాకు నచ్చే పోకడలన్నీ పాత కాలపువే అని వెక్కిరించి, అటువంటి ముసలి పాటలు పెడితే చివరికి ఆ సినిమాలు చూసేవాడిని నే నొక్కడినే ఉంటానని అన్నారు.

ఆ సంగీత దర్శకులే నాతోపాటు శంభూవారి ఆఫీసుకువచ్చి, అదేపాట జావకి పాడినది టావులో ఉంటే విని ఆనందించి తలవూపేరు. అయినా నా భ్రమకాని, ఘనం శీనయ్యగారి ఘనమైన పదములకు కొత్త పథములు ఏర్పరచటానికి రాజేశ్వరావే ఉండాలి. పాడటానికి జానకే రావాలి. ఈ రెండిటికన్న ముఖ్యం ఇటువంటి సంగీత సృష్టిని ఎన్నుకొని దానిని తగిన విధంగా తెరకు తర్జుమా జేయటానికి బి. ఎన్. వంటి మహా మేధావియే ఉండాలి. లేకపోతే

"ఎక్కడనే బధిరునకు మగ్రాత సంపదసేరు?
ఎక్కడనే నపుంసకుడు సర్వాంగ సుందరితీరు కై?
ఎక్కడనే మదిరాసక్తుడు స్వరసాహిత్య సుధను గ్రోలి?
నిత్యముగ రసజ్ఞ రసిక, సరసజ్ఞాలుండ వలయు గాని?



వాసవీ వారి తొలి చిత్రంలో బేబీ తార పద్మిని

**శ్రీకృష్ణార్జున యుద్ధం జి ఇ 35332**

ఎన్నో మంచి పాటలున్న ఈ చిత్రంలోని అత్యుత్తమమైనవి రెండూ పై రికార్డుగా విడుదల చేశారు శ్రోతల అదృష్టం "నీకై వేచితినయ్యా ఏకాంత రామయ్యా" పాట సాహిత్యం కొత్తదనం ఏమంతకాదు ఒకచోట "చిగురాకుల సడివిన్నను" ప్రేమ లేఖల పాట గుర్తుకు వస్తుంది కాని, ఆ పాతదనం ఏమాత్రం కనపడకుండా పెండ్యాల, సుశీల దీనికి సమ్మోహనమంత్రం వేశారు ఈ పాటను పెండ్యాల తమ కిష్టమైన పీలూరాగంలో చేశారు. కాబట్టి తమ ప్రేమ ప్రభావం ప్రతి సంగతిలోను తెలుస్తున్నది నిజమేమరి కోకిలకు కంఠం ఏకాలంలోనైనా ఉంటుంది కాని, మధురంగా పాడేది వసంతంలోనేగా? వీరు పెట్టిన సంగతులకు పెట్టి పుట్టినదో యున్నట్లు, సుశీల తన కంఠ మాధుర్యాన్ని సువర్ణరేఖలుగా గారించారు ఈ పాటను విన్నవారు కోల్పావారి చిత్రంలో "ప్రభోగిరిధారి" (సంగీతం పెండ్యాల, కంఠం సుశీల, కలం రాజశ్రీ) విన్నంతవరకు మరచిపోతారు అప్పటి నుంచి హాయికి పర్యాయపదాలుగా ఈ రెండు పాటలను గుర్తుపెట్టుకుంటారు

రెండవప్రక్క పెండ్యాల సంగీతమూ, పింగళి సాహిత్యమూ, ఎస్వరలక్ష్మి స్వరమూ దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న బృందగానం" "వేయి శుభములు కలుగు" పెండ్యాల సంగీతం శ్రీరాగంలో వుంది పింగళి రచన అంపకాలపాటల శైలిలోవుంది ఎస్వర లక్ష్మి స్వరం సుస్వరాల వరాలలక్ష్మిగావుంది "వేయి సుభములుకలుగు" తరువాత "నీకు" అన్నపుడు వరలక్ష్మి వరప్రసాద కంఠంలో పలికిన బరువు మరొక కంఠంలో పలుకదేమో ? బృందం కూడా కలిసి పాడటం, అందులో "మరదలా" అని



"కృష్ణార్జున యుద్ధం"లో శ్రీరంజనీ, రామారావు, సరోజాదేవి.



"వాల్మీకి"లో రామారావు.



అన్నపూర్ణావారి చిత్రంలో రేలంగీ, సూర్యకాంతం.




(గత సంచిక తరువాయి)

ఆ తర్వాత కొంతకాలం రంగభాష్యం నన్ను అప్పు డప్పుడు కలుసుకుని మాట్లాడ్డానికి వస్తూ ఉండే ాడు. భూమిమీద పాదం మోపి అతను నడు ్తున్నట్టుగానే తోచలేదు. ఆనందసాగరంలో తేలు ుతున్నాడు. ఈ రోజుల్లో అతనికి దేన్ని చూసినా ందంగా కన్పడేది. ఆనందంగానే ఉండేది.

సీతాకోకచిలుక ఎగురుతుంటే చూస్తే 'శివంజీ! ేస్తారూ! ఆ సీతాకోకచిలుకని చూడండి! అది ంగు రెక్కల్ని కొట్టుకుంటూ ఎగరటం ఎంత ందంగా ఉంది" అంటాడు.

కిటికీ గుండా ఆకాశాన్ని చూసి "ఆహా! ఆకాశంలో స్వచ్ఛమైన నీలంరంగు ఎంత అందంగా ఉందో కదా!" అంటాడు.

అదే ఆకాశంలో మేఘాలు ఉన్నప్పుడు,

"ఆహా! తెల్లదూది పింజల్లాగ ఈ మేఘాలు ఎంత అందంగా ఉన్నాయో కదా! దానిమీద సూర్య కాంతి పడి ఒకే బంగారుచ్ఛాయగా అయిపోతోంది చూశారా" అంటాడు.

"ఆహా! ఈ చల్లని పిల్లవాయువుకి ఇంత హాయి, సుఖం ఎలా వచ్చిందో కదా? 'మందమారుతం' అని పెద్దలు తెలియకుండానా చెప్పారు?" అంటాడు.

ఒక్కొక్కసారి మనసు విప్పి ఇంకా ...చెం మాట్లాడుతాడు.

"మేస్త్రారూ! ఈ వింతని గురించి మీరేమి టంటారు? నేను మాలతిని కలుసుకున్నది కొన్ని నెలలు ముందర మాత్రమే అని నావల్ల నమ్మ శక్యం గాకుండా ఉంది. ఎన్నో సంవత్సరాలుగా, ఎన్నో యుగ యుగాలుగా కలసి మెలసినట్లుగా ఉంది!" అని ఒకసారి చెప్పాడు.

"ఆదంతా సరేనయ్యా! పెళ్లి భోజనం ఎప్పుడు పెడ్తావు చెప్పు! తేదీ నిశ్చయమయిందా చెప్పు?" అని ప్రశ్నించాను.

"తేదీ నిశ్చయమయితే మీకు తెలియకుండా ఎలా

40 వ పేజీ చూడండి



"వాసవి" వారి తొలి చిత్రంలో కృష్ణకుమారి.

## పురోగతి

సుకేవంతి ! 1962 లో 1961 కన్నా మన వాళ్ళు మన దేశంలో జయిప్రోపులు ఎక్కువ తీశారు మనవాళ్ళు 1961 లో 297 సినిమాలు మొత్తం తీశారు పోయినేడాదిలో 312 సినిమాలు తీశారు ఇందులో బొంబాయి 119, కలకత్తా 47, మద్రాస్ 146 ఉన్నాయి ఐతే ఇందులో హిందీ 90 చిత్రాలు, తెలుగు 48, తమిళం 60 చిత్రాలు ఉన్నాయని అంచనా అంటే మన తెలుగు కంటే మన అరవ చిత్రాల సంఖ్య ఎక్కువ అన్నమాట.

## ఎదురీత

### [వెండితెర నవల]

సిం ఐ వి. వారి ఎదురీత వెండితెర నవలను గురించి పోయిన వారమే చెప్పాము దీని రూప కల్పన శ్రీ 'గాయమ్' చేశారు ఇందులో ఇంచు మించు అన్ని పేజీల్లోను ఆకర్షణీయంగా చిత్రంలోని స్టిల్స్ వేశారు. గెటప్ ధర (75 న పై) రెండూ బాగున్నాయి

*　　*　　*

కథా రచయితలకూ కూడా ఒక 'స్టేటస్' రావడం ముదావహం అఖిలభారత స్థాయిని రెండు మెరిటు సర్టిఫికేట్లు ఫీచర్ చిత్రాల కథా రచయితలకు ఇస్తారు. అవార్డుకు చిత్రాలు చేరె ఆఖరు తేదీ ఫిబ్రవరి 1వ తేదీ అని తెలుస్తోంది

*　　*　　*

## అవీ - ఇవీ - అన్నీ

పంజాబ్ దేశంలో యుద్ధం అంటే ఉత్సాహంగా ముందుకు వస్తారు. అసలు సిక్కు రక్షణ నిధికై చేసినంత త్యాగం తరిమ్మా రాష్ట్రాల వాళ్ళు చేయలేకపోయారేమో కూడా.

అయితే వీరి ప్రభుత్వ మంత్రులు కూడా యీ విషయంలో ముందుకు వచ్చి చైనా, భారత సంగ్రామం గురించి ఓ సినిమా తీస్తున్నవాళ్ళకి అది మంచి కథ అని తోస్తే అప్పుగా పెట్టుబడి యివ్వాలని నిర్ణయించుకున్నారు.

## విశిష్టమైన నటన

ప్రటేక్ అంటే మూడుపార్లు కాని గత వాలుగు సం॥ లుగా మద్రాసు ఫిలిం ఫాన్సు సంఘంవారి అవార్డు పుచ్చుకుంటున్న ప్రజ్ఞాశాలి శ్రీ గుమ్మడి. ఈ క్యారక్టర్ ఆక్టర్ ప్రతిభ అనుపమావారి 'అందా జోడూ'లో ఉత్తమ స్థాయిలో మనం చూడగలమని రషన్ చూసినవారు అంటున్నారు. శ్రీ గుమ్మడి స్వయంప్రతిభ, అందుకు తోడుగా మంచి కళా తపన్న గల నటుడు. ఈయన ఈ చిత్రంలోని పాత్రకు ఒక వైచిత్ర్యాన్ని, విశిష్టతను చేకూర్చగల రనడంలో సందేహ మక్కరలేదు.

## చైతన్యం

చైతన్యమూర్తి మహాపురుషుడు అయిన స్వామి వివేకానందుని జీవితం ఆధారంగా రూపొందించిన చిత్రం "స్వామి వివేకానంద" ను ప్రదర్శించే హక్కులు రామకృష్ణ సేవాసమితి "ఢిల్లీ" వారు తీసుకున్నారని, దీనిని స్కూళ్ళల్లోనూ, కాలేజీల్లోనూ వేస్తారని వార్త. నిజంగా యిది శుభవార్త. వెనుకటికి బుద్ధజయంతి వేశారు, అది దండగ. ఈ వివేకానందుని గురించి మనం ఎంత ఎక్కువ తెల్సుకుంటే అంత ఒంటికీ, మనసుకీ మంచిది. ప్రభుత్వం యీ చిత్రంమీద టాక్సు తీసేశారు. మంచిపనే చేశారు.

## హిందీ చిత్రాలగురించి

ఫూలోంకీ సేజ్ చిత్రానికి తొలిసారిగా రచయిత ఇందర్ రాజ్ ఆనంద్ దర్శకత్వం వహిస్తున్నాడు.

ఈ చిత్రానికి మన శ్రీ ఆదినారాయణరావు నిర్మాత అయినే దీనికి సంగీతం యిస్తున్నారు. పాటలు చాలా బాగుంటాయని యిప్పుడే అనుకున్నా మనం, అవేశ నిరాశ చెందం. ఈమధ్య మద్రాసులో ఈ చిత్రం తాలూకు షాట్స్—అశోక్‌కుమార్, వైజయంతీమాల మొదలగువారు ఉన్నవి తీశారు.

*　　*　　*

"నర్తకీ" అనే చిత్రాన్ని ప్రఖ్యాత నితిన్‌బోస్ పూర్తిచేశారని త్వరలో మీదకు వదుల్తారని తెలుస్తోంది.

## ఏనుగు 'తార'

ప్రసాద్ ప్రొడక్షన్స్ (ప్రై.) లి. తీస్తున్న "జిక్కీ" చిత్రంలో ఒక ఏనుగును బుక్ చేసుకున్నారు. ప్రస్తుతం ఈ ఏనుగు జెమినీ సర్కస్సులో ఉద్యోగం చేస్తోంది. ఈ చిత్రంలోని నాయిక ఆశాపరేఖ్ దీనితో ఈమధ్యనే దోస్తీ చేసింది.

## సాజ్ ఔర్ ఆవాజ్

సుబోధ్ ముఖర్జీ దర్శకత్వాన "సాజ్ అవుర్ అవాజ్" అనే చిత్రం ఔట్‌డోర్ షూటింగు రాజస్థాన్ మధ్యప్రదేశ్‌లో జోరుగా సాగుతుంది.



"వాల్మీకి"లో రాజసులోచన.

## కొత్త చిత్రం

చిత్రకళా ప్రొడక్షన్సువారి నెం 2 చిత్రానికి ప్రారంభోత్సవం సంక్రాంతినాడు వాహినిలో చేశారు. వీరు తీస్తున్న ఈ చిత్రానికి ఆధారం తమిళ చిత్రం "పోలీసుకారన్ మగళ్" ఇందులో గుమ్మడి, జగ్గయ్య, రమణారెడ్డి, రాజశ్రీ మొదలగు వారు నటిస్తారు. తాపీ చాణక్య దర్శకుడు.

—పి. కృష్ణానంద్.

'తెరమీద - తెరవెనుక'
కొత్త సినిమా శీర్షిక
ఎదురు చూడండి!



"విజయనగర వీరపుత్రుడు"లో ఒక దృశ్యం



"వారసత్వం" చిత్రంలో రేలంగి, పేకేటి, రాజనాల మొదలగు వారు.



### జరిగిన కథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు, భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది సంపన్న కుటుంబీకుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు. ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్ళిపోతాడు. గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు, సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది ఆమె భర్త చనిపోయి రెండు నెలలైంది ఆర్యాపురంలో ఆమెకు యిల్లువుంది అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటే ఆకర్షణ ఏర్పడుతుంది. శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు. కాలేజీ విద్యార్థిని నళిని వేణూని ప్రేమిస్తుంది

## 6

శ్రీదేవి రోజూ మధ్యాహ్నంపూట వచ్చి సుభద్రమ్మ దగ్గర కత్తిరింపులూ, కుట్టడం నేర్చుకుంటూ ఉండేది. వేణు ఆమెతో ఏదో ఒక అవకాశం కల్పించుకొని మాట్లాడుతూండేవాడు శ్రీదేవి హృదయంలో వేణుకు ఒక ముఖ్యస్థానం ఏర్పడింది అతనంటే ఒక రకమైన ఇష్టం కూడా ఏర్పడింది కాని, ఆమె దృష్టిలో తన ఆశయాలన్నీ తీర్చేవాడుగా గాని, తన ఆదర్శాలకు తగినవాడుగా గాని అతను కన్పించలేదు సహజంగా ఆమె వ్యక్తులలోని మంచి బుద్ధినీ, త్యాగాన్నీ, ఉపకార గుణాన్నీ ప్రేమిస్తుంది. వేణులో అటువంటి గుణాలేమీ ఆమెకు కన్పించలేదు ముఖ్యంగా అతను బద్ధకస్తుడూ, స్వార్థపరుడుగా అతను చిన్న పని కూడా తను చేసుకోకుండా ఎవరైనా చేసిపెడ్తే సంతోషిస్తాడు సుభద్రమ్మకు ఏ విషయంలో కూడా అతనివల్ల సాయంలేదు. కాని, తన వస్త్రాలూ, వస్తువులూ శుభ్రంగా ఉంచుకుంటాడు. ఎప్పుడూ సరదాగా నవ్వుతూ, మాట్లాడతాడు. అతనితో ఎంతసేపు మాట్లాడినా విసుగనిపించదు. అందువల్ల స్నేహితుడుగా అతను శ్రీదేవికి చాలా దగ్గరకు వచ్చాడు అంతేకాకుండా అతను తనమీద ఎంతో శ్రద్ధ చూపిస్తున్నాడు. అతని మాటలూ, చేష్టలూ

36– పేజీ చూడండి

# పెద్ద కష్టం

వి. ఆర్. తాళ్ళూరి

"ఏంరా! మరి మీ ఉద్దేశ మేంటి?" ముగ్గురి ముఖాల్ని చదవాలని ప్రయత్నించాడు సుబ్బన్న.

పెద్దవాడు వెంకటరత్నం అందుకున్నాడు "మావయ్యా! నీకిదేం న్యాయం గాదు. పెద్దోడికి పెళ్ళి కాకుండా, చిన్నోడికి పెళ్ళిచేసేస్తే అంతా ఏవంటారు చెప్పు? పెద్దోడికి లేనిపోని వంకలు తగిలించరూ అంతా?? ముందే చిన్నోడికి పెళ్ళెందు కయ్యిందీ?" అని అడిగి మూడుముళ్ళూ వెయ్యనిస్తారా ఈ జన్మంలో?"

"అదంతా నా కవసరం ఆలోచించుకుని రేపు పొద్దుటికి ఏ మాటా చెప్పండి! రేపు మధ్యాహ్నం కొమార దేవ పోల్నాత్తున్నారు." సుబ్బన్న లేచి, లోనికి వెళ్ళిపోయాడు. తలుపు చాటునున్న లక్ష్మి అతని కళ్ళకి కనుపించలేదు కానిట్లో బిందె నేసుకుని నూతికేసి వెళ్ళిపోయాడు

మౌనంగా ముగ్గురు అన్నదమ్ములూ లేచి ఇంటికి బయలుదేరారు "ఏం చేద్దాంరా మరి? అడిగినన్ని వెయ్యి ఇచ్చి రాములుకి పెళ్లి చెయ్యడమేనా......?" అన్నగార్నుద్దేశిస్తూ సుబ్బారావు బాధగా ప్రశ్నించాడు.

జవాబుగా రత్నయ్య, "ఊ." అని మాత్రం అనగలిగేడు.

"అవును సుబ్బన్నకి వెయ్యిచ్చి రాములుకి పెళ్లి చేసేస్తే .. గంగరాజునేం చెయ్యాలి? రాములు కోసం సుబ్బన్న కూతురుందనేగా వెయ్యిరూపాయలతో గంగరాజుకి పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నది. సుబ్బన్న ఇంతటి విశ్వాసంలేనోడా? ఏదో మొంలో తను నోటితోనే "రాములుకి పెళ్లి గంగరాజు కయ్యేవరకూ చెయ్యం" అనిపించి, నేం తమ మీదేరుద్ది, కూతుర్ని మరొకళ్ళ కివ్వాలనుకుంటున్నాడా? మనసంటూ ఉన్నవాడు చేసే పనేనా ఇది? కాదు డబ్బు కావాల్సిప్పుడు వాడికి కాసులు చూసి ఊసులు మార్చేరకం వాడు ఇప్పు డది తమదగ్గరలేవు. అందుకే అంత అలుసయ్యింది

"సుబ్బన్నా! రాములు నీ అల్లుడౌతాడని మాటియ్యా!.... మాటియ్యి" ఆయాసంగా బరువుగా చెయ్యిచాపేడు నారాయుడు మరణశయ్య మీదినుంచి.

"అలాగేబావా! రాములు నా అల్లుడు పదా!" చేతిలో చెయ్యివేసి మరీ చెప్పేడు సుబ్బన్న.

తలదగ్గర కూర్చున్న రాములు చేతిని ఆ చేతిలో పెట్టి, ఆయాసంగా, ఆనందంగా ఊపిరి పీల్చుకొన్నాడు నారాయుడు "ఒరే సుబ్బన్నా! నా కిక బతకాలనిలేదురా ఈ బాధతో. నేను తప్పిపోతే బావుండిపోను" అన్నాడు బాధగా.

ఆ మర్నాడే ఆ ముసలి ప్రాణం గుటుక్కు మన్నది

ఆ సుబ్బన్నేనా నేడు .. కాదు.....వాడికి నేటికి పదిహేనేళ్ళ దూరం ఆడికి నారాయుడు మర్చిపోలేదు.... నేటికి అయ్యోకాదు మరెన్నో తెలుసు అప్పటికీ, ఇప్పటికీ ఇంతో అంతో తేడా రానేవచ్చింది. వెయ్యిన్నర రూపాయలు పోసి తమూ, సుబ్బారావు పెళ్లిళ్ళు చేసుకున్నారు. పెళ్లికావోళ్లతో గంగయ్యని విడిచి సుబ్బన్న అప్పుడే చిన్నోడు రాములు పెళ్లికావా లంటున్నాడు. దానికోసం వెయ్యి రూపాయలు ఇమ్మంటున్నాడు. లేకపోయిందో, మరో వారానికల్లా లక్ష్మి మరొకళ్ళ కోడలై పోతుంది. అంతేనా?. . జరగవలసిందేనా ఊహూ మరి .. రాములు పెళ్లి చేసేస్తే .ఊహూ! గంగరాజునేం చెయ్యాలి ముందే వాడి పెళ్ళి జరగాలి! పెద్దింటోళ్ళు పెళ్ళికూతుర్ని డబ్బియ్యమంటారు లేనోళ్ళు పెళ్లి కూతురుకే ఎదురిచ్చుకోడం రివాజు డబ్బిచ్చుకోలేకే కాస్త కలవాళ్లే పిల్లని తన్నుకుపోతారు.

31వ పేజీ చూడండి






## దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**1-2-1963 శుక్రవారము మొదలు 7-2-1963 గురువారము వరకు**

### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా)

ఈవారం మీ గ్రహస్థితి శుభప్రదంగా యున్నది. బాహ్య విషయాలలో మంచిపేరు సంపాదించుకొనగల సమయం రకరకాల సమస్యలు స్వబుద్ధితో యోచించి, సమయానుకూలంగా పరిష్కరించుకొనగలుగుతారు ఒకరిద్దరు స్నేహితులు మీతో తీవ్రంగా వాదించటానికి పూనుకుంటారు కోర్టు, కచేరీలలో పరిస్థితులు ఆశాజనకంగా ఉంటవి ధనం విషయంలో నిర్లక్ష్యంగాను, ధారాళంగాను ప్రవర్తించటంవల్ల ఈ సమయంలో శ్రమపడవలసి వస్తుంది కావలసిన హంగులు సమకూర్చుకొనకుండా తొందరపడి ఏ కార్యము ప్రారంభించతగిన సమయంకాదు 1, 2 తేదులలో బంధువుల రాక, ఉత్సాహ వార్తలు

* * *

### వృషభం:

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం మీ మానసికస్థితిలో ధైర్యము, ఒకవిధంగా పట్టుదల పెరుగుతవి అవసరమునకు తగినట్లు ఏ కార్యం సాధించటానికైనా సిద్ధంగా నిలబడగలుగుతారు. బంధువులవద్దనుంచి శుభ సంతోష వార్తలు తెలుస్తవి. ఎదటివారి అభిప్రాయాన్ని గ్రహించి నడచుకోగలుగుతారు మీ క్రింద పనిచేసే వారితో చిన్న చిన్న పేచీలు ఆరంభం కావచ్చు. పెద్ద మొత్తాలుగా ధనంవచ్చి కూడా ఖర్చుల భారాన్ని మోయలేని కారణాలు ఏర్పడగలవు స్వవిషయాలకన్నా, ఇతరులకు సంబంధించిన కార్యభారం అధికం విద్యా విషయంలో మీ కృషి చక్కగా సాగుతుంది వస్త్రాలు, అలంకారాలు మొదలయినవికొంటారు. 2, 3 తేదులలో శుభ కార్యాలు, వృత్తిలో గౌరవం.

* * *

### మిధునం:

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

"దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకొనవలయు"ననే విషయం మరచిపోవద్దు. ఇతరుల మాటలమనవిన్ని మోసపోతగిన సమయం. వ్యాపారరంగంలో జాగ్రత్తగా ఆలోచించటం అవసరం. వృత్తిలో అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. మీ పట్టుదలవల్ల కార్యం సాధించుకొని బయట పడగలుగుతారు ఇతరుల సమస్యలలో జోక్యం కలిగించుకుని బాధపడతారు ధనాదాయం మామూలుగా ఉంటుంది దైవ కార్యములయందుగాని, శుభకార్యములయందుగాని ఆటంకాలు ఉండవు కాని, ఉత్సాహం కనుపించదు కుటుంబంలో, చిన్న చిన్న పేచీలు, అనారోగ్యాలు మనస్సును కలవరపెడుతూ ఉంటవి 3, 4 తేదులలో ధనవ్యయం, సంతోష వార్తలు.

* * *

### కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈవారం అనేక సందర్భాలలో ఒక అడుగు వెనుకకు ఉండటం అవసరం అవుతుంది వృత్తి, వ్యాపారాలలో ఇంతకుముందు కలిగిన చిక్కులు, ఆదుర్దా క్రమంగా తగ్గుతవి నిదానంగా సహాయం చేయగల మనుష్యులు లభిస్తారు సంఘ కార్యాల్లో ఉత్సాహంకొలదీ ఏ విషయం మాట్లాడినప్పటికీ భారం మీమీదనే పడుతుంది. ఆరోగ్యం విషయంలో ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది కుటుంబ విషయాలలో ప్రోత్సాహకరమైన సూచనలు కనుపిస్తవి అకస్మాత్తుగా ధనం ఆర్జించగలమనుకొనే ప్రయత్నాలు అనుకూలించవు వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి ప్రతిపట అధికం కావచ్చు 4, 5 తేదులలో మిత్రులవలన కార్యానుకూలత, ప్రయాణాలు

### గ్రహస్థితి

కర్కాటకంలో అంగారక, రాహువులు, ధనుస్సులో బుధ, శుక్రులు, మకరంలో సూర్య, శని, కేతువులు, కుంభంలో గురువు, మేష, వృషభ, మిధున, కర్కాటకాలలో చంద్రుడు

* * *

### సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఫలితంకోసం ఎదురుచూడకుండా మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటారు మనోనిబ్బరం బాగుంటుంది ఏ విషయంలోను వ్యతిరేకం ఉండదు నిదానంగా ఫలితం పొందగలుగుతారు కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి ఈ సమయంలో మీ ధనం ఉపయోగకరంగా వినియోగించగలుగుతారు అధికారుల విషయంలో బహుసున్నితంగా ప్రవర్తించవలసి ఉంటుంది ప్రయాణాలు సుఖప్రదంగా జరుగుతవి ఆహార విహారాలలో వచ్చే మార్పులు, శ్రమకరంగా ఉంటవి ముందు జాగ్రత్త అవసరం. 5, 6 తేదులలో దైవకార్యాలు, మిత్ర లాభం.

### ఈ వారము ధరలు

బంగారుధర గతవారం మాదిరిగానే ఉంటుంది 5, 6 తేదులలో కొంత తగ్గి, 7 నుంచి స్వల్పంగా తేజీ కనుపించవచ్చు వెండిధర ముందు పెరిగి, వారం రెండవ భాగంలో మందీ వస్తుంది నూలు ధర అకస్మాత్తుగా తగ్గుతుంది. వేరుశనగ పప్పు ధర నిలకడగా ఉంటుంది నూవులలో ధర మందీ లక్షణం కనుపిస్తుంది

### కన్య:

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)

అన్ని విధాలా మంచి సమయం ధనాదాయ పెరుగుతుంది రాజకీయాలు మొదలయిన వియాలలో కార్యానుకూలత, గౌరవము కలుగుతు. కుటుంబంలో సంతోషదాయకంగా ఉంటుంది విలుగల వస్తువులు కొంటారు తరుచు పదిమంది సంబంధించిన పనులు పైన వేసుకొంటు, రకాల వ్యక్తులతో పరిచయం చేసుకొంటు ఉంటార ఇతరులవద్దనుంచి రావలసిన వస్తువులుకాని ధనంకాని ఇబ్బంది పడకుండా లభిస్తవి తలువ తలంపుగా ఆందోళనకరమైన వార్తలు తెలుస్తవి కాని, ప్రత్యక్షంగా చిక్కులు ఏమీ ఉండవు 6, తేదులలో ఆదాయలాభం, నీచులతో వివాదాలు.

* * *

### తుల:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ఆదాయం తక్కువ ఖర్చులు అధికం ఇంతక ముందు సులభంగా జరుపుతున్న పనులు కూడ ఈ సమయంలో విసుగుదలను కలిగిస్తవి క్రొత్త మార్గాలలో ఆదాయవృద్ధి ప్రయత్నాలు చేస్తారు ఇతరుల మాటలను అనుసరించటంవల్ల కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసి వస్తుంది బంధు మిత్ర లలో మంచి పేరు లభిస్తుంది అధికారులతో స్నేహ లభిస్తుంది కాని, ప్రత్యేకంగా ప్రయోజనం ఉంటు దని అనుకోవద్దు. మాటల సందర్భంలో మీవద్ద నుంచి రహస్యాలు గ్రహించేవారు ఉంటారు ముందు జాగ్రత్తలో ఉండటం అవసరం వృత్తి మాటలకన్నా, పనిముఖ్యం అనే విషయం గుర్తుంచ కొనండి. ఆలోచన లేకుండా ముందు దుబా చేయుటంవల్ల తరువాత చిక్కుపడతారు

* * *

### వృశ్చికం:

(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

కార్యం ఎవరిచేతిమీదుగా జరిగినా మీమీ ఉన్నటువంటి భారం తొలగుతుంది పెత్తనంకోస ప్రాకులాడతగిన సమయంకాదు దైవానుగ్రహ వల్ల మాట దక్కించుకొంటారు వృత్తి, వ్యాపా దులలో విశేషంగా ధనం పెట్టవలసిన అవసర కలుగుతుంది. సాధారణంగా మీ ప్రసంగాలు, పనులు ఎదటివారిని నొప్పించుకుంటా సాగి

కలుగుతారు. తలవని తలంపుగా శుభవార్తలు తెలుస్తవి. ధన విషయంలో కలిగే వత్తిడిని చల్లగా సమర్థించుకొంటారు. కొన్ని సమయాలలో విచక్షణ లేకుండా ఖర్చు చేయటం జరుగవచ్చు. విద్యా సాహిత్య రంగాలలో మనస్సు ధారాళంగాసాగే సమయం. 6, 7 తేదులలో శ్రమ, మాటల పోటీలు.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

కాని పని ఏదీ ఉండదు. అయితే ఒకటికి రెండుగా ప్రయత్నించటం అవసరం. విలాస, వినోద కార్యాలలో పాల్గొంటారు. వృత్తిలో శ్రమ సూచనలు కనుపిస్తున్నా, వీలున్నంతలో మన శ్శాంతిని కల్పించుకొనగలుగుతారు. కుటుంబంలో మీ జాగ్రత్తవల్ల దుబారా తగ్గుతుంది. నౌకరులు మొదలయిన వారితో వచ్చే పేచీలు చల్లగా సర్దుబాటు చేసుకొనటం అవసరం. విలువగల వస్తువులు పోయే అవకాశాలున్నవి. బంధువులవద్దనుంచి కలవార్తల్నిగాని, కష్టవార్తలుగాని తెలుస్తవి. సాధారణంగా నిష్ఠురంగా మాట్లాడి, మిమ్ములను నొప్పించటం ఈ సమయంలో కొంతమందికి సరదాగా ఉంటుంది. 5, 6 తేదులలో కార్యసిద్ధి, ఇష్టవస్తుప్రాప్తి, మిత్రలాభం.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)**

పనులు కష్టసాధ్యంగా కనుపించే సమయం. మధ్య మధ్య పెద్ద మనుష్యులవల్ల గౌరవప్రదంగా జరిగే ఆటంకాలు కూడా వస్తుఉంటవి. ముందు చెప్పిన మాటను సమర్థించుకొనటం ఎలాగో జరుగుతుంది. లోగడ ఆశ వదులుకున్న పనులు తలవని తలంపుగానే నెరవేరుతవి. బంధువులవల్ల సహాయం పొందగలుగుతారు. విరివిగా ధనం ఉపయోగించి పనులు నెరవేర్చుకోవలసి ఉంటుంది. వృత్తి, ఉద్యోగాలకు సంబంధించిన క్రొత్తవార్తలు లాభదాయకంగా తెలుస్తవి. ప్రయాణాలు చేయవలయుననుకొంటారు. కాని, చేయలేకపోతారు. ఆత్మీయులతో స్పర్ధలు రావటంవల్ల పనులలో నిరుత్సాహం ఏర్పడుతుంది. 5, 6 తేదులలో ధనలాభం, అసౌఖ్యం.

* * *

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా., శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

కుటుంబ, ఆర్థిక విషయాలలో సంతోషకరమైన సమయం. పెద్దమొత్తాలు డబ్బు చేతిలో మెదులుతు ఉంటుంది. మంచి మనుష్యుల సాంగత్యం లభిస్తుంది. సంఘంలో పేరు, ప్రతిష్ఠలు బాగుంటవి. మీ చాకచక్యంవల్ల శ్రమలోనే సుఖ సంతోషాలను పొందగలుగుతారు. కోర్టు కచేరీలలో ఆశ వదులుకున్న పనులు చాలా హాయిగా పూర్తి కాగల సూచనలున్నవి. ఇతరుల నిష్ఠుర ప్రసంగాలను లెక్కపెట్టుకోవద్దు. ఒకరిని సంతోషపెట్టటం నిమిత్తం శ్రమ, ఖర్చులు పెంచుకొంటూ ఉంటారు. అందువల్ల మీ స్వంత కార్యక్రమాలకు కొంత ఆటంకం ఏర్పడవచ్చు. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది. 4, 5 తేదులలో పదిమందిలో గౌరవం, పట్టుదలతో కార్యానుకూలత.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)**

వృత్తిలో లాభదాయకమైన సమయం. ఎదటివారి మాటలలో కొంత కాఠిన్యం గోచరిస్తుంది. క్రియలో మీకు అనుకూలంగా ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. పిల్లల ఆరోగ్యం మాత్రం జాగ్రత్తగా చూచుకొనండి. అప్పుడప్పుడు వింటున్న వార్తలవల్ల ముందు ముందు మీ బాధ్యతలను ఎలా నిర్వహించగలమనే ఆదుర్దా కలుగుతుంది. కాని, యథార్థంగా అపకారం జరుగదు. ఇతరుల చేతికిపోయిన వస్తువులు తిరిగి రావటం కష్టంతో కూడిన పని, ముందు వెనుకలు ఆలోచించకుండా వ్యాపార సంబంధమైన పనులలో శక్తికిమించిన పెట్టుబడులను పెట్టటానికి పూనుకోవద్దు. కీర్తిదాయకమైన సమయం. అయితే మంచి మాటలతో భారం తప్పించుకొనండి. 3, 4 తేదులలో శుభవార్తలు, ప్రయాణాలు. ★

---

డబ్బులేనోడికి పెళ్లి కావడం.....కుక్కతోక నిలువవ్వడం ఒక్కటే! వచ్చే అవకాశాన్ని జారవిడిస్తే దాన్నందుకోడం సామాన్యమేమీ కాదు"

దాదాపు పెద్దాళ్లిద్దరి ఆలోచనల సారాంశం ఒక్కటే—అదే సైది. వెనకనే గంగరాజు నడుస్తున్నాడు.

"నన్ను విడిచి రాములుకే ముందు పెళ్లి సేసేత్తానంటాడేంటి సుబ్బన్న? మరో రెండేళ్లు నిలవకూడదూ! ఆళ్లి వయస్సేం మళ్లిపోయిందని వీడికా ఆదుర్దా?...... 'చిన్నోడి కెందుకయ్యిందీ ఆ కన్నకుండా పెళ్లి?" అని ఎవరయినా అడిగితే ఊ......అడిగితే......పోనీ వాడి పెళ్లికి రెండేళ్లు వాయిదావయినావేస్తే......సుబ్బన్నేనా వాయిదావేసే రకం?.......నా గురించి రాములు పెళ్లి కూడా ఆగవల్సిందేనా? కాళ్లబేరం తమలాటోళ్లకి కాశీలోనేగాదు. స్వర్గంలో కూడా దొరకదు. ఏం జెయ్యాలి .......మరి?......." గంగరాజు ఆలోచనల కీ దరంటూ అవుపించలా......సుడిగాలిలో తూరీగలా అతని మనస్సు కొట్టుమిట్టాడిపోయింది. ఆ సుడిగాలి ఏ తరం జేరుస్తుందో!

అల్లంత దూరాన్న ఆగిన లారీ కదిలేలోగా పరుగెత్తుకెళ్ళి పైకెక్కేశాడు. లారీ ఎగుమతి దిగుమతి బంటూ కతడు నాయకుడు. మరో అర్ధగంటకి వెంకటరత్నం "హేయ్" అని అదలించుకుంటూ, బండిని అద్దెకోసం తోలుకుపోయాడు.

పాల బిందెలతో సుబ్బారావు నగుర్చుకుంటూ సైకిలు తొక్కుకెళ్ళిపోయాడు.

పొలంలో ముఠాలో పాటలు ముందు పాడుతూ రాములు చెరుకు నరుకుతున్నాడు. మంచిక్కర అంది

# వధుకట్నం

29-వ పేజీతరువాయి

నపుడు మొదటి కణువు నరికి నములుతున్నాడు.'

* * *

"ఏమేవ్! లచ్చిమీ అన్నం తిందుగాని రావే!" వంటింట్లోంచి శేషమ్మ కేకపెట్టింది. కాసేపటి వరకూ బదులు రాకపొయ్యేసరికి విసిగి, అదేకేక రెట్టింపు స్వరంతో రెట్టించింది.

వచ్చి కూర్చుని నాల్గు మెతుకులు కెలికి, లోపలికి పోయింది లక్ష్మి. ఒక్కక్షణం రెప్పలు తాటించి తిరిగి అన్నం తింటంలో లీనమయ్యాడు చంద్రయ్య. కూరముక్కలకి చిన్నపిల్లలు ముగ్గురూ అన్నం పళ్లేల కాడ గడబిడ చేస్తున్నారు.

"ఒరేయ్ అన్నయ్యా! అప్పుడే....పెళ్లింత!!" నీకు తెలుసురా? అన్నట్టు అన్నగారి నొసటిని పైకెత్తి మరీ చెప్పేడు. చంద్రయ్యకి పులమారింది. ఆ కోపంతో తమ్ముడి నెత్తిన రెండు మొట్టి, వాడు గుక్కపట్టేలోగా తను గుక్క తెలుపుకుని, కళ్లు తాటించి, "ఏమిటీ?" అన్నాడు. "నేం......చెప్పను" రాగాలు తీసుకుంటూ వాడు తల్లిచాటుకు పరుగెత్తేడు.

"ఏంటేమ్మా! ఆడంటున్నది?"

"............................."

"ఏమ్మా! ఏంటి జెప్పవ్?"

"ఏమీలేదు......"

"లచ్చింకి పెళ్లా!?"

"............................."

"ఏమ్మా!?"

"ఆడి ముఖం.....ఆడికేం తెలుసూ......" శేషమ్మ కుర్రాడ్ని చంకనేసుకుని బయటికి పోయింది. ఏ విషయం తేలేవరకు ఆ విషయం గోప్యంగా ఉంచాలని భార్యా భర్తలిద్దరూ ముందే అనుకున్నారు. చంద్రయ్య కొంచెంసేపు నిరుత్తరుడయ్యాడు.

తుండు భుజాన్నేసుకుని, బయటికిపోతూ లక్ష్మినిచూసి, మంచానికి దగ్గరగా వెళ్లాడు. "లచ్చిమీ!" అంటూ చెల్లి తల నిమిరేడు. "ఒంట్లో బాగులేదామ్మా!" అని పరామర్శించాడు.

"ఊహూ" తల అడ్డంగా తిప్పింది లక్ష్మి.

బుట్ట తీసుకుని శేషమ్మ పెచ్చాలు తేవడానికి కొట్టుకేసి వెళ్ళిపోయింది. చంద్రయ్య బరువుగా అడుగు వేసుకుంటూ బయటికి వెళ్ళబోయాడు.

"అన్నయ్యా!" లక్ష్మి బాధగా అన్నగార్ని పిలిచింది.

"ఏమ్మా!" తల నిమురుతూ, "నాతో చెప్పవ్" అన్నాడు.

కాస్సేపటివరకూ మౌనంగా ఊరుకుని, "ఏమీ లేదు" అంది. అయితే కన్నీరాపుకోడం చేతకాలేదామెకు. కాస్సేపు సముదాయించి బయటికి వెళ్ళిపోయాడు చంద్రయ్య.

తన కిష్టంలేనోళ్లకి తనని సమర్పించడానికి ప్రయత్నాలు సాగుతూంటే లక్ష్మికేకాదు, ఎవరికీ మనసు మనస్సులో ఉండదు. నిన్నటి సంభాషణ విన్నతర్వాత ఆమెను ఏదో తెలియని బాధ చుట్టుముట్టింది.

రాములు కీ విషయాలేం తెలియవ్. నద్ది ముంతలు తేవడానికి ఇంటికివస్తూ, ఒక ముంత

# వధుకట్నం

నిండా చెరకు పానకంనింపి కావట్లో ...కున్నాడు. సుబ్బన్న ఇల్లు చూస్తూనే అతను మధుర భావాలతో పరవశుడయ్యాడు. అవి అతని కాళ్లకు సంకెళ్లువేసి, ఆ ఇంటిముందుకి లాక్కువచ్చినయ్. "మామయ్యోయ్!" అనే చంటివాడి మాటలకికాని తన పరిసరాలు తెలియరాలేదు అతనికి.

కాస్సేపు ఎలా పలుకరించడమా అని సంకోచించి, తప్పదన్నట్లు "ఏ మావయ్యా!" అని పలుకరించింది లక్ష్మి.

తప్పించుకోడాని చెరకుముంత మినహా ఏదే వంకా దొరకలేదు రామయ్యకి. "పానకం ముంత ఇంట్లో పెట్టుకో!" అన్నాడు.

"ఎందుకూ?" బలవంతంగా ఆ మాట అవగల్గినా— జవాబుకోసం ఎదురు చూడకుండా ముంతతో ఇంట్లోకి పరుగెత్తింది. మరో గిన్నెలో దిమ్మరించి ముంత తెచ్చి కావట్లో పెట్టింది.

"అలాగున్నావే?"

"ఎలాగున్నాను!!" శరీరంవంక శంకగాచూసి, బాగానే ఉన్నానే!" అన్నది.

"అసలు ముఖం కడుక్కున్నావా?"

అద్దంకోసం ఇంట్లోకి పరుగెత్తి ముఖంవంక పరీక్షగా చూసుకుంది. అప్పటికిగ్గాని తెలియరాలేదు, తన తలకి తైల సంపర్కం జరిగి మూడురోజులైందని. రాత్రి నిద్రలేక కళ్లు వాచినట్లున్నాయ్. దొడ్లోకిపోయి సబ్బుతో ముఖం కడుక్కొని, ఇంత కొబ్బరినూనె తలకి పులుముకుని దువ్వెనతో గబగబా తల దువ్వేసుకుంది. తిలకం దిద్దుకొని చకచకా బట్టలు మార్చుకుంది. రెండోసారి అద్దంలో చూసుకుని, ఫర్వాలేదనుకుని, బయటికి కంగారుగా పరుగెత్తింది. రాములు ముంతలో అప్పటికే పొలం చేరినట్లు, పాపం! ఆమెకు తెలియదు.

ఆ క్షణంలో ఆమె ముఖంలో కోపం ప్రజ్వరించింది. కసిగావచ్చి మంచంమీద వాలిపోయింది. "అక్కా!" అంటూ దగ్గరికి వచ్చిన తమ్ముడివీపు వాచేట్టు బాది, బయటికి గెంటి, తలుపు మూసుకుని బోరుమని ఏడ్చింది.

ఇటువంటివాళ్ల నుద్దేశించేనేమో—"పేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్వ" రన్నాడు తిమ్మన.

పేరంటానికి వెళ్లిన శేషమ్మకి, ఆవేళ పెళ్లివారొస్తారని జ్ఞప్తికి రావడంతో కంగారుగా ఇంటికి పరుగెత్తింది. గడప లోపల అడుగుపెడుతూనే "అమ్మాయ్!......అమ్మాయ్!!" అని కేకలు పెడుతూ, కూతుర్నిచూసి, "అసి నీ ఇల్లు బంగారంగానూ!" అంటూ ముక్కుమీద వేలేసుకుని— కాస్సేపటికి తేరుకుని, ఇంటి అలంకరణలో మునిగిపోయింది.

సుబ్బన్న హడావుడికి ఆరోజు హద్దులేకపోయింది. పెళ్లికొడుకు తనకంటె ధనవంతుడు. తన కూతురుకి జీవితంలో కరువంటూ ఉండదు. తాను తింటూ, పదిమందికి పడెయ్యగల స్థితిమంతురాలౌతుంది. నారాయుడి కొడుకుల పీడ వదలిపోయింది. తన షరతు ప్రకారం, ఏమాటా ప్రొద్దుటే తెచ్చి చెప్పలేదు వాళ్లు. ఇక తన తప్పేమీలేదు. తన్ని మాట లంటానికి ఎవరికీ వంక దొరకదిక.

మంచికీ, మమతకీ మనస్సివ్వని మనుష్యులుంటా

రు మనలో! వాళ్లక్కావల్సింది ఐశ్వర్యం! అదుంటే వారిక్కావల్సిందేమీలేదు.

సుబ్బన్న ప్రస్తుత ప్రవర్తన ఇందుకు భిన్న మైందేమీకాదు. తనకు ధనమెల్లాగూలేదు. కూతురుకు లభిస్తుందనేకాదని దరిద్రుని కివ్వమనడానికి దేవుడిక్కూడా హక్కులేదు.

ఇదీ సుబ్బన్నవాదం. దీనిముందు, కన్నకూతురుకు రాములుమీదుండే మమత, అతనికి ఎక్కువగా కన్పించిందికాదు.

మధ్యాహ్నం పెళ్లికొడుకు తరపువాళ్లు పిల్లని చూసుకోడానికి వచ్చారు. పెళ్లికొడుకు అక్కలిద్దరూ—వదినా—తల్లీ తండ్రీ వచ్చారు. వారికి సుబ్బన్న చేసిన మర్యాదలకి అంతులేదు.

లక్ష్మికి తల్లి ఎన్నో నీతులు చెప్పింది. పెళ్లికొడుకు భాగ్యం గుర్తించి గోరంతలు కొండం తలుచేసి వర్ణించింది. ఆ పెళ్లికొడుకు స్థితికంటె రాములు స్థితి ఎంతో దీనమైందిగా విడమర్చి చెప్పి—"అతణ్ణి చేసుకుంటే తిండికీ, గుడ్డకీ కటకట లుండవని" హెచ్చరించింది. మరెన్నో—ఇంకెన్నో నూరిపోసింది.

లక్ష్మికి మనసు మారకపోగా దుఃఖం ఎక్కువై తల్లి ఒడిలో తలపెట్టి వెక్కి ఏడ్చింది. పెళ్లివారి కావిడ్పు ఎక్కడ విప్పించిపోతుందోనని హడలిపోయింది శేషమ్మ.

"అమ్మాయిని తీసుకురావే!" బయటనుంచి సుబ్బన్న కేకపెట్టాడు. "తీసుకొత్తున్నా" శేషమ్మ కూతుర్ని బలవంతంగా లాక్కెళ్లి కూలదీసింది.

పెళ్లికొడుకు తల్లికి అమ్మాయిని చూడ్డంతోనే ముఖం వికసించింది. పెళ్లికొడుకు అక్కలు ఉడికించడానికి చూశారు.

"ఏవమ్మాయ్! నువ్వింత సిగ్గుగా పెళ్లయింతర్వాతవుంటే సాగదు మరి. ఆ....." అంది పెద్దావిడ.

"ఇప్పు డంతేలేవే! పెళ్లయింతర్వాత గుమ్మమెక్కనిస్తే ఒట్టు" రెండో ఆవిడ కొంటెగా చూస్తూ అంది. అయితే పెళ్ళికొడుకు వదినగారు మటుకు లక్ష్మినే వెనకేసుకొచ్చింది. ఆగంటా లక్ష్మికోయుగంలా గడిచింది.

రాములు మామ మాటతో మొదలైన తన అలంకరణ, మరొకరి పెళ్ళి చూపులకు ఉపయోగపడ్డదే? మామచేతుల్తో ఇచ్చిన చెరకు పానకం మరొకరి విందులకా? ఏమిటిది?........ఏమిటీ వైపరీత్యం? భగవాన్! ఈ పెళ్ళి అమ్మకీ, నాన్నకీ నచ్చితే సరా? తన ఇష్టా ఇష్టాలతో వారికి పనిలేదా?

"అమ్మా! నాకీ పెళ్లొద్దే!" తల్లి ఒడిలో లక్ష్మి కన్నీరు గోదావరై ప్రవహించింది.

కాని, ఎంతటి ప్రవాహమైనా కఠిన శిలల్ని కరిగించదుకదా!

* * *

"మామా!నీకిది న్యాయంగాదు" దాదాపు ప్రాధేయపడ్డాడు రతయ్య.

"న్యాయమేంట్రా! మాటలుకూడా అయిపోయేక?" —మరోవైపుక చూస్తూ, సుబ్బన్న అన్నాడు.

"మాటిచ్చావా?......మావా!.... .మా నాన్నకి మాటిచ్చినప్పుడో?.......అది మాటకాదా?" సుబ్బారావు కంఠం ఖంగుమంది.

"అందుకే మీకు ముందు చెప్పి చేసే పి పని. ఇంకా తప్పేంట్రా?......ఏ పెద్ద మనిషినైనా పిల్చి అడగండి......ఏవంటాడో!"

"న్యాయం, ధర్మం లేదేంటింక?" మౌనంగా పీల్చుతు గంగరాజు అడిగేడు

ముగ్గురు మాటల్లోనూ సుబ్బన్నకి పళ్లమండింది" లేద్రా న్యాయం. నా కూతురు నాయిష్టం! చెప్పుకోండి దిక్కుంటే!......పోండి!..... ముందు గుమ్మందిగి మాట్లాడండి. ఊ....... పోండి!!" ప్రళయరుద్రుడు ఆ క్షణం సుబ్బన్నే అయ్యేడు.

సమయానికి పెళ్లికొడుకు తరఫున మంగలి పసుపు కుంకుమతో ప్రత్యక్షమయ్యాడు.

"ఈ పట్టుచీరంతలేదు మీ బ్రతుకు. పొండికడ్నుంచి! దిట్ట బొమ్మల్లాగ!" ఇంటి పెంకులున్నయ్యో లేవోనని చిన్నపిల్లలు ముగ్గురూ పైకప్పుకేసి ఆత్రంగా చూశారు. ఎందుకంటే గట్టిగా కేకవేస్తే ఇంటి పెంకు లెగిరిపోతవని ఒకసారి వాళ్లమ్మ చెప్పింది.

దీనవదనాలతో అన్నదమ్ములు ముగ్గురూ వెను దిరుగారు. తల్లీ, తండ్రులులేమి ఇప్పుడు స్పష్టపడింది వారికి. తల్లీ తండ్రీ వుంటే లక్ష్మిని మరొకరి కివ్వనిచ్చేవారుకారు.

గడ్డిమోపుతో చంద్రయ్య ఎదురై "మామాయ్!" అని పల్కరించాడు ముగ్గుర్నీని. జవాబుగా ముగ్గురూ వక్కసారి తలెత్తిచూసి ముందుకు సాగిపోయేరు. ఫలితంగా చంద్రయ్య మనస్సు అనుమానాల్తో ఆందోళితమయ్యి, త్వరగా అతన్ని ఇంటికి గెంటుకుపోయింది. ఇంటికెళ్లేసరికి తల్లి చీరలు తిరగేస్తున్నది. ఆమెకి వాటిల్లో కొన్ని నచ్చలేదు. విసుక్కుంటున్నది. వాళ్లనాన్న దూరంగా కూర్చుని. చంటెదూడ మట్టి తినకుండా దాని మూతికి తాటి ఆకులతో బుట్ట అల్లుకుంటున్నాడు.

"అమ్మా! ఏంటి యిది?" అన్నారు గడ్డిమోపు విప్పుతూ.

"నీవనేదో చూసుకో" కసురుకుంది శేషమ్మ.

లోపల లక్ష్మి ఏడుస్తూ కన్పించింది. "ఏంటమ్మా లచ్చిమీ! ఇది" అన్నాడు మెల్లగా. జవాబుగా లక్ష్మి వెక్కి వెక్కి ఏడ్చింది. బయటికివచ్చి తండ్రిని అదే ప్రశ్న వేసాడు.

"లక్ష్మిపెళ్లి......"

"ఏవూరు!?"

"కొమారదేవం"

"ఎవర్నడిగి చేత్తన్నారు!?"

"ఏం.......ఎవర్నడగాల్రా?.......ఎవర్నడగాలి?" రెట్టించి, రెచ్చిపోయాడు సుబ్బన్న.

"లచ్చిమిష్టంలేదా.......?......నేను చచ్చేనా?"

"నీ ఇష్టం.....దానిష్టం........ఎవరిక్కావాల్రా? కన్నయ్యకి"

"కన్నయ్యకే చేద్దువులే!......., ఇది జరగడానికి వీల్లేదు!" ఖచ్చితంగాచెప్పే చంద్రయ్య మాటలకి సుబ్బన్న కోపం ఆకసం అంటింది.

"ఏ.....ఎంతుకీల్లేదురా? ........ ఇష్టంలేకపోతే ఇంట్లోంచి బయటికెళ్లు!.......ఎవడు పెడతాడో చూత్తాను? పోరా!......"

"ఈ పెళ్లే గనక జరిగితే ....నువ్వన్నదే ఖాయం! ఆ పెళ్ళికొడుకు ఇంటికి రావడం కల్లాను! ఆలోసించుకోండి......అల్లుడు కావాలో, కొడుక్కావాలో" విసురుగా అనేసి, అంత విసురుతోనూ గొడ్లపాక

## మధుకట్నం

కొనిపోయాడు, ముంజికాయలు కొట్టడానికి.

"కుర్రకుంక కూంతలేదా—కొమ్ములొచ్చేసినయ్ ఇప్పుడే!"—సుబ్బన్న గంతులేడి ఇల్లాలు, అపర్ణా భావలేను. కాస్సేపు గంతులేసి, అలసి నిద్రపోయాడు. శేషమ్మ మొదటిసారిగా బాధతో కూడిన నిట్టూర్పు విడిచింది.

అంతా అలసి నిద్రపోయిం తర్వాత—గొడ్ల సావిట్లో చంద్రయ్య దగ్గరగాచేరి కూర్చుంది లక్ష్మి. చెల్లెల్నిచూసి కూడా తల దించుకుని, మౌనంగా కూచుని ఆను గూడా....ంలో నిమగ్ను డయ్యాడు చంద్రయ్య ఇద్దరి మనస్సులు బరువుగా ఉన్నాయ్. మరో కొన్ని...ల్లో గాలివాన వస్తుందని—చంద్రయ్య ఎందుకో బయపడ్డాడు.

"అన్నయ్యా!"

"ఊఁ"

"నువ్వేమనుకుంటున్నావురా?" సిగ్గువిడిచి అడిగింది లక్ష్మి. అవసర సమయాల్లో సిగ్గును విడిచి పెట్టాలని చిన్నప్పు డెవరో చెప్పినట్లు గుర్తు కొచ్చిందామెకి.

"నా ఉద్దేశంసరేగాని, ముందు నీ ఉద్దేశమేంటి? కొద్దిగా తల పైకెత్తి, ముంజికాయలు కొట్టడం ఆపి ప్రశ్నించాడు.

"నా కీ పెళ్ళిష్టంలేదు......"

"మరి వాతో చెప్పలే దెందుకని—అన్న సచ్చాడనుకున్నావుకదూ?"

"అన్నయ్యా!" బావురుమంది లక్ష్మి.

చెల్లి స్థితి చంద్రయ్య మనస్సును కలతబెట్టింది. "పిచ్చిపిల్లా! ఏడవక! ఇల్లా, ముంజికాయలు కొట్టు. నే నిప్పుడే వత్తాను" 'తలచినప్పుడే తాతపెళ్ళి', అంటాడు చంద్రయ్య. తిన్నగా వెంకటరత్నం ఎడ్ల సావిట్లోకివచ్చి, "మావా!" అంటూ ముంజి కాయలు కొడుతున్న వెంకటరత్నంకి దగ్గరగా చతికిల బడ్డాడు. "మా లచ్చింకి పెళ్ళి తెల్సా?"

"తెల్సు"

"అయితే ఎందు కూరుకున్నట్లు!"

"చేతకాక!"

"నేం దీసుకొత్తా చేసుకుంటారా!?" — కాలిం వృధా కావడం చంద్రయ్య కిష్టంలేదు?

"ఊహూ" రత్నంతల అడ్డంగా తిరిగింది.

"మావయ్యా" చంద్రయ్య నెత్తిన వేయి మెగా టన్నుల బాంబు "ధన్"మని పేలింది. "నీకు మూతిన మీసముందా — అసలు?" ఇది దాని రియాక్షన్. దీనికి జవాబుగా రత్నం ఏమంటాడోనని చెవులు రిక్కించాడు.

"గంగరాజుకి ముందు పెళ్ళి జరగాలి. తరవాత రావులు మాట!"

చంద్రయ్య మౌనంగాలేచి, ఇంటి ముఖం పట్టాడు.

* * *

పెళ్ళి ప్రయత్నాలు, ఉన్నంతలో సుబ్బన్న ఘనంగా జరిపిస్తున్నాడు.

ఈ మూడు రోజులుగా గంగరాజు మనస్సులో సుర్శణ వర్ణనాతీతం.

సుబ్బారావు నిస్సహాయంగా, నిష్పృహగా తన పాల వ్యాపారం దిద్దుకొంటున్నాడు.

వెంకటరత్నం ఈ మూడు రోజులనుంచి అద్దెకి బండి కట్టడం మానుకున్నాడు.

రాములు కీ విషయాలేవీ తెలియవ్. మూడు రోజులుగా పొలాన్ని, బెల్లం పొయ్యిల దగ్గర అతను కాపలా. తిండి ఇంత అక్కడనే ఉడకేసుకుంటు న్నాడు. చంద్రయ్య ఒకరోజు గడ్డి మోపంతో ఆదా పులకేసి వెళ్ళాడు. చంద్రయ్య దర్శనం రాములు హృదయ కమలానికి చంద్రోదయమే అయ్యింది.

"ఏరోయ్! బామ్మర్ది.........చెరుకు ముక్క లంటే మక్కువ తిరిగిందేంటి?— రా! రా! బంగారు తీగ గెడల మొదటి ముక్కలు నరికి పెడతా!" నవ్వు తూ పల్కరించాడు.

"ఈ బంగారు తీకేక్కంగాని—అసలు నీ బంగారు తీగే దూరమవుతుంది తెల్సా నీకు?"

"ఏంటీ!? భాంత తిరుగుడు లేకుండా తిన్నగా చెప్పు?" తింటున్న చెరకుగెడ క్రిందపారేసి చంద్ర య్యకేసి వచ్చాడు. చంద్రయ్యముఖం అతని అను మానాల్ని ధృఢం చేసింది.

"పద చెప్తాను" అంటూ గుబురుగా పెరిగి కొట్టుకు సిద్ధంగావున్న చెరకు తోటల వడుమ

గట్లు కేసి, రాముల్ని తీసుకుపోయ్యాడు చంద్రయ్య. రాములు మోటారు దగ్గరికెళ్లి, ఇన్ని నీళ్లు త్రాగి వచ్చి చంద్రయ్య సరసనే కూలబడ్డాడు. విషయం అంతా వివరంగా చెప్పి, "మా లచ్చింకి మనసు నీ మీదే—నీ కండగా నే నుంటాను. మరి నీ ఉద్దేశమేంటి మావా!" అన్నాడు చంద్రయ్య.

చంద్రయ్యచెప్పే ఒక్కొక్కమాటా రాములు కొక్కొక్క శరఘాతం అయ్యింది. ఆ బాధకంటే చెరకు కత్తి వేటులే సుఖమనిపించినా యాక్షణంలో అతనికి. చివరికి "అన్నయ్య లేవంటారు?" అన్నాడు.

"ఏవంటారు — నీ గంగరాజుకి పెళ్లవ్వాలట ముందు!"

"అవునా!?" అంటూ కొంచెంసేపు గుడ్లు తేలవేసి, "అవును!" అని తూలుతూ బెల్లం పొయ్యల కేసి పరుగెత్తి కెళ్ళిపోయాడు. చంద్రయ్య పిచ్చివాడిలా చూస్తూ ఉండిపోయ్యాడు. ఈ విషయంలో లక్ష్మికంటె కూడ చంద్రయ్య బాధ లనేక రెట్లు అధికం, అందుకే ఇంత తపన అతనికి. చంద్రయ్య లాంటి అన్నవుంటే లక్ష్మిలాంటి భారతీయ వధువుల మెడలకి తగులుకొనే అసంఖ్యాక ఉరితాళ్ళు ఇట్టే దూరమవుతాయనుకోవడం సందేహంకాక నిజమే ననుకుంటూ—కాదూ? చంద్రయ్య నిరాశగా ఇల్లు చేరుకున్నాడేగాని—చెల్లికిమాత్రం ఈ విషయం తెలియనివ్వలేదు. "లక్ష్మి గతేంటి?" తనలో తనే అనేకసార్లు గొణుక్కున్నాడు.

రాములు కూడా హృదయం వ్రక్కలై పోయింది. ఏమిటి లక్ష్మి మరొకడి సొత్తా? అవుతుందా??......అవుతుంది! అన్నయ్యకే గనక ఈ పాటికి పెళ్లయితే......ఇది జరిగేదా? వెయ్యిమంది సుబ్బన్నలయినా ఎదిరించ గలిగేవారా?" చెరకు క్రషర్లో చెరకుగడలు తోస్తూ, అందులో తన హృదయమే పిప్పి పిప్పిగా నలుగుతున్నట్టు బాధపడ్డాడు.

సుబ్బన్న ఇల్లు చుట్టాలతో అప్పటికే హోరెత్తిపోతున్నది. కష్టాల్లో కన్పించకపోయినా, ఇటువంటప్పుడు వీళ్లకేం కొదవుండదు. సుష్టిగా మెక్కి, చోటు చూసుకుని గుర్రుపెట్టడం—బావున్న వాటిని కూడా బావులేవని—ఆఖరికి ఏదో ఒక నెపంమీదవేసి, మరీ ఇల్లు ముఖం చూసేవారు అనేకమంది వీరిలో. బావగారి తమ్ముడి బావమరిది మేనల్లుడికి స్నేహితులు ఈ సమయాల్లో అనేకమంది కనిపిస్తారు. ఇది సహజం!

కిటికీ చువ్వల్లోంచి వాచిన కళ్లతో లక్ష్మి అనేకసార్లు తననిచూడ్డం చంద్రయ్య కనిపెట్టకపోలేదు. అయితే అత నిప్పుడు నిస్సహాయుడు.

"రేపే పెళ్లి!" అప్పుడు, చెల్లెల్ని చెరసాలకి కొంపోవడానికి, తన తండ్రినుంచి గుత్త అధికారం, అంతవరకు ముఖం కూడ తెలియని మరొకతను తీసుకుంటాడు. అది కొందరికి ఆనందదాయకం కావచ్చు—లక్ష్మికిమాత్రం చెరసాలే! ఆ వ్యక్తి రాములైతే లక్ష్మికి అదొక భూతలస్వర్గం! రేపట్నుంచి చెల్లాయిమీద సర్వ అధికారాలు మరొక కొత్త వ్యక్తివి. గవర్నమెంటు కొన్నింటిమీద అధికారం మనపరం చేస్తుంది. అయితే దానికి పరిమితి కొంతవరకే. ఈ లైసెన్సు జీవితాంతంమూనా—దీనికి పరిమితి అంటూలేదు. ఈ రెండు విషయాలకు భేదమున్నట్టు చంద్రయ్యకి వూహకి అందలేదు.

"ఛీ! ఛీ! ఈ ఇంట ఒక్కక్షణం కూడ ఉండగూడదు! ఇక్కడుండటం నా చాతగాదు!" తుండు పై మీదేసుకుని బయటి కెళ్లిపోయాడు చంద్రయ్య.

నిశాచరులు చిందులాడే సమయమది. రాత్రి పదకొండు గంటల సమయం. ఊరుమాటు మణిగింది. ఊరికుక్కలు "బొయ్య" మంటున్నాయి. ఒక మూల. బిచ్చగాడు దొరికింది తిని, ఒక అరుగుమీద కునికిపాట్లు పడుతూ, తత్వాలు ఆలాపిస్తున్నాడు మరొకచోట. వీధిలైటు దగ్గర ఒక వ్యక్తి ముందుకు పోతున్న వ్యక్తిని "చంద్రయ్యా!" అంటూ పిల్చి ఆపివేశాడు. దగ్గరికెళ్ళి చెవిలో ఏదో చెప్పి వెనుదిరిగాడు—ఆ వ్యక్తి గంగరాజు.

* * *

కర్రా కత్తి ధరించి సుబ్బన్న వెంకటరత్నంగారింటికి యుద్ధానికి బయలుదేరాడు. అతనివెంట ఇరవైమంది పటాలం బయలుదేరింది. వాళ్ల లెక్ట్రయిటులకి జడిసిగాని—మరో ఉద్దేశంతోగాని ఆ పేటలోని పటాలం సుమారు నలభైమంది అంతకుముందే వెంకటరత్నం గుమ్మంలో నిలబడ్డారు.

అంతవరకూ గాంభీర్యంగా ఉన్న ఆ వీధి మరోక్షణంలో కర్రల మోతలతోను— పెడబొబ్బలతోను హోరెత్తి పోయింది.

---

**పాఠకుడు నెం. 1 : మీరు పుస్తకం ఎందుకొన్నారూ?**

**పాఠకుడు నెం. 2 : ముఖచిత్రం కోసరం.**

**పాఠకుడు నెం. 1: అయితే అది కాస్తా చించుకుని మిగతో యిలా పారేయ్యండి నేను చదువుకుంటాను.**

నూర్‌దావ్ (బొంబాయి)

---

తండ్రితో చంద్రయ్య కలబడ్డాడు. తండ్రి చేతి కత్తి చంద్రయ్య విసురుకి దూరంగా పడిపోయింది. సుబ్బన్న కర్రదెబ్బకి చంద్రయ్యవీపు చిట్లిపోయింది. సుబ్బన్నకి ఆయాసం ఎక్కువైంది. ఓర్పు నశించింది. బలంకొద్దీ పిడికిలి బిగించి చంద్రయ్య ప్రాణాలు తియ్యడానికి పైకెళ్ళాడు. ఆ చేయి వెనకనుంచి బలంగా గంగరాజు లాగడంతో అట్లాగే నిలిచిపోయింది. సుబ్బన్న బుసలు కక్కుతూ అటు తిరిగాడు.

"మామయ్యా! చంద్రయ్యనికాదు....... ఊఁ నన్నుకొట్టు!! ఇదంతా జరిపించింది నేను. ఊ......ఁ కొట్టు!!! అన్నాడు గంగరాజు.

సుబ్బన్న శరీరం నిశ్చేష్టత వహించింది. గంగరాజు కత్తితెచ్చి సుబ్బన్న చేతి కందించాడు.

అంతా అయోమయంగా, భయంగా వారికేసి చూశారు.

గంగరాజు తలవంచాడు. సుబ్బన్న కళ్ళనుంచి కన్నీరు జలజలారాలి గంగరాజు తలని అభిషేకించింది. బరువుగా, అడుగులువేస్తూ వెనుదిరిగిపోయాడు. పోరు చల్లబడింది. వీధి చల్లబడింది. తిన్నగా ఇంటికెళ్ళి గుమ్మంలో కూలబడ్డాడు.

అంతవరకూ నవ్వుతూ మాట్లాడిన ప్రతివారూ ఆ సమయంలో సుబ్బన్ననిచూసి, చాటుకు తప్పుకున్నారు. "ఏమిటీ విపరీతం?" అనుకున్నారు. ఆ సమయంలో అతనిమీద అతనికే అసహ్యం ముంచుకొచ్చింది. 'ఇలా ఒరేఁ !" ఆడుకుంటున్న చంటికుర్రాడ్ని పిల్చి చేతులుచాపేసరికి, వాడు కేరే మంటూ లోపలికి పరుగెత్తాడు. ఏ వైపుకుతిరిగినా తనతో మాట్లాడేవాళ్ళొక్కరూ కన్పించకపోగా లోపలికివెళ్లి— ఏడ్చుతూ కూర్చున్న భార్యని "ఏం జరిగిందని ఏడుస్తావ్ !" అంటూ జుట్టుపట్టుకొని, దబదబాది, తిట్టుకుంటూ దొడ్లోకి వెళ్లిపోయాడు. "అందరికీ ఇష్టంలేని పెళ్లి కుదిర్చినందుకు నాకీశిక్ష దేవుడా ?" అనుకున్నాడు కూలబడి. "అవును అందుకే" అని జవాబిచ్చింది అతని హృదయం.

బెరుకుతూ వెంకటరత్నం, సుబ్బారావు, గంగరాజువచ్చి చేతులుకట్టుకు ముందునిలబడ్డారు. వెంకటరత్నం పంచిచాటునుంచి సంచి తీసి సుబన్న ముందు గోనెసంచిమీద పెట్టాడు.

అనాలోచితంగా మూతివిప్పి గతుక్కుమన్నాడు సుబ్బన్న— డబ్బు ! ! లెక్కపెడితే సరిగా వెయ్యిన్నర ! అన్నదమ్ముల కష్టార్జితం ! ! ! తనకి వధుకట్నంగా సమర్పించారు. పైకిచూసేసరికి ముగ్గురన్న దమ్ములూ వేలచూస్తున్నారు.

"ఒరేయ్ ! రత్నం ! మీరు ముగ్గురూ మరో ముగ్గురు పెద్దమనుషుల్ని తీసుకురండి !" అని ఆజ్ఞాపించాడు.

కాస్సేపటికి అంతా వచ్చారు.

అందరి సమక్షంలోను డబ్బుసంచి తీసి వెంకటరత్నం చేతబెట్టాడు. "మామయ్యా !" ముగ్గురూ ఒక్కసారి గట్టిగా అరిచారు

"గాబరా పడకండి.... ఈ డబ్బు నాలాటి బుద్ధి లేనివాడికిచ్చి వాడికూతుర్ని గంగరాజుకిచ్చి పెళ్లి చెయ్యించండి.... వెళ్లండి !" అన్నాడు.... చాటుగా కళ్ళు వత్తుకోవడం ఒక్క గంగిరాజు కంటమాత్రం పడింది. చిన్నగా నవ్వుకున్నాడు.

"మామయ్య మనసు పాలసంద్రం !" అనుకున్నాడు గంగరాజు. పాలసముద్రం మథింపబడి ముందు కాలకూట విషాన్ని, తర్వాత అమృతాన్ని వెదలగక్కింది. అటువంటిదే సుబ్బన్న హృదయం. ముందు కుమార్తెకి— కొడుక్కి ఇష్టంలేకపోయినా బలవంతంగా మరొకపెళ్లి కుదిర్చాడు. దానిక్కారణం భావిజీవితంలో కూతురు సుఖించాలనే అతని తపనమాత్రమే. అయితే అదే అనేక అవర్థాలకి దారితీసి— గుప్తంగా తనకితెలియకుండా రాత్రి పెళ్లి చేసుకోవడంతో, అవమానంతో అతని హృదయం కంపించిపోగా— కనిపించిన వాళ్లందరినీ చితకబాదాడు. గంగరాజు త్యాగం అతనికళ్లు తెరిపించింది. మానవత్వాన్ని బయటికి లాక్కువచ్చింది. ఇప్పుడు సుబ్బన్న పూర్వపు సుబ్బన్న అయ్యాడు. రెండు గంటల వ్యవధిలో తిట్టిన నోళ్లన్నీ సుబ్బన్నని, దేవుడని ఆకసానికి ఎత్తివేసినయ్.

మాణి పెళ్లివారితిట్లు, ఆ వేళ నూతనవధూవరులకి దీవనలయ్యాయి. చంద్రయ్య హృదయం చల్లబడింది.



# శ్రీదేవి

27 వ పేజీ తరువాయి

ఆమెకు ఒంటరిగా ఉన్నప్పుడు కూడా జ్ఞాపకం రా సాగాయి.

ప్రేమ గురించి వేణుద్వారానే మొట్టమొదటి సారి శ్రీదేవి వింది. కొన్ని రోజులు వరుసగా వారిద్దరికీ ఏకాంతంగా మాట్లాడుకునే అవకాశం దొరకక, ఒకనాడు సాయంకాలం ఆమె ఇంటికి వెళ్ళిపోతూంటే ఆమె రిక్షామీద ఎక్కి, కొంతదూరం వెళ్ళేక వేణు ఆమెకు తారసపడి, ఆమె చేతిలో ఒక కాగితంపెట్టి, ఇంటికి వెళ్ళాక చదువుకోమని చెప్పి వెళ్ళిపోయాడు. ఆమె దాని నతి భద్రంగా దాచి, రాత్రి తను ఒంటరిగా గదిలో కూర్చున్నప్పుడు చదివింది. అందులో వేణు తను ఎంతగా శ్రీదేవిని ప్రేమిస్తున్నదీ వర్ణించి రాశాడు. ఏరోజు తనను స్నేహితుడుగా గ్రహించడానికి ఆమె అంగీకరించిందో, ఆనాటినుంచీ తన హృదయం ఆమె యెడల ప్రేమతో నిండిపోయిందన్నాడు. ఆమె తన ప్రేమ నంగీకరించినదీ, లేనిదీ తనకు తెలిసేదాకా తృప్తి ఉండదన్నాడు. ఆమె తనను ప్రేమించకపోయినా, తన ప్రేమ తగ్గదన్నాడు. ఆమె ఆనందం, సుఖం, శాంతికోసం తనేం చెయ్యమన్నా చేస్తానన్నాడు. అందులో మధ్యమధ్య శ్రీదేవి అందాన్ని వర్ణించాడు. అది చదువుతున్నంతసేపూ శ్రీదేవికి ఎంతో ఆనందం కలిగింది. తనకోసం ఒక వ్యక్తి, తన సర్వస్వం అర్పించడానికి సిద్ధపడుతున్నాడంటే, అతన్ని ప్రేమించకుండా ఎలా ఉండగలదు? తనను అంత ఉన్నతంగా చిత్రించిన వ్యక్తికి, తను మనసియ్యకపోవడం అన్యాయమనుకుంది. పైగా, పెద్దల ప్రమేయం లేకుండా, తనంత తను ఒక వ్యక్తిని, తనకు నచ్చినవాణ్ణి ఎన్నుకొని, ప్రేమించడంలో ఒక గొప్ప ఆనందం ఉందనుకొంది. అదే ఇంగ్లీషువాళ్ల పద్ధతి! ఆమె ఎప్పుడూ, తన జీవితాన్ని నవ్యపథంలో నడిపించాలని ఉండేది. వేణుకు అటువంటి ఉద్దేశాలున్నాయి. అతనితో జీవితం చాలా ఉత్సాహంగా ఉంటుంది. అతనిని ప్రేమించడంద్వారా తను, ఈ నిస్సహాయమైన వాతావరణంనుంచి కొంత విముక్తి పొందుతుంది. ఈ ఆలోచనలన్నీ ఆమె మనసులో కలుగగానే, వెంటనే ఒక కాగితంమీద, తన ప్రేమను తెలియజేస్తూ వేణు కొక ఉత్తరం రాసింది. వారిద్దరిమధ్యా ఏదిరోజులు ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. ఇది అంతవరకూ వారిద్దరికీతప్ప మూడోవ్యక్తికి తెలియదనుకున్నారు. కాని, సుభద్రమ్మ ఒక కంట వీరి వ్యవహారాన్ని గమనిస్తూనే ఉంది. శ్రీదేవి వేణువైపు చూస్తున్న చూపులు, అతను ఆమె యెడల చూపిస్తున్న శ్రద్ధా, వారిద్దరి సంభాషణలోని ఆత్మీయతా, ఏదోవిధంగా వారిద్దరూ ఏకాంతం కల్పించుకొని ఆత్రతగా మాట్లాడుకునే మాటలూ, ఒకరి కొకరు ప్రేమలేఖలు రాసుకోవడం, అన్నీ ఆమె కనిపెట్టింది. వేణుని స్త్రీలు సులభంగా ప్రేమిస్తారని ఆమెకు తెలుసు. శ్రీదేవివంటి భార్య దొరుకుతే వేణు అదృష్టవంతుడే. కాని, వేణుకు శ్రీదేవి నివ్వడానికి విశ్వేశ్వరావుగారూ, జయమ్మా అంగీకరించరు, కాబట్టి వారిద్దరికీ వివాహం జరగడం కల్ల. పరస్పరాకర్షణకు లోనై వారిలా ప్రవర్తిస్తున్నారు. వారిని ఎంత ఎడంగా ఉంచితే అంతమంచిది. లేకపోతే యౌవ్వనంలో ఉన్న వారిద్దరూ హద్దుమీరి ప్రవర్తిస్తే ప్రమాద పరిస్థితి ఏర్పడవచ్చు. గొప్పవాళ్లతో ఏది వచ్చినా తంటాయే! అందువల్ల వాళ్లకు నష్టం ఉండదు గాని, తమబోటి చిన్నవాళ్లకు చాలా నష్టం కలుగుతుంది. తమ జీవితం నలుగురిలో పరువు ప్రతిష్ఠలకోసం వెరవవలసిన జీవితం. ఈ విషయాలన్నీ వేణుకు చెప్పి లాభం లేదు. అతను వీటిని లెక్కచెయ్యడు. శ్రీదేవితో అన్నా ప్రమాదమే. ఆమె చాలా ఆవేశ స్థితిలో ఉంది. కాబట్టి ప్రస్తుతం తనే ఏదో ఉపాయం ఆలోచించాలి.

జయమ్మతో సుభద్రమ్మ, తను నాలుగు రోజులు తమ భూములు చూసుకోవడానికి దగ్గరున్న పల్లెటూరుకు వెళ్తాననీ, అందువల్ల, తను ఇంటివద్ద ఉండననీ, ఒకనాటి ప్రొద్దున్న శ్రీదేవి వింటూండగానే చెప్పింది. శ్రీదేవి తెల్లబోయింది.

"ఈ నాలుగు రోజులూ నువ్వు ఇంటివద్దనే మిషనుమీద ప్రాక్టీసు చేసుకోవడానికి మిషను పంపిస్తాను" అంది సుభద్రమ్మ, శ్రీదేవి మొహంలోని

---

మీ శ్రీవారు మీ వివాహానికి ముందు ఏం చేసేవారూ?

తార : నా సెక్రటరీ ఉద్యోగం.

జర్నలిస్టు : ఇప్పుడు?

తార: ఏమిటా ప్రశ్న. ఇప్పుడాయన మా శ్రీవారు.

రాణి కళావతి

---

మార్పుల్ని కనిపెట్టూ. శ్రీదేవి అలాగేనని తలూపింది. ఈ నాలుగు రోజులూ వేణును చూడడం పడదుకదా అని ఆమె మనసులో దిగులు పడింది. దానికితోడు జయమ్మ నోటివెంట ఒక క్రొత్తవార్త కూడా వింది. ఆవాళ గురువారం.

"నువ్వు సోమవారంనాటికల్లా వచ్చెయ్యాలి సుమా! ఆవాళ శ్రీదేవిని చూడడానికి పెళ్ళివారొస్తున్నారు" అంది జయమ్మ, సుభద్రమ్మతో. శ్రీదేవి ఉలిక్కిపడింది.

"ఏమిటి! శ్రీదేవికి, పెళ్ళివారే! ఏ ఊరూ? ఎవరబ్బాయి? ఏం చేస్తున్నాడూ? అన్నీ చెప్పు అత్తయ్యా?" అని సుభద్రమ్మ అడిగింది.

"గూడూరు. మనవాళ్లే. వాళ్లకు మైకా గనులున్నాయట! చాలా భాగ్యవంతులు. పేరు ఏదో చెప్పాడు అన్నయ్య. కాని, నేను మర్చిపోయాను. అబ్బాయి ఏదో పెద్ద చదువే చదివాడు. అబ్బాయి అందంగా ఉంటాడని కూడా అన్నయ్య చెప్పాడు. శ్రీదేవికి ఈడూ జోడూ అన్నీ సరిపోతాయిట. సోమవారం మధ్యాహ్నం వాళ్లు వస్తున్నారు. మనకన్నా పై అంతస్తే వాళ్లది. అయినా అన్నయ్యను వాళ్లు చాలా ఎరిగి యుండటంవల్ల, పిల్ల నచ్చితే, త్వరలోనే చేసేసుకుంటారట!" అని జయమ్మ చెప్పింది. సుభద్రమ్మకు కూడా చాలా వరకూ బెంగ తగ్గినట్లయింది.

"అయితే నేను సోమవారం ప్రొద్దుటికల్లా వచ్చేస్తాను. ఇటువంటి సంతోష సమయం కోసమే నేను ఎదురు చూస్తున్నాను."

"నువ్వు ఆవాళంతా ఇక్కడే ఉండాల. వాళ్ళకేమేమి మర్యాదలు చెయ్యాలో, శ్రీదేవి నెలా ముస్తాబు చెయ్యాలో అన్నీ నువ్వే చూసుకోవాలి. నాకు వంట్లో బాగుండదు. అనసూయకు శ్రద్ధలేదు."

"తప్పకుండా అలాగే వస్తాను" అని చెప్పి సుభద్రమ్మ వెళ్ళిపోయింది. శ్రీదేవి మాత్రం చాలా విచారించింది. ఈ నాలుగు రోజులూ తను బయటకు కదలడానికి వీలుండదు. వేణును చూడకపోతే తనకు తోచదు. రోజూ అతని ఉద్రేకం, ప్రేమా, తన సౌందర్య వర్ణనతో కూడిన ప్రేమలేఖల్ని చదవకపోతే సంతోషమే ఉండదు తనకి. ప్రతిరోజూ ప్రొద్దున్న లేచిన దగ్గర్నుంచి, మధ్యాహ్న సమయం కోసం ఎదురుచూస్తూ ఎలాగో కాలం గడపడం, మధ్యాహ్నం సుభద్రమ్మ ఇంటికి వెళ్ళి తనకోసం ఎదురుచూస్తున్న వేణుకు చిరునవ్వుతో తన ఆనందాన్ని తెల్పడం, అతనితో ఏదో నెపం పెట్టుకొన్ని మాట్లాడడం, పరస్పర మనోభావాల్నీ, కాంక్షలీ వెలిగక్కే మాటలతో, చూపులతో ఒకరి సహచర్యాన్ని మరొకరు ఆనందించడం, మొదలయిన కార్యక్రమముండేది. వచ్చేముందు, రాత్రి తను ఎంతోసేపు ఆలోచించి రాసిన ప్రేమలేఖను అతని కిచ్చేది, జాగ్రత్తగా ఎవరూ చూడకుండా. వేణు కూడా ఏదో నెపంతో ఆమెకు దగ్గరగా వచ్చి, తన ప్రేమలేఖ నందించేవాడు. అది సుభద్రమ్మ కంటపడకుండా తన జాకెట్టులో దాచేసేది. ఇంటికి వచ్చి తన గదిలో ఒక్కర్తీ కూచొని, ఆత్రుతతో, వేగంగా కొట్టుకుంటున్న గుండెలతో, తనకోసం వేణు ఎంత బాధ పడుతున్నదీ, తనను ఎన్ని విధాలుగా ప్రతినిముషం అతను తల్చుకుంటున్నదీ, తను వచ్చేసిన క్షణం నుంచి మళ్లీ మర్నాడు తను అతని కంటబడేవరకూ అతను ఎటువంటి బాధ ననుభవిస్తున్నదీ, చదివేది. అవి ప్రణయావేశంతో నిండిన ఉత్తరాలు. వాటిలో వాక్యాలు ప్రేమలో ముంచెత్తి రాసినవి. అవి చదువుతూంటే ఒక నిధమైన ఆనందంతో కూడిన మత్తు కల్గించేవి. అందులోని మాటలూ తన శరీరం చుట్టూ వలలా ఆవరించుకొనేవి. అందులోని భావాలు సముద్ర తరంగాలలా తన హృదయానికి తగిలి, ఉద్రేకంతో తనను ఉక్కిరి బిక్కిరి చేసేవి. వేణును చూస్తూంటే 'ఈ వ్యక్తి తన మధుర స్వప్నాలను నిజంచేసే దేవత గాని, సామాన్యుడు కాదు' అనిపించే దామెకు యౌవ్వనారంభంలో ఉత్పన్నమయ్యే మోహావేశం, శ్రీదేవిని పూర్తిగా ఆవహించింది. ఆ మోహావేశంలో వేణే తన సర్వస్వమనీ, అతని కోసం తను ఏమైనా చేసి, అతనిని పొందాలనీ అనుకుంది.

సోమవారం ఎప్పుడొస్తుందా? అని ఎదురుచూస్తూ, అతి కష్టంమీద ఆ నాలుగురోజులూ గడిపింది శ్రీదేవి. ఈ నాలుగు రోజులూ వేణు ఆమె మనస్సులో ప్రతి నిముషం మెదులుతూనే ఉన్నాడు. రాత్రిళ్లు ఒకొక్కప్పుడు తన మంచం వద్దకు వచ్చి, నవ్వుతూ వేణు నిలబడి ఉన్నట్లు కల వచ్చేది. ఆ కలలో ఉన్నంతసేపూ మనస్సు ఆనందంతో నిండిఉండేది. కానీ, వెంటనే మెలకువ వచ్చేది. కల కరిగిపోయి, వేణు కన్పించనందుకు ఆమెకు ఎంతో దుఃఖం వచ్చేది. మరి నిద్దర పట్టేదికాదు. ఏవో ఆలోచనలు వచ్చేవి. తన పెళ్ళి గురించి ఆలోచించేది.

తన పెళ్ళి ఎవరో ఎరుగని వ్యక్తితో, కొద్దికాలంలో అయిపోతుంది! అప్పుడు వేణు తనకు దూరమై పోతాడు! వేణులేని తన జీవితం నరకప్రాయంగా ఉంటుంది. తను ఎరగని—ఆ భర్తకాబోయే వ్యక్తికీ, తనకూ ప్రేమ బాంధవ్యం ఉండదు. తన తల్లి దండ్రుల జీవితంలాగే, తన జీవితం కూడా నిరంతర బాధామయం కావచ్చు! అసలు తను అటువంటి వివాహాని కెందు కంగీకరించాలి? 'నా కీ పెళ్ళొద్దు!' అని ఎందుకు చెప్పకూడదు? ఉహూ! ఆ అవకాశంలేదు. తాతయ్యా, అమ్మమ్మా తనను మాట్లాడనివ్వరు. వారి కెదురుగా నిల్చి తను చెప్ప లేదు. తన నలా పెంచారు. తను ఆడ పిల్ల కావడంవల్ల, వాళ్ళకు తన ఉద్దేశమైనా అడగ వలసిన అవసరం ఉన్నట్లు కన్పించలేదు! తను ఇంత అవమానాన్ని సహించవలసిందే. తను స్త్రీ గాబట్టి వ్యక్తిత్వపు విలువల్ని కోల్పోవలసిందే!—'ఏం?' 'ఎందుకు?' అని ఆమె హృదయం ఎదురు తిరిగింది. చేతులారా పెంచిన ఆడపిల్లను బొత్తిగా ముక్కూ, మొహం ఎరుగని అయ్య చేతుల్లో పెట్టుతున్నామే! ఆమెకు కావలసింది డబ్బొక్కటేకాదు—సంసార సుఖం కూడా కావాలి—వారిద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకోవాలి—అని ఆలోచించని పెద్దలకు తనెందుకు లొంగాలి? తను వాళ్లని ఎందుకు ప్రతిఘటించకూడదూ? — ప్రతిఘటించాలి! కాని, ఎలా?.......ఎలా?—అనేదే సమస్య! అని ఆలోచిస్తూ తెల్లవార్లూ గడిపేసేది. ఆమెకు ఆ నాలుగు రోజులూ నిద్రపట్టకపోవడమేకాదు, అన్నం కూడా సరిగా సహించలేదు. కళ్ళు లోతుకు పోయాయి.

అనుకున్నట్లుగా సోమవారం ప్రొద్దున్నే సుభద్రమ్మ తన పిల్లలతో సహా విశ్వేశ్వరరావుగారింటికి వచ్చింది. శ్రీదేవికి కొంత ప్రాణం లేచి వచ్చింది. లీలనూ, సురేష్‌నీ మేడమీదకి తన గదిలోకి తీసుకెళ్ళి, మంచి మంచి బిస్కట్లు పెట్టి, వేణు గురించి అడిగింది. 'బాబాయికి ఈ నాలుగు రోజులూ తోచ లేదు' అందులో లీలా, సురేష్ లేకపోతే అసలు తోచలేదుట—అని లీల శ్రీదేవితో చెప్పింది. సురేష్ ఆ గదిముందు వరండాలోకి వెళ్ళి, ఊరు చూస్తున్న సమయంలో లీల, "వదినే! బాబాయి ఎవరూ చూడకుండా నీకీ కవరిమ్మన్నాడు" అని తను బొడ్డు దగ్గర పరికిణీ మడతల్లో దాచిన ఒక కవరిచ్చింది. అది చూడగానే శ్రీదేవి మొహం వికసించింది. వెంటనే లీలను ఎంతో మెచ్చుకుని, ఆమె రెండు బుగ్గలూ ముద్దాడింది. ఆ కవరు ఆతృతగా చింపి, అందులో వేణు రాసిన ప్రేమలేఖను గబగబా చదివేసింది. ఇంతలో సుభద్రమ్మ తనను పిలవటం వల్ల, ఆ ఉత్తరం తన పుస్తకాల్లో దాచేసి, పిల్లలతోసహా క్రిందికి వెళ్ళిపోయింది. ఆమె మనస్సులో ఆనందం విజృంభించింది.

సుభద్రమ్మ శ్రీదేవికి తలంటిపోసింది. తరువాత ఆమెకున్న బట్టలలో మంచివి ఏరి కట్టించింది. పెళ్లివారికోసం రకరకాల ఫలహారాలు తయారు చేయించింది. మధ్యాహ్నం పెళ్ళివారొచ్చే సమయానికి ఇల్లంతా సర్ది, శ్రీదేవిని బాగా అలంకరించి సిద్ధంగా ఉంచింది. ఆమెకుగల నేర్పుకు విశ్వేశ్వరరావుగారు కూడా సంతోషించారు.

మధ్యాహ్నం పెళ్లివారొచ్చారు. ఇద్దరు ఆడవాళ్ళూ, ఇద్దరు మగవాళ్ళూ వచ్చారు. పెళ్లికొడుకు సిల్కు సూటు వేసుకొని ఉన్నాడు. అతని తండ్రి పంచెమీద పొడుగాటి కోటూ, దానిమీద సిల్కు కండువా వేసుకున్నాడు. ఆయనకు అరవైఏళ్లుంటాయి. ఆయన పొడుగ్గా, లావుగా, బట్టతలతో, దర్జాగా వున్నాడు. స్త్రీలిద్దరికీ ఏభైఏళ్ల వయస్సు దాటి ఉంటుంది. వారి వంటినిండా బంగారపు ఆభరణాలున్నాయి. వాళ్లు అక్కచెల్లెళ్లయి ఉంటారు. ఇద్దరూ చాలా లావుగా ఉన్నారు. వారు శ్రీదేవిని చాలా ప్రశ్నలు వేశారు. ఆమె వీణ వాయిస్తుందని తెలిసి, వీణ వాయించమన్నారు. ఆమె వాయించింది.

పెళ్ళికొడుకు సన్నగా ఉన్నాడు. అతను శ్రీదేవిని చూచిన దగ్గరనుంచి ముగ్ధుడయ్యాడు. ఒక్క మాటైనా మాట్లాడకుండా ఆమెను చూస్తూ కూర్చున్నాడు. చుట్టూవున్న పెద్దలకు, అతనిని శ్రీదేవి అందం బాగా ఆకర్షించిందని గ్రహించటానికి ఆట్టేసేపు పట్టలేదు.

విశ్వేశ్వరరావుగారిని, పెళ్ళికొడుకు తండ్రి చాలా కాలంనుండి ఎరుగును. అందువల్ల ఆయన కొడుకునూ, వచ్చిన స్త్రీలనూ వేరే ఒక గదిలోకి రమ్మని పిల్చి, వారి అభిప్రాయం కనుక్కొని, వెంటనే తమకు పిల్ల నచ్చిందని తెలియజేశారు విశ్వేశ్వరరావుగారికి.

పదిహేను రోజుల వ్యవధిలో పెళ్ళి జరిపించటానికి నిశ్చయమైంది. ఇరుపక్షాలవారికీ, వీలైనంత త్వరలో ఈ పెండ్లి జరిపించాలని ఉంది. అప్పటికా పెళ్లికొడుకు ఏభైరెండు సంబంధాలు చూసి తనకు నచ్చలేదన్నాడు. ఈ పిల్ల నచ్చడమే ఒక వింత విషయంగా వారు భావించారు. నాలుగు రోజుల్లోవచ్చి ప్రధానం చేసుకుంటామని చెప్పారు. అంతేకాకుండా కట్నకానుకల విషయంలో వారేమీ అడగలేదు. ఏమి పెట్టినా సంతోషమే నన్నారు. పెళ్ళివారు వెళ్లిపోయాక జయమ్మా, సుభద్రమ్మా, అనసూయమ్మా శ్రీదేవి చాలా అదృష్టవంతురాలని అన్నారు. సాయంకాలం అయిదు గంటలకు సుభద్రమ్మా, పిల్లలూ వెళ్లిపోయారు. జయమ్మ, సుభద్రమ్మ చేసిన సహాయాని కెంతో పొగిడింది. సుభద్రమ్మను మరునాడు తప్పక రమ్మంది.

సుభద్రమ్మ వెళ్ళిన కొద్దిసేపటికి శ్రీదేవి జయమ్మవద్దకు వెళ్ళి, తను సినిమాకి వెళ్తానంది. అందుకు జయమ్మ, "ఒక్కర్తివీ ఎలా వెళ్తావ్. పోనీ, ఇందాకైనా చెప్పకపోయావా? సుభద్రను తీసికెళ్ళమనేదాన్ని. రేపు వెళ్తువుగానిలే" అంది. అందుకు శ్రీదేవి పనిమనిషిని తోడు తీసుకు వెళ్తానని, జయమ్మచేత ఒప్పించింది. సాధారణంగా అలా పంపడానికి జయమ్మ అంగీకరించదు. కాని, ఆ రోజు ఆమె మనస్సు శ్రీదేవికి పెళ్ళి సంబంధం స్థిరపడిందనే ఉత్సాహంతోవుండి, శ్రీదేవి కోరిక నిరాకరించలేకపోయింది.

అయినా సినిమాకి వెళ్లడంలో పెద్ద తప్పేముంది ఈ రోజుల్లో — ననుకుంది జయమ్మ. పని మనిషిని శ్రీదేవికి జాగ్రత్తగా తోడుండమని చెప్పిపంపింది. శ్రీదేవి తన కోరిక నెరవేరినందుకు ఎంతో ఉత్సాహం పొందింది. సినిమాకి వెళ్లేదారిలో పనిమనిషితో సరదాగా మాట్లాడి, దాని చేతిలో అయిదు రూపాయలు పెట్టింది. అది, "అయిదెందుకమ్మా. మన టిక్కట్లకు రెండు రూపాయలు చాలు" అంది. దానికి శ్రీదేవి, ఆ అయిదూ టిక్కట్లకు కాదనీ, అది పనిమనిషికి తను ఇస్తున్న

## పాప ఉత్తరం

'సత్యం'

అందరికీ ఉత్తరాలు
పెద్దవారు వ్రాస్తుంటే
చంటిపాప కూడ వ్రాసె -
చంద్రున కొక ఉత్తరం! -
"నింగిలోన ప్రతిరోజూ
తొంగిచూచు మామయ్యా-
త్వరలో "రాకెట్"పై, నీ
దరికి చేరుతామయ్యా!
పూరీలు—హల్వాలూ
నీకు తెచ్చిపెడతాము!
నీతో ఆ లోకమంత
షికారుగా చూస్తాము!
తదుపరి మా రాకెట్ పై
నిన్నుకూడ ఎక్కిస్తాం!
అందమైన మా భూమికి
నిన్ను అతిథిగా తెస్తాం!
పెద్దపెద్ద నాయకులకు
నిన్ను పరిచయం చేస్తాం!
పల్లె-పట్టణా లెన్నో
బోలెడన్ని! చూపిస్తాం!
మంచి మంచి బొమ్మలెన్నో!
ఏరి కోరి నీకిస్తాం!
బాలబాలికలమంతా
నీతో స్నేహమందుతాము!
పిల్లలన్న నీ కెంతో
ప్రేమంటారీ కవులు!
అది ఎంతో చూడాలని
ఎదురుతెన్ను చూస్తున్నాం!
సరేగాని 'చందమామ!'
సాయంత్రం నింగిలోన
తొంగిచూచునపుడు మళ్ళి
తిరుగు టపా వేస్తావా?"
నీకోసం వేయికళ్ళ
నింగివైపు చూస్తుంటా!
ఇంతటితో ఈ లేఖను
"పోస్టు"లోన వేస్తున్నా!

బహుమతి అని చెప్పి, టిక్కట్టు కొనుక్కోమని దానికి వేరే రూపాయిచ్చింది. తను చెప్పినట్లు చెయ్యమని చెప్పింది. అది సంతోషంగా అయిదు రూపాయలు తీసుకొని సరేనంది. సినిమా హాలువద్దకు వెళ్ళగానే వేణు కన్పించాడు. పరస్పరం ఆనందంతో మాట్లాడుకున్నారు. తను, ఆయనతోకలిసి వేరే క్లాసులో కూర్చుంటాననీ, సినిమా అయ్యాక తనని కలుసుకోమనీ పనిమనిషితో చెప్పింది శ్రీదేవి. అది అందు కంగీకరించింది.

# 7

వేణూ, శ్రీ దేవీ కలిసి రిజర్వుబాక్సు సీట్సులో కూచున్నారు. తనకు ఈ నాలుగు రోజులూ ఎంత కష్టంగావుందో వేణు ఆమెకు చెప్పసాగాడు. ఆ బాక్సులో వాళ్లిద్దరే వుండడంవల వేణు ఆమె ప్రక్కనే కూర్చొని ఆమెచెవిలో మెల్లిగా కబుర్లు చెప్తూంటే, శ్రీదేవి వేణువెుహంచూస్తూ, అతనే తన ఆనంద నిలయమనీ, అనురాగ మూర్తియనీ, హృదయాధి నాధుడనీ, భావించుకొంటూ ఏదో అనిర్వచనీయమైన ఆనందం పొందుతూ, ఆమె మొహంలో తనభావాన్ని స్పష్టంగా వ్యక్త పరుప సాగింది. లైట్లు ఆరిపోయి, సినిమా ఆరంభించినదే తడవుగా, వేణు తన రెండు చేతులలోనూ శ్రీదేవి మొహం తీసుకొని, ఆమె పెదవుల్నీ, నుదురునీ బుగ్గల్నీ ముద్దుపెట్టుకున్నాడు. ఎవరైనా చూస్తారేమో అని భయం, ఆ ఉద్రేకం యొక్క అనుభవాన్ని వదులుకోలేని బలహీనతా, జీవితంలో ఎదో ఒక మాత్న అనుభవం కలుగుతోందనే భావం, ఆమెను ఒక్కసారిగా ఆవరించాయి. 'ఇక్కడవద్దు' అని అతని చెవులో ఆమె చెప్తూవే అతని పెదవులు తన పెదవుల్ని మూసేస్తూంటే, వాటి ఒత్తిడికి తనూ దోహదంచేసింది. ఇద్దరి మొహాలు కొద్దిసేపు దూరమవుతున్నా, మళ్ళీ మళ్ళీ కలుసుకోవారంభించాయి. 'ఎవరూ చూడరు', 'ఫరవాలేదు', 'నాదేవివి కదూ ! నిన్నుచూస్తూ ఎలావూరుకోడం ?' అని మెల్లిగా ఆమె చెవిదగ్గర మాట్లాడుతూ, ఆమె వద్దని వారిస్తున్నా ఆమెననేకసార్లు ముద్దుపెట్టుకొన్నాడు. ఒక నిముషంలో ప్రపంచాన్నంతా మరిచిపోయి తామిద్దరమే వున్నట్లు భావించుకునేవారు, మరు నిముషంలో తామున్నచోటూ, తమపరిస్థితీ, తమ ప్రేమకు కలిగే ఆటంకాలూ, అన్నీ దిగులుగా, బాధగా జ్ఞాపకమొచ్చేవి.

"దేవీ ! నాకు దూరమైపోతావా ?"

"లేదు. వేణూ ! అలా ఎప్పటికీ జరగదు."

"మరినీకు పెళ్లి నిశ్చయమవుతోంది ? నీసంగతెలాగుందోగాని, నాకుమాత్రం అది నిశ్చయమైన నాడు, వెర్రెత్తిపోతుంది. నిన్ను కల్సిన దగ్గర్నుంచీ నువ్వు నాదానివనే అనుకుని బంగారుకలలు కన్నాను. నీమీద నాకు కలిగిన ప్రేమ, నన్ను ఎక్కడికో తీసుకుపోయింది. ఎవో పర్వత శిఖరాలపై, మేఘాల నీడల్లో విహరిస్తున్నాను. నువ్వు దక్కకపోతే ఆ శిఖరంనుంచి అఘాతంలోకి పడిపోతాను."

"అబ్బ ! ఏమిటా మాటలు ? ఎందుకంతబాధ? నేను నీకు దూరమవుతానని ఎవరన్నారు ? నాకు నువ్వుతప్ప ఇంకెవ్వరూ అక్కర్లేదు. నువ్వేం చెయ్య

కుంటే అది చేస్తాను." అంది శ్రీదేవి. తనమాటతో వేణు భయంపోగొట్టి, అతన్ని లాలిద్దామని. ఆ మాటలు అతనికి ఆనందం కలిగించేబదులు, కొండెడు దిగులు కలిగించాయి. లాభం లేదన్నట్లు తలూపాడు. శ్రీదేవి, అతని ఉద్దేశమేమిటన్నట్లు తన చేత్తో అతని గడ్డం ఎత్తి, అతని మొహంలోకి సూటిగా చూసింది. అతను కళ్లు మూసుకొన్నాడు. ఒక్కక్షణంపోయాక కళ్లు తెరిచాడు.

"ఇలా ఎప్పటికీ మనిద్దరం కలిసివుంటే ఎంత బాగుండును! హు! అటువంటి అదృష్టం నాలాంటి నిర్భాగ్యుడికెలా లభిస్తుంది?" అని దిగులుగా తల వంచేశాడు. శ్రీదేవి కర్థం కాలేదు.

"వేణూ! మనం తప్పక కలిసిఉంటాం. ఎందుకలా అంటావ్?"

"మరేమనమంటావ్? మీ వాళ్లందరినీ నాకోసం వదులుకుంటావని నేనంటే అది నిజమనుకోమంటూ వుంటావా?"

"నా మాటమీద నమ్మకంలేదా?"

"నీమాటమీద నమ్మకమే! కానీ అంతపని నువ్వు చెయ్యలేవు. నీకోసం, నా హృదయం బద్దలై, ముక్కలు, ముక్కలై పోవలసిందే"

"పొరపాటు. నువ్వు చెప్పినట్లు చెయ్యడానికి నే నెప్పుడో సిద్ధమయ్యాను. నాకు నీతోటిదే జీవితం. నావాళ్లకన్నా, అందరికన్నా, నాకన్నా కూడా నాకు నువ్వే ఎక్కువ!"

"నిజమేనా! నాకోసం వాళ్లందర్నీ వదులుకొని వచ్చేస్తావా?"

"ఓ! తప్పకుండా!"

వేణు ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి, ఆమెను దగ్గరగా తీసుకొని ముద్దు పెట్టుకుంటూ, "నిన్ను నా దేవతలా చూసుకుంటా. నీకోసం ఎన్ని కష్టాలైనా భరించి, నీ శరీరం పువ్వుల్లో పెట్టి పూజిస్తా. మన ఇద్దరం, ఎక్కడైనా దూరంగా కోవెలలో పెళ్లి చేసుకుందాం. వీళ్లందరికీ తెలియకుండా పారిపోదాం."

"వేణూ! నేను నువ్వు లేనిదే జీవించలేను. నీతో ఎక్కడికి రమ్మన్నా వస్తాను. వాళ్లెవరికీ నా సంగతి అక్కరలేదు. నే నేమైపోయినా వాళ్లు విచారించరు. నాకు ఆ ఇంటినీ, ఆ మనుష్యులనీ చూస్తే చిరాకెత్తుతోంది. అర్ధరాత్రిలేచి ఎక్కడికైనా పారిపోదామని పిస్తుంది. నాకు నువ్వు తప్ప ప్రపంచంలో ఎవ్వరూ లేరు. నువ్వు కూడా నాకు దూరమైపోతే నేను బ్రతకలేను" అని కండ్లవెంబడి నీరు కార్చింది శ్రీదేవి.

"అయితే మనం ఎప్పుడు వెళ్ళిపోదాం?"

"నీ ఇష్టం!" అంది శ్రీదేవి.

వేణు కొద్దిసేపు ఆలోచించాడు. తనతో వచ్చెయ్యడానికి శ్రీదేవి అంగీకరించింది. ఈ అదును తప్పితే మరి తనకు ఆమె దక్కదు. అంతవరకూ శ్రీదేవి ప్రేమ సాధించడమే అతని ఉద్దేశం. కాని, శ్రీదేవి యొక్క స్వభావం ఉద్రేక వాంఛామయమైనా, ఆమె తనను కాబోయే భర్తగా గ్రహిస్తోందిగాని, కేవలం క్షణిక సాంగత్యంకోరే ప్రియుడిగా చూడటంలేదు. ఆమె తన వాళ్లను వదిలిపెట్టి రావడం, కేవలం తనతో కులాసాగా నాలుగు రోజులు గడపడానికి కాదు, శాశ్వతంగా తనతో కలిసి ఉండడానికి. ఆమె వైపొకసారి చూచాడు. ఆమె మెడలో చాలా ఖరీదైన ఆభరణాలునాయి. ఆమెకు అందమేకాదు డబ్బు కూడా ఉంది. తనకు రెండూ కావాలి. అందుకని, ఆమెతో తను మరునాటికి అన్ని ఏర్పాట్లూ చేస్తాననీ, ఆమె సుభద్రమ్మ ఇంటికివస్తే, ఏదో విధంగా తా మిద్దరం ఎక్కడికైనా వెళ్ళిపోదామనీ చెప్పాడు. ఆమె అలాగేనంది. పెళ్ళి ఏర్పాట్లకు అవసరమయ్యే డబ్బు కూడా తను తెస్తానంది. సినిమా పూర్తయి, ఒకరినొకరు వదిలిపోవలసిన సమయం వచ్చేసరికి ఇద్దరికీ దుఃఖం వచ్చింది. అయినా మరనాడు మళ్లీ కలుసుకొంటామనే ధైర్యంతో, తాము తలపెట్టిన కార్యం ఎలా నెరవేర్చాలో ఆలోచించుకుంటూ ఇళ్లకు వెళ్లారు.

సినిమా కాగానే తనను కలుసుకోమన్న పనిమనిషి శ్రీదేవికి ఎంత వెదికినా కన్పించలేదు. అది సాధారణంగా తెలివైనదే. కాని, దానిదృష్టి సినిమామీద ఎక్కువ తీవ్రంగా లగ్నమైంది. సినిమాను వదలి ఇంటివైపుగా నడిచేవరకూ శ్రీదేవమ్మగారితో సినిమాకి వచ్చినట్లూ, తన నామె సినిమా అయిపోగానే గేటువద్దకు వచ్చి తనని కలుసుకోమని చెప్పినట్లూ గుర్తుకి రాలేదు. అప్పటికే తను సినిమాహాలు వదిలి ఒక మైలుదూరం వచ్చేసినట్లు కూడా తెలుసుకుంది. 'అయ్యో!' అని అనుకొని మళ్లీ సినిమా హాలువైపు పరిగెట్టింది. అది వెళ్లేసరికి సినిమా హాలు బయట స్త్రీ లెవరూలేరు. దానికిముందు బెంగారు పుట్టింది. కాని, తరువాత అది కొంచెం ఆలోచించి, 'బహుశా ఆ అయ్యగారు, శ్రీదేవమ్మను ఇంటివద్ద దిగబెట్టి ఉంటార'నుకొంది. అది వేణూ, శ్రీదేవి బాక్సులో కూచోడం చూసింది అంతకు ముందు. ఆ పనిమనిషి విశ్వేశ్వరరావుగారింటికి వెళ్లేసరికి, హాలులో కూర్చున్న విశ్వేశ్వరరావుగారు, "ఏయ్! రామీ! ఇలారా!" అని కేకేసారు. పెదబాబుగారంటే ఇంట్లో అందరికీ హడల్! అది వణుక్కుంటూ వెళ్ళి ఆయనముందు నిల్చింది.

"అమ్మాయిని వదిలిపెట్టి ఎక్కడి కెళ్లావ్?"

"పొరపాటయిపోయింది బాబుగారూ! అమ్మాయిగార్ని ఆ బాబు దిగబెట్టేసి ఉంటారనుకొని, తిన్నగా వచ్చేశాను బాబు" అంది రామి. తను అసలు శ్రీదేవి సంగతే మర్చిపోయి, సినిమాహాలు వదిలి కొంతదూరం వెళ్ళిన సంగతి దాచేస్తూ. విశ్వేశ్వరరావుగారి కాశ్చర్యం వేసింది.

"ఎవరా బాబు?"

"అమ్మాయిగారితో కూర్చున్న బాబేనండి. ఆ ఇద్దరూ పెద టిక్కెట్లు కొనుకున్నారండి. నేను బెంచీకెళ్లానండి......"

"ఎలా ఉంటాడా బాబు? అతన్ని మును పెప్పుడైనా చూశావా?"

"లేదండి. చామనచాయగా ఉంటారండి. పాతికేళ్లలోపు వయసే ఉంటుందండి. అమ్మగారా బాబు కాడే కూకున్నారు."

విశ్వేశ్వరరావుగారు ఒక నిముషం ఆలోచించారు. రామిని ఇంకేమీ అడక్కుండా లోపలికి వెళ్లిపొమ్మన్నారు. ఆయన అంతకుముందే శ్రీదేవి ఒంటరిగా రావడంచూసి, ఆమెను ఎక్కడికి వెళ్లిందీ అడిగారు. దాని కామె తను పనిమనిషీ సినిమాకు వెళ్లామనీ, పనిమనిషి దారితప్పిపోయి, ఎక్కడికో వెళ్ళిపోయిందనీ, తనుమాత్రం తిన్నగా వచ్చాశాననీ చెప్పింది. కొద్ది రోజులుగా శ్రీదేవి మధ్యాహ్నం పూట సుభద్రమ్మ ఇంటికి వెళ్తోందని తెలిసి నప్పుడే ఆయనకు చిరాకేసింది. పైగా ఇలా వంట

## శ్రీదేవి

రిగా సినిమాకి వెళ్ళడం ఆయన కసలు నచ్చలేదు. శ్రీదేవి చెప్పిన మాటలూ, రామి చెప్పిన మాటలూ విని ఆయన, ఇందులో ఏదో తనకు తెలియని వ్యవహార ముందని గ్రహించారు. అయితే దీన్ని గురించి అనవసరంగా ఆయన పెద్ద గొడవ చెయ్యదల్చుకోలేదు. ఆయన కార్యవాదీ, అనుభవశాలీ. ప్రతివిషయానికీ, ఎంతవరకు అవసరమో అంతే ప్రాముఖ్యత నిస్తాడాయన. అందుకని ఈ విషయంలో ఆయన చేసిన దేమిటంటే, మర్నాడు పొద్దున్న జయమ్మతో శ్రీదేవిని ఎక్కడికీ పంపవద్దనీ, సుభద్రమ్మ ఇంటికి కూడా వెళ్ళనియ్యదన్నారు.

అవాళ మధ్యాహ్నం శ్రీదేవి మామూలుగా జయమ్మ వద్దకువెళ్ళి తను సుభద్రమ్మ ఇంటికి వెళ్తానని చెప్పినప్పుడు జయమ్మ, "నిన్ను ఎక్కడికీ వెళ్ళనియ్యదన్నాడు మీ తాతయ్య. అందుకని ఎక్కడికీ వెళ్ళకు" అని చెప్పేసరికి శ్రీదేవి నిర్ఘాంత పోయింది. ముందు కోపంగానూ, తరువాత బతిమాలుతూనూ, తరువాత కండ్లవెంబడి నీళ్ళు కారుస్తూనూ—దీనంగానూ, తను ఒక్కసారివెళ్ళివస్తానని శ్రీదేవి అడిగింది. జయమ్మ ఒప్పుకోలేదు. శ్రీదేవి అడిగినకొద్దీ, ఆమె పట్టుదల హెచ్చింది. ఏమైనాసరే, పెళ్ళయ్యేదాకా గుమ్మం కదలడానికి వీల్లేదంది. ఈ వయసులో పిల్లలు నలుగురిలో తిరిగితే ఎంతో అప్రతిష్ఠ అంది. ఇన్నాళ్ళూ తను శ్రీదేవిని ఆమాత్రమైనా తిరగనియ్యడం తనదే పొరపాటంది. ఎలాగో శ్రీదేవి [illegible]ల్లో మూడు ముళ్ళూ పడిపోతే తమ బాధ్యత తీరిపోతుందంది. చివరికి నిస్సహాయంగా శ్రీదేవి తన గదిలోకివెళ్ళి, రోషంతో ఏడుస్తూ కూచుంది.

తను వేసుకున్న పథకమంతా తల్లక్రిందులైంది. తను ఇక వేణును చూడలేదు. అతనితో తను ఎక్కడికో వెళ్ళిపోదామని కనిన కలలన్నీ అసత్యమయ్యాయి. ఏం జరిగిందోగాని, ఒక్కసారిగా తన స్వేచ్ఛను లాక్కొని, ఆ ఇంట్లో బంధించేశారు. ఇన్నాళ్ళూ తను పుట్టి పెరిగిన ఇల్లే అదైనా, తన కిప్పుడు జైలులా కన్పిస్తోంది. ఒక్కసారిగా ఆమెకు ఆ ఇల్లు నరకప్రాయంగా తోచింది. పంజరంలో చిలకలా ఆమె బాధపడసాగింది.

తన జీవితపథాన్ని నిర్మించుకోవడానికి శాయశక్తులా కృషిచేసింది. కాని, తను ఎవరిని ప్రతిఘటిద్దామనుకుందో, ఎవరినుంచి దూరమౌదామనుకుందో, ఎవరిని అసహ్యించుకుంటుందో, వాళ్ళు తన ఆశాలతను త్రుంచివేశారు. తాతయ్యా, అమ్మమ్మా, అమ్మా వీళ్ళంతా రాక్షసులు! వారి నామె విపరీతంగా ద్వేషించింది. తిట్టుకుంది. తన చేతకానితనానికి జుట్టు పీక్కుంది. దేనితోనన్నా పొడుచుకు చద్దామనుకుంది. గోడకేసి తలకొట్టుకుందామనుకొంది. చివరికి వెక్కి వెక్కి ఏడ్చింది. తలగడామీద మొహంపెట్టి, కన్నీటితో గలీబంతా తడిముద్ద చేసేసింది.

కొంతసేపు నిస్సహాయంగా ఏడ్చిన తరువాత ఆమెకు నీరసం వచ్చింది. కాని, హృదయం తేలికైంది. బుర్రలో ఏవో ఆలోచనలు పరిగెత్తనారంభించాయి. తాతయ్యా వాళ్ళమీద పగ ఒక్కసారిగా విజృంభించింది. ఏమైనాసరే వీళ్ళని ప్రతిఘటించి పగదీర్చుకోవాలి! వీళ్ళకు నలుగురిలో అవమానం జరిగినాసరే! అప్పటికైనా తన తలితండ్రులకు బుద్ధొస్తుంది! పిల్లలు కూడా మనుషులేననీ, వాళ్ళకూ కోరికలుంటాయనీ, స్వేచ్ఛా, ప్రేమా, ఆనందాలు వారికి కూడా వాంఛనీయాలేనని తెలియాలి. పెళ్ళి! తనకు పెళ్ళిచేసి, తన బాధ వదిలించుకోవాలని అనుకుంటున్నారు. ఆ ఇష్టంలేని పెళ్ళి తనకెందుకూ? అంతకన్నా ఏ నూతిలోనైనా పడిచస్తే మంచిది. ఈ తన శరీరంమీద ఎవడో ఒక పశువు, సర్వహక్కులూ చెలాయిస్తూంటే పడివుండడంకన్నా దీన్ని నశింపజేస్తేనే మంచిది. వేణు చేతుల్లోఉండగా తన హృదయం ఎలా ఉరకలు వేసింది! అతని లాలనలో, ప్రేమలో, ముద్దుల్లో ఎంత మాధుర్యముంది! దానికోసం, ఆ మాధుర్యాన్ననుభవించడం కోసం తను ఏమైనా చేస్తుంది. చెయ్యాలి! తప్పదు!

(సశేషం)

## మాలతి తండ్రి

22—వ పేజీ తరువాయి

ఉంటుంది ? మొదట్లో మీకే చెప్తాను మేష్టారూ! నాకు కావలసినవారు, బంధువులు, అధికంగా లేరు. మీరే దగ్గరుండి నడిపించాలి." అన్నాడు రంగభాష్యం.

ఇలా చెప్పిన మర్నాడే ఉత్సాహం అంతా అణగారిపోయి ముఖాన్ని వేలేసుకుని వచ్చాడు. అతని చూసి నేను నిర్ఘాంతపోయాను.

"ఏమిటీ సమాచారం! అదోమాదిరిగా ఉన్నావే!" అని అడిగాను.

"ఆరోజు నాటక రంగస్థలంపై చూశావే, మేష్టారూ ! ఆ ప్రబుద్ధుడు విడవకుండా మాలతిని చుట్టుతున్నాడు ! నాకు కొంచెం కూడా నచ్చలేదు" అన్నాడు రంగభాష్యం.

"నీకు ఇష్టంలేదు అంటే ఏం చేయడం ? ఆమె కన్నెపిల్ల, అదే కాకుండా చదువుకున్నపిల్ల. సర్వ స్వతంత్రంగా జీవిస్తున్న వనిత. ఆమె మీద నీ బాధ్యతని స్థాపించుకోలేక పోయావా ? ఆమెకి నిన్ను పెళ్ళి చేసుకోవటం ఇష్టమా లేదా అని ఖరాఖండిగా అడిగెయ్యి ! మూసి మూసి పెట్టడంలో ఏం ప్రయోజనం ? 'మాట్లాడతావా, చస్తావా' అనే సామెత వినలేదా ? నోరుండేవారే ఈకాలంలో జయించుకురాగలరు" అన్నాను.

"నిజమేను. ఉంది, లేదు అని మాలతిని అడిగేస్తాను" అన్నాడు రంగభాష్యం. కానీ అలా అడగడానికి లేశంలో అతని ధైర్యం రాలేదు. వాయిదా వేస్తూనే కాలం గడిపాడు. కానీ అదే సమయంలో వేదన అనుభవించి అవస్థపడుతున్నాడు. అతనిమీద కోపగించుకోవడమో, అనుతాపపడడమో, నాకు తెలియలేదు.

ఒకరోజు రంగభాష్యం భీతికరమైన ముఖంతో నా గదికి హఠాత్తుగా వచ్చి చేరాడు.

"మేష్టారూ ! నాకు ఒక పెద్ద అపాయం రాబోతోంది. మీరే సహాయం చేసి ఎలాగైనా కాపాడాలి" అన్నాడు.

అతనికి ఏదైనా మతి స్థిరత్వం తప్పిందో అని నాకు అనుమానం వేసింది. అతని ముఖం పిశాచం పట్టినట్లుండింది. మాటల్లో తొందర, భయం, కన్పడింది. కొంచెం అనునయంగానే "విషయం ఏమిటి చెప్పు ! నావల్ల వీలయితే నీకు తప్పకుండా సహాయం చేస్తాను !" అన్నాను.

"ఎవరో ఒకడు నన్ను అస్తమానం వెంటాడుతున్నాడు. నన్ను చంపటానికో, మరి ఏ ఉద్దేశంతోనో తెలియటం లేదు. నేనుండే గది వాకిట్లో నిలుచుని లోపలికి చూస్తూ నిలుచుంటాడు. ఎవరో చూద్దామని దగ్గర కెళ్ళితే మాయం అయిపోతున్నాడు. నా గదికి వెళ్ళటానికే భయంగా ఉంది. మీతోనే కొన్నాళ్ళు ఉండనా?" అని అడిగాడు.

"భేషుగ్గా ఉండొచ్చు! నీ భయం ఉత్తుత్తి భయంగా ఉండొచ్చు కదా ? ఎవరో నిన్ను వెంటాడుతున్నారని నువ్వు అనుకోవటం ఒట్టి భ్రమగా ఉండొచ్చుగదా ? ఇలాంటి భ్రమ ఒక్కోసారి మంచి జ్ఞానులకి కలగడం ఉంది. సమీపంలోని ఒక పెద్ద మనిషిని గురించి విన్నాను. అతను పరిశోధనలో గట్టివారని ప్రసిద్ధి నొందారు. కాని ప్రపంచం అంతా తన పేరు చెడపడానికి దురాలోచన చేస్తున్నట్లుగా అతనికి భ్రమ. ఇద్దరు తమలో తాము మాట్లాడుకుంటుంటే చూసి వెంటనే 'చూశావా ! వారు నన్ను గురించే ఏదో నిందించుకొంటున్నారు ! వారిమీద వ్యాజ్యం వేయాలి.' అని చెబుతూ ఉంటారుట. అలాగే నీవు కూడా అవకూడదు......"

ఇలా నేను చెప్తుతూ ఉండగానే, రంగభాష్యం, నాచేయి పట్టుకుని లాక్కెళ్ళి, ఆ గది యొక్క కిటికీ ద్వారా బయటికి చూడమని ఆదేశించాడు. అతను చూపించినచోట, వీధి దీపం వెలుతురు పడని ఒక స్తంభం చాటున, ఎవరో ఒక మనిషి నిలుచోటం తెలిసింది.

"ఎవరో ఒక మనిషి సందేహాస్పదంగా, చాటుగా నిలుచున్నాడు. అందువల్ల ఏమిటి ? కాకి కూర్చుండగా తాటిపండు పడ్డ కథలాగా ఉండొచ్చు కదా?" అన్నాను.

కొన్నాళ్ళయ్యాక మాలతి నటించిన నాటకాన్ని వ్రాసిన దినకరుని నేను సంధించడం తటస్థించింది. అతనే నాతో సంభాషణ మొదలుపెట్టాడు.

"మీతో ఒకరు నాటకానికి వచ్చారే, అతని పేరేమిటి ?" అని అడిగాడు.

"రంగభాష్యం" అని చెప్పాను.

"అది అతని నిజమైన పేరుకాదు !" అని చెప్పి నన్ను నిర్ఘాంతపోయేట్లు చేశాడు.

"ఎందువల్ల అంటున్నారు ?" అన్నాను.

"మీకు ఎన్నాళ్ళయి అతన్ని తెలుసు ?"

"సుమారు ఒక ఏడాదిగా తెలుసు."

"అలాగే అయిఉంటుంది అని నేనూ అనుకున్నాను. ఇదుగో ఈ గ్రూపు ఫోటోలో ఉన్న ఈ వ్యక్తిని చూడండి. దీని క్రింద వ్రాసిన పేరును చదవండి" అన్నాడు దివకర్.

అతను చూపించిన వ్యక్తి కొంచెం రంగభాష్యం లాగానే ఉన్నాడు. క్రింద కె. ఆర్. రామానుజం అన్న పేరు వేసిఉంది. అయినాను, ఒక గ్రూపు ఫోటోలో ఉన్న అస్పష్టమైన రూపుని చూసి నిశ్చయంగా ఒక నిర్ణయానికి రావడం ఎలా సాధ్యం అవుతుంది ?

"దీంట్లోంచి నాకేం తెలీటంలేదు. అలాగే ఉన్నానూ, మీకూ మాకూ దాన్ని గురించి బెంగ ఎందుకు ? పేరు మార్చుకోవాలని ఒకరు ఇష్టపడితే, దాన్ని మనం ఎలా ఆపగలం ?" అని అడిగాను.

"అందుకు చెప్పలేదండీ ! ఒక వ్యక్తి పోకిరిగా వ్యవహరించి, ఒక అబలస్త్రీని ఏమార్చి వశపర్చుకోవడం అంటే, అది మిక్కిలి మోసమైన కార్యమా కాదా ? అలాంటి నీచమైన పనిని ఆపడం మన కర్తవ్యం కాదా ?" అన్నాడు.

"నాకు వేరే ముఖ్యమైన కర్తవ్యా లున్నాయి. ఇప్పుడు దీన్ని నెత్తిమీద వడేసుకోవటానికి తయారుగా లేను" అని చెప్పి మా సంభాషణని ఖండించాను.

కాని నా మనస్సు కొంచెం నెమ్మదిని కోల్పోయింది.

రంగభాష్యం ఇంకోరోజున వచ్చాడు. ముఖంలోని మార్పుని వర్ణించ వలవికాదు. ఆరోజు ఆకాశ విమాన ప్రయాణంలో అతన్ని చూసినప్పు డుండే వెలుగారు ముఖం ఎక్కడ ? భీతి ఆవహించి బ్రహ్మహతి ఆడుతున్న ఈ పేద ముఖం ఎక్కడ ? అతన్ని చూడగానే నేనే సంభాషణ ప్రారంభించాను.

"ఏమిటయ్యా ! ఆఖర్న మాలతి చేతులు కడిగేసుకుందా ? ఏం ఇంత శోకం ?" అన్నాను.

"లేదు లేదు ! మాలతి నన్ను పెళ్లి చేసుకోవటానికి సమ్మతి తెలిపింది. ఏదో ఒక ముఖ్యమైన బాధ్యత ఆమెకి ఉందిట. అది నెరవేర్చటంతవరకు కొన్నాళ్లు వేచిఉండమంది, అంతలోగా నా తలమీద ఈ పిడుగు పడింది.!" అని చెప్తూనే, ఒక పత్రికలోని తునకని తీసి చూపాడు.

అందులో ఈ క్రింది విధంగా వ్రాసి ఉంది :—

"శ్రీ మరుతాచలం చెట్టియారు కంపెనీలో మానేజరు పని చూసుకునే రంగభాష్యానికి ఒక హెచ్చరిక. అతను మిస్. మా .... అనే పిల్లని మరచి, ఒక వారంలోగా మద్రాసు వదిలేసి పారిపోవాలి. అలాగ వెళ్లిపోకపోతే, అతని పూర్వాశ్రమ పేరు, మోసపు పనులు, తగిన ఆధారాలతో ఈ పత్రికలో ప్రకటింపబడుతాయి. జాగ్రత్త !"

దీన్ని చూసిన నాకు నవ్వు వచ్చింది. ఇందుకోసమేనా ఇలాగ భయపడ్డాడు ?

"ఇలాంటి అసహ్యమైన పత్రికలను నువ్వెందుకు కొని చదువుతావు ? చూసి మనస్సెందుకు పాడుచేసుకుంటావు ?" అని అడిగాను.

"నేను కొనలేదు. దీన్నెవరో పత్రికలో నుంచి కత్తిరించి నాకు పోస్టులో పంపారు. దీన్ని వ్రాసిన మనిషే అయిఉండాలి" అన్నాడు.

"ఇలాంటివారి యుక్తి ఇది. అందులో నువ్వెందుకు పడాలి ? తూటుముక్కలుగా చింపిపారేసి స్థిమితంగా ఉండి నీపని చూసుకో ! సంఘంలోనూ, సమాజాల్లోను జరుగుతున్న కార్యాలని గురించి విమర్శన చేయడం పత్రిక ధర్మం. దానికి వ్యతిరేకంగా, వ్యక్తిగతమైన మనుష్యుల గుట్టును బయట పెట్టుతున్నామనేవారు పత్రికలవారేకాదు. ఇదంతా చదవడం ఇబ్బంది, చెవులో వేసుకోవడమూ ప్రమాదం ! అలాంటి అపవాదులవలన నీకేమీ అపాయం రాదు. ధైర్యంగా ఉండు !"

ఇలా చెప్పి కొన్ని ఉదాహరణలు చెప్పాను. మన దేశంలో ప్రముఖుల్ని గురించి అనకూడని అభాసైన అపవాదులు, కొన్ని చెత్తపత్రికలలో వచ్చాయి. అందువల్ల ఆ ప్రముఖులకు లోటేమి వచ్చింది ? ఏమీ లేదు అని చెప్పాను.

దానికి రంగభాష్యం చెప్పిన జవాబు నన్ను నిశ్చేష్టుడిని చేసింది.

"ఆ ప్రముఖుల్ని గురించి వ్రాసినదాంట్లో నిజం ఉండీ ఉండదు. అందుకేవాళ్లు బెంగలేకుండా నిశ్చింతగా ఉన్నారు. కానీ నా విషయంలో ఇందులో వ్రాసినది నిజమేనే ! నేను ఎలా నిశ్చింతగా ఉండగలను?" అనాడు.

ఒరే! నీకు దేవుడు ప్రత్యక్షమవుతే ఏమి అడుగుతావురా?

రాము : డబ్బు.

గోపీ : బుద్ధి.

రాము: అంతేమరి ! ఎవరికి ఏది లేపోతే అది అడుగుతారు.

సుబ్బారావు (అనకాపల్లి)

తర్వాత నేను పయాన్న బలవంతపరిచి అడిగినందున అతను తనపూర్వ కథని చెప్పాడు :

రంగభాష్యం నిజమైనపేరు రామానుజం. అతను కలకత్తాలో ఒక పెద్ద యజమాని దగ్గర అంతరంగిక కార్యదర్శిగా పనిచేస్తుండేవాడు.

యజమాని అనేకరకములయిన పనులు చేసేవారు. అదేకాకుండా యుద్ధకాంట్రాక్టులు తీసుకున్నారు. అతనికి ఎదురుచూడని కొన్నిడబ్బు కష్టములు ఏర్పడ్డాయి. ఇందువల్ల తప్పుడు కార్యాల్ని కొన్నింటిని చేశారు. యజమాని విశ్వాసంవల్ల రామానుజం వాటి అన్నింటికీకూడా సహాయం చేయసాగాడు. నిజానికి అందులో అన్యాయం ఏమీలేదనీ, కొన్నాళ్ళలో అన్నీ చక్కబడుతాయని యజమాని నొక్కి వక్కాణించినది నమ్మాడు. కానీ హఠాత్తుగా ఒకరోజున అతను నమ్మినదంతా అబద్ధం అయింది. న్యాయాతిక్రమణ పనులు బయట పడ్డాయి. ఈ తప్పుడు పనులతో యజమానేగాకుండా పెద్దపెద్ద ఐ.సీ.యస్ ఉద్యోగులూ, ఇంజనీరులు మొదలగువారంతా సంబంధం కలిగియున్నారు. అయినా వాళ్ళంతా పలుకుబడి కారణంగా తప్పించుకున్నారు. వాటిసన్నింటికీ, పాపం, రామానుజమే జవాబుదారీ కావలసివచ్చింది. అతన్ని ఖైదుచేసి విచారణ జరిపారు. పేద మాటకి పృథివిలో వెలలేదు. రామానుజంపేర్న కేసుబుజువయి అతనికి రెండు సంవత్సరములు చెరసాలవాసం దండన వేసారు.

చెరలో ఒకటిన్నర సంవత్సరమయ్యాక హిందూదేశానికి స్వాతంత్ర్యము వచ్చింది. ఆ స్వాతంత్ర్య శుభదినాన, క్రొత్తగా పాలనాధికారానికి వచ్చిన కాంగ్రెసు మంత్రులు చెరలోనున్న కొంతమంది ఖైదీలకు విడుదల ప్రసాదించారు. రామానుజాన్ని గురించి ఖైదు అధికారులు మంచి రిపోర్టులు పంపినందున, రామానుజం విడుదలచేయబడ్డాడు. చెన్నపట్టణానికి వచ్చి క్రొత్త జీవితం ప్రారంభించాడు. మోసపు పనుల కేసులోపడ్డ తన పాత పేరును మార్చుకుని శ్రీ మరుదాచలం చెట్టియారు కంపెనీలో పనిలో చేరాడు, అతని వ్యాపార నేర్పులవల్ల, తెలివితేటలవల్ల శీఘ్రకాలంలోనే పెద్ద ఉద్యోగానికి వచ్చాడు. క్రొత్తయజమానైన చెట్టియారు, అతన్ని పూర్తిగానమ్మి తన వ్యాపారమునంతనీ అప్పగించారు. కలకత్తావిచారణ, అందువలన కలిగిన అనుభవాలు, అన్నీ ఒక భయంకర స్వప్నంగా అనుకుని రంగభాష్యం వాటిసన్నింటినీ మరచిపోయిన సమయంలో ఈ పిడుగు అతని తలమీద పడింది.

ఎవరో ఒక కిరాతకుడు అతని పాతజీవితాన్ని కెలికి అందలి సంభవాల్ని ప్రకటించటానికి తయారుగా నున్నాడు.

పైన చెప్పిన శోకకథ ముగిశాక రంగభాష్యం తిరిగి చెప్పనారంభించాడు :

"నేను మోసపుపనుల వ్యాజ్యంలో దండన ననుభవించిన ఖైదీని అని బయటపడితే మా కంపెనీ యజమాని నన్ను తక్షణమే తరిమివేస్తారు. మాలతి కూడా నన్ను కన్నెత్తిచూడదు. ఆమె మనస్సు గాయపడుతుంది ! నాకు ఆమెముఖం చూడ్డానికి ధైర్యం రాదు. అందువలననే పనికి రాజీనామా చేసేసి బెంగుళూరుకు వెళ్ళిపోదామని తీర్మానించుకున్నాను. నా బెంగుళూరు విలాసము మీకుమాత్రం ఇస్తాను. మీరు ఎవ్వరికీ చెప్పనని మాటఇవ్వాలి ! ఏదైనా ముఖ్య విషయం ఉంటే మాత్రం తెలియపరచండి" అన్నాడు రంగభాష్యం.

అతను మోసపుపనుల కేసులో అన్యాయానికి బలియైనాడు అని చెప్పినదాన్ని నేను పూర్తిగా నమ్మాను. ఈ విధంగా పెద్ద యజమానులు చేసిన తప్పులకు జీతంపుచ్చుకునే పనివారిని బాధ్యులుగా చేసిన మరికొన్ని సంభవాలు నాకుతెలుసు. ఆతర్వాత ఆ యజమానులు కూడా పట్టుబడటం విని యున్నాను. అందువల్లే రంగభాష్యంమీద నాకు జాలి కలిగింది.

"ఇదేమి పిచ్చి ? నీయందు మాలతి స్వచ్ఛమైన ప్రేమ కలిగియున్నదైతే, ఇందుకోసమని ఆమె మనస్సు మార్చేసుకుంటుందా ? నీ కంపెనీ యజమానిని గూర్చి నేనేమీ చెప్పనేరను. కానీ మాలతి అలాంటి నీచగుణం లేనిదని నేను నిశ్చయముగా చెప్పగలను. నీ నిజస్థితి తెలిస్తే ఆమెకు నీయందలి అనురాగము అధికము అవుతుంది" అన్నాను.

"దయచేసి మన్నించండి ! ఇలాంటి అపనిందతోటి ఆమె ముఖం చూడ్డం నావల్లకాదు" అన్నాడు రంగభాష్యం.

అతని నిర్ణయం మార్చడానికి నేను బడ్డ ప్రయాస అంతా బూడిదలో పోసిన పన్నీరయింది. మాల

అతనిపై అచంచలమైన ప్రేమ కలదని అతను నమ్మటంలేదని తెలిసింది. ఆమె మనస్సులో అనలే ఒక శంక ఉన్నది. ఆ శంకను బలపరచి అతన్ని నిరాకరించటానికి ఈ పిత దురదృష్టం చాలు కదా ? "అంతా విధియొక్క విలాసం" అని విధి మీద భారం మోపి, రంగభాష్యం చెప్పినదానికి ఒప్పుకున్నాను. పాపం ! అత ననుభవించిన వేదనను నేను సహించనేరకపోయాను. కాలం, దైవం మాత్రం అతని కష్టాలను పోగొట్టి, శాంతిని ప్రసాదించాలి.

## 8

రంగభాష్యం బెంగుళూరు వెళ్లాక, చాలామార్లు మాలతి నాతో టెలిఫోనులో మాట్లాడి అతని కబురేమైనా తెలిసిందా అని అడిగింది. నేనూ అతని కిచ్చిన వాగ్దానం తలుచుకుని "తెలీదు" అని చెప్పుతూ వచ్చాను. ఒకరోజు నన్ను నేరుగా కలుసుకోవాలని కోరింది. నా బ్రహ్మచారి నివాసానికి ఆమెను రమ్మనడం ఇష్టంలేక ఆమె ఉండే స్థలానికే, నేను వెళ్లాను. అప్పుడే ఆమె మనస్సులోని ఒక భాగాన్ని నేను తెలుసుకోగలిగాను. రంగభాష్యంపై ఆమె నిజమైన ప్రేమ కలిగియుండటంలో సందేహంలేదు. నాటక కథను వ్రాసిన దివాకర్ని ద్వేషిస్తోంది అనటంలో ఆశ్చర్యంలేదు. "నా తండ్రి చనిపోయేముందు నాకో పని ఇచ్చి పోయారు. ఆ కర్తవ్యం నెరవేర్చటం కోసరమే వేచియున్నాను. అంతలోగా మీ స్నేహితుడు ఏం తలుచుకున్నారో ఏమో తెలియదు. కబురు చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయారు. ఈ పోకిరి దివకర్ అతనిదగ్గర ఏమైనా అబద్ధాలు చెప్పాడేమో అని కూడా సందేహిస్తున్నాను. ఇలాగంతా ప్రపంచంలో దగాకోర్లుంటారు. వారి మాటల్ని నమ్మవచ్చా ! ఇలా మీ స్నేహితుడు చేశారే ? ఇక నా బ్రతుకు అధోగతే ! నేను ఒక దురదృష్టవంతురాలను !" అని మాలతి చెప్పి బొటబొటమని కన్నీరు కార్చింది.

ఆమె దుఃఖాన్ని పోగొట్టే శక్తి నా దగ్గర ఉంది. కానీ దాన్ని వెంటనే ఉపయోగించటం నా కిష్టంలేదు. ఇంకా ఆమె మనస్సుని బాగా తెలుసుకోవాలని అనుకున్నాను. రంగభాష్యం పూర్వకథ తెలిశాక కూడా ఇదే మనోభావం ఆమె కుంటుందా లేదా అని ఎవరు చూచారు ? దాన్ని గురించి వెంటనే చెప్పి పరీక్షించటానికి నేను ఇష్టపడలేదు. కొంచెం వేచి ఉందా మనుకున్నాను. అయినా దివకర్ గురించి మాత్రం విచారించాను.

"అతను నా తల్లి మూలంగా దూరపు బంధువు అవుతాడు. ఆ బంధుత్వంవల్ల నన్ను బాధ పెట్టుతున్నాడు. నా దగ్గర కొంచెం డబ్బుంది అని నమ్మి దాన్నపహరించటానికని చూస్తున్నాడు. అయినా డబ్బు నాదికాదని అతనికి తెలియదు. చెప్పినా వినడు. ఒకరోజు బాగా తిట్టి పాఠం నేర్పిస్తాను. ఆ తర్వాత ఈ ప్రక్కకే రాడు" అంది.

దివకరుడంటే మాలతికి అసహ్యం అనే దాంట్లో ఆవగింజంత కూడా సంశయంలేదు. ఇది ఒకరకంగా నాకు తృప్తి, మనశ్శాంతి, నిచ్చింది.

మరోరోజు ఆ కిరాతకుడు దినకరుడు నన్ను



వెతుక్కుంటూ వచ్చాడు. రంగభాష్యం గురించి అడిగాడు. "కబురేం తెలియదు" అన్నాను.

"అదేమిటి హఠాత్తుగా మాయమైపోయాడు ? కారణం ఏమిటి తెలుసా ?" అని అడిగాడు.

"తెలీద" న్నాను.

"నాకు తెలుసు" అని చెప్పి, రంగభాష్యం చూపించిన అలాంటి పత్రిక ముక్కే చూపించాడు.

"ఇందువల్లే ఆ మోసగాడు పారిపోయుండాలి!" అన్నాడు.

ఒక వ్యక్తియొక్క స్వంత జీవితాన్ని గురించి వ్రాసేదే వ్యాపకంగా పెట్టుకున్న చెత్త పత్రికల గురించి నేను గట్టిగా తిట్టాను.

"అదంతా ఉండొచ్చు. కాని ఇది అతని తలకి మించి టోపీ అనటంలో సందేహంలేదు. అందుకే మాలతితో కబురేనా చెప్పకుండా, విలాసమేనా తెలుపకుండా, ఈ వూరుని విడిచి పారిపోయాడు" అన్నాడు దివకర్.

---

ఒక పాలవ్యాపారి చనిపోయే ముందు కొడుకులందరినీ పిల్చాడు:

"ఇక ఈ లోకం వదిలి పోతున్నాను. నేనుమీకువదిలినఆస్తితో ఎలాగోనెట్టుకురాగలుగుతారనుకోండి! అయినా, పాలవ్యాపారం చేసేప్పుడుమాత్రం ఒక విషయం గుర్తుంచుకోండి—పాలు నీటితోనే చేస్తారనుకోకండి, ఆవులు కూడా అవసరం!"

---

దివకర్ని కొంచెం పరీక్షించాలని "అలా అయితే మాలతి విషయంలో మీకు పోటీ తగ్గిందని చెప్పండి" అన్నాను.

"అయినా స్త్రీల విషయమే విచిత్రమైనది. ఇంకా ఆ దగాకోరుమీదే ఆమె వ్యామోహం కలిగియుంది. అత నెక్కడికి వెళ్లాడు అని నన్ను విచారించమంటూంది. చాలా బాగుందికదూ ! అయినా ఇంకా ఈ పత్రిక విషయం ఆమెకు తెలియదు. ఇవాళే చెప్పేస్తాను" అన్నాడు.

"ఇలాంటి హెచ్చరిక ఈ పత్రికలో రాసిం దెవరు ? మీరేనా ?" అని అడిగాను.

"నేను కాదు. నాలాగే రంగభాష్యం మోసపు పనులు బయటపెట్టడంలో శ్రద్ధ ఉన్నవారు ఇంకెవరో ఉండిఉండాలి. అయినా ఇందులోని విషయం నిజం అనడంలో సందేహంలేదు. నాకు బాగా తెలుసు. మీకు ముందే చెప్పానుగా ? ఉన్న కొంచెం సందేహం కూడా అతను పారిపోవటంతో తీరిపోయింది !" అన్నాడు.

"అలా అయితే మాలతితో దీన్ని గురించి చెప్పి తీరతారా ?" అని అడిగాను.

"ఇప్పుడే నేరుగా ఆమె ఇంటికి వెళ్తున్నాను !" అన్నాడు దివకర్.

అతను మాలతిని చూస్తే దాని ఫలితం ఏమవుతుందో అని నేను ఆతృతతో ఉన్నాను.

## 9

మర్నాడు మాలతి నన్ను వెదుక్కుంటూ నా గదికి వచ్చింది. "మీ స్నేహితుడిని ఎలాగైనా వెంటనే కనుక్కోవాలి. ముఖ్యమైన పని ఒకటి ఉంది. పత్రికలో అడ్వర్టయిజ్ చేసి చూద్దామా ?" అంది.

"పత్రికల్లో ప్రకటన వేసినందున ప్రయోజనం ఏమీ ఉండబోదు. నేనే వేరే విధంగా వెతుకుతాను. కానీ అంత ముఖ్యమైన విషయం ఏమిటి? నాకు తెలుపకూడదా ?" అని అడిగాను.

"మీకు తెలియవలసిందే ! లేకపోతే అతన్ని వెదకటంలో మీరు నాకు సహాయం చేయరు" అంది మాలతి.

మాలతి చెప్పినదాన్నిబట్టి నిన్న నేరుగా దివకర్ నా దగ్గరనుంచి మాలతినే చూట్టానికి వెళ్లి కలుసుకొని, పత్రిక ముక్కని చూపించాడుట. తప్పుడు పనులకు రెండు సంవత్సరములు కారాగృహంలో ఉన్నాడని ఈ పత్రికవల్ల బయట పడ్డంతో రంగభాష్యం పారిపోయాడని చెప్పాడు.

అయినా ఇందువల్ల అతను ఎదురుచూసినది జరుగలేదు. అయినా దానికి వ్యతిరేకంగా జరిగింది.

"ఆ వ్యాజ్యం గురించి మీకేం తెలుసు ? ఎలా తెలుసు ?" అని మాలతి అడిగింది.

"నువ్వు అడిగినందున చెప్పుతున్నాను. కలకత్తాలో మీ తండ్రి నడిపిన కంపెనీలోనే ఇతను ఉద్యోగం చేసాడు. ఆ కంపెనీలో పనిచేస్తూనే తప్పుడుపనులు చేసాడు. నువ్వు అప్పుడు కాన్వెంటు స్కూల్లో చదువుతున్నావు. నీకేమీ తెలియదు. మీ తండ్రి ఇతన్ని పూర్తిగా నమ్మి కంపెనీ బాధ్యతలన్నీ అప్పజెప్పారు. నమ్మినవారికి ద్రోహం చేసాడు. ఇతని కేసు కలకత్తాలో జరుగుతూ ఉండగా నేను యదాలాపంగా కలకత్తాకు వచ్చాను. మీ నాన్నగారితో కోర్టుకు కూడా వెళ్లాను. ఇతనికి రెండు సంవత్సరాలు కారాగృహవాసం వేసారు. శిక్ష ముగియగానే ఇక్కడికి వచ్చి పేరు మార్చుకుని కాలక్షేపం చేస్తూ వచ్చాడు. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగంలో ఏమేమి మోసపు పనులు చేస్తున్నాడో దేముడికే ఎరుక. ఈ ప్రకటన చూసి అతను మాయమవడంతో అతని యోగ్యత తెలీటంలేదా ?" అని దివకర్ రంగభాష్యం గూర్చి పుకార్లను వెళ్లగక్కాడు.

అంతా వింటూన్న మాలతి ఆఖర్న "ఈ పత్రికలో ప్రకటన మీరే వేశారా ?" అని అడిగింది.

"అవును, నేనే వేసాను. నిజాన్ని సందేహం లేకుండా తెలిసికొనడానికని వేశాను. అందుకు ఫలం లభించింది. ఆ దగాకోరు వూరు విడచి డేరా ఎత్తేశాడు" అన్నాడు దివకర్.

"అయినా మీలాంటి నీచగుణం కలవార్ని చూసింది లేదూ, విన్నదీ లేదు." అంది మాలతి.

ఇది విన్న దినకర్ నిర్ఘాంతపోయాడు. మాలతి మాటలు అతనికి అర్థంకాలేదు. మాలతే విడమర్చి అర్థమయ్యేటట్లు చెప్పింది.

"ఏదో ఒకతను దురదృష్టంవల్ల కష్టాలపాలవ వచ్చు. అవంతా మర్చి క్రొత్త జీవితం నడపటానికి ప్రయత్నించవచ్చు. ఇలాంటి నిర్భాగ్యపు మనిషి పూర్వోత్తరాలను తెలుసుకుని పత్రికలో ప్రకటించటం అంత చండాలత్వం ఇంకేం ఉంటుంది ? ఇంక మీ ముఖాన్ని కూడా చూడను. నన్ను చూడ్డానికి రాకండి !" అని ఖండితంగా చెప్పి దినకరుని పంపేసింది. దినకర్ కూడా స్త్రీల తెలివి తక్కువతనాన్ని, నీచగుణాల్ని ఒక గ్రంథం నిందించి వెళ్లాడు.

ఆ తర్వాతే మాలతి నన్ను వెదక్కుంటూ వచ్చింది. "రంగభాష్యాన్ని వెంటనే చూడాలి, నావల్ల అతనికి జరిగిన కష్టానికి నేను క్షమార్పణ కోరుకోవాలి !" అంది.

"మీరు క్షమార్పణ కోరుకోవాలా ? ఎందుకు" అన్నాను నేను.

"నావల్లే కదా దినకర్ అతనికి ఇలాంటి కష్టం కలిగించాడు ? అతను వూరు వదిలే వెళ్లిపోయేటట్లు అయిందే ? ఇదికాకుండా ఇంకో ముఖ్యమైన కారణం కూడా ఉంది !" అని మాలతి చెప్పింది.

ఆ ముఖ్యమైన రెండో కారణం విన్నాక నా సందేహం తీరింది. బెంగుళూరుకి నేనే మాలతిని తీసుకు వెళ్ళదామని తీర్మానించుకున్నాను.

## 10

బెంగుళూరు మెయిలు వేగంగా వెళ్ళతూంది. బయట గాలీ, వర్షం చినుకులు పడుతూండటం మూలాన అద్దాల కిటికీలు మూసేసి ఉన్నాయి. ఆ తలుపులమీద జలజలమని చినుకులు పడి బొట్లు బొట్లుగా నీరు కారుతూంది.

ఈ సమయంలో అసలు విషయం పాఠకులకు చెప్పుతాను.

రామానుజం కలకత్తాలో ఏ యజమాని దగ్గర పనిచేశాడో ఆ యజమానే మాలతి తండ్రి. రామానుజం జైలు కెళ్లాక అతని కంపెనీ అనేక విధము లయిన కష్టాలకి గురి అయి నష్టమయిపోయింది. దేశం స్వాతంత్ర్యం సంపాదించుకునే ముందు కలకత్తాలో జరిగిన భయంకర కల్లోలంలో అతని భవనం ఒకటి నిప్పంటుకుని పరశురామప్రీతి అయింది. దేశస్వాతంత్ర్యం తర్వాత కలకత్తాలో డాక్టరు పి. సి. ఘోష్ పాలనలో నల్లబజారు వ్యాపారం అడుగున బడిపోయింది.

ఇందువల్ల మాలతి తండ్రి నొప్పుల పాలయి మంచాన బడ్డారు. డాక్టర్లు పెదవి విరిచారు. చనిపోయే కాలంలో అతని మనస్సాక్షి అతన్ని బాధ పెట్టింది. ముఖ్యంగా అతన్ని పూర్తిగా నమ్మి విశ్వాసంతో పనిచేసిన రామానుజంకి చేసిన అన్యాయం అతని హృదయంలో పెద్ద భారంగా ఉండింది. అతన్ని కనుక్కోవటానికి అతనివల్ల అయినంత వరకూ ప్రయత్నించారు. కానీ ఫలించలేదు. ఖైదులోంచి బయటికి రాగానే అతను వేరే పేరు పెట్టుకున్నాడు గదా ! తన ప్రియ కుమార్తె మాలతిని పిలిచి విషయం చెప్పి "ఎలాగైనా రామానుజాన్ని వెదకి పట్టి, ఈ ఉత్తరం ఇచ్చెయ్యి" అని నప్పగించారు. తను రామానుజానికి చేసిన అన్యాయానికి పరిహారంగా పదివేల రూపాయలు కూడా ఇచ్చిపోయారు.

రంగభాష్య మనబడే రామానుజం ఉత్తరం చదివి, కొంతసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు. తర్వాత నన్ను చూసి,

"మేష్టారూ ! ఆ పుణ్యాత్ముడు నన్ను ఇన్ని ఇక్కట్ల పాలుచేసి పదివేల రూపాయలతో తుడిచేసుకుందామని చూస్తున్నారు ! ఇదుగో తీసుకోండి ! ఈ డబ్బుని ఆతని ముద్దులపట్టికే ఇవ్వండి" అని నిశ్చయంగా చెప్పేసాడు.

అప్పుడు మాలతి తను ఆడది అన్నది చూపేసింది. బొటబొటా కన్నీరు కార్చి ఏడ్చింది. దాన్ని చూసిన రామానుజం లేచి ఆమె దగ్గరగా వచ్చాడు. దగ్గరకి వచ్చి ఇది చెయ్యాలి అని తెలీక అతనూ ఏడ్వ నారంభించాడు.

వా రిద్దరూ ఒకర్నొకరు ఓదార్చుకోనీ అని నేను బయటికి వెళ్లి చూచాను.

"మేష్టారూ ! మేష్టారూ ! ఒక్కసారి ఉండండి" అన్నాడు రామానుజం.

నేను ఆగాను.

కన్నులను తుడుచుకుని "చెప్పేది పూర్తిగా చెప్పకుండానే ఏడుస్తే నేనేం చేస్తాను. ఈమె తండ్రి నాకు చేసిన అపకారానికి పరిహారం చెల్లించాలంటే దానికి వేరే దారి ఉంది. వెలలేని నంపదయిన అతని కుమార్తెను నాకు ఇచ్చి పెండ్లి చేయాలి ! దానికి సమ్మతమా అని ఆమెని అడగండి" అన్నాడు రామానుజం.

మాలతి కళ్ళు తడుచుకుని "అదెలా కుదురుతుంది ? స్వతంత్ర భారతదేశంలో స్త్రీలకి స్వతంత్రము లేదా ...... ?" అంది.

"అలా అయితే వ్యర్థంగా నన్ను వెదకటం ఎందుకు ? ఈ డబ్బెవరికి కావాలి ? దీన్ని తీసుకుని వెళ్లమని చెప్పండి" అన్నాడు రామానుజం.

"చెప్పేది పూర్తిగా వినక ఎందు కతను అవసర పడుతున్నారు ? నేను నా స్వంత ఇష్టంతో స్వతంత్రంగా ఇతనికి నన్ను అర్పించుకున్నాను. నా తండ్రి ఎలా నన్ను ఇవ్వగలరు ?" అంది మాలతి

వాళ్లని వదిలి బయటికి వెళ్లటానికి అదే సమయమని నేను బయటికి మెల్లగా జారాను.

ఒక నెలకి ముందర రామానుజ దంపతులను చూశాను. చాలా విషయాల్ని గురించి మాట్లాడుకుంటూ దినకర్ గూర్చి కూడా మాటలు వచ్చాయి. అతన్ని ఇద్దరూ నిందించటం నేను సహించలేకపోయాను.

"ఎందుకని ఆ నిర్భాగ్యుడ్ని తిట్టుకుంటారు ? అతను పత్రికలో అనామధేయ ఉత్తరం వ్రాసినందువలననే కదా మీరు ఇవాళ ఇంత సంతోషంగా ఉన్నారు ?" అన్నాను.

"అనామధేయ ఉత్తరం అతనా వ్రాసింది ? అందంగా ఉంది" అంది మాలతి.

హఠాత్తుగా నా మనస్సులో ఒక భీతి కల్గింది. ఒకవేళ నేను ఆ ఉత్తరం వ్రాసానని వీరు సందేహపడ్డం లేదుకదా ?

"లేకపోతే ఎవరు వ్రాసారు ? వేరే ఎవర్నైనా సందేహిస్తున్నారా ? చెప్పండి !" అని అడిగాను.

"సందేహం లేదండీ ! ఎవరు వ్రాశారన్నది నాకు నిశ్చయంగా తెలుసు" అంది మాలతి.

ఇంకా ఎక్కువ భీతితో "ఎవరు వ్రాసారు ! నీ కది నిశ్చయంగా ఎలా తెలుసు" అని ప్రశ్నించాను నేను.

"నేనే వ్రాసాను. అది నాకు నిశ్చయంగా తెలియకుండా ఎలా ఉంటుంది ?" అంది మాలతి.

ఈ స్వతంత్ర భారతదేశంలో నవీన యువతులు ఏమిటి చేస్తారు ? ఏమిటి చెయ్యరు అన్నది ఎవరు నిశ్చయంగా చెప్పగలరు ? అయిపోయింది.



చిత్రకారిణి : పి. శారదా, మదరాసు.

రాసేవాడు కొంచెం కొత్తరకంగా రాద్దామను కుంటున్నాడు. ఇది విన్నాడంటే వస్తే, ఆ మాలతి ఫాదర్ గాడివ్ హీరో చేసేస్తాడు అప్పుడు ఏడుద్దువుగాని."

ఏడిశావు లేవోయ్ అన్నట్లు నవ్వి, "ఏడిశావ్ లేవోయ్" అన్నాడు రఘు. "అదా నీ ఐడియా, నీకు హీరోయినేలేదు. నువ్వు హీరో ఏమిటి నీ ముఖం (నా ముఖంకే చాలా బాగుంటుందనబోయి, అద్దంలో మొఖం చూసుకొని ధైర్యం చాలక ఊరుకున్నాడు హరి.) ఇకపోతే నా మాలతి ఫాదర్‌గా గాడికి పెళ్ళయింది. పెళ్ళయినవాడు లవ్ స్టోరీలో హీరో అవుతాడని భయంలేదు. అని రాసిచ్చి, కాబటి



మిత్రమా నీవు సహాయంచేసి తీరాలి."

నిజమే అనిపించింది హరికి. అనిపించి పది సిగరెట్లు తాగి, అటు తిరిగి, ఇటు తిరిగి, తల పగల గొట్టుకొని, గాయం అయినచోట కొంచెం పౌడర్ రాసుకొని, అట్లాగే కొంచెం ముఖానికి రాసుకొని 'పదరా' అంటూ రఘూని లాక్కొని వీధిన పడ్డాడు హరి.

ఇట్లు గతివయి నిమిషములు నడచి, ఒక గృహం బుచొచ్చి, "ఒరేయ్! నే నొచ్చేంతవరకూ ఈ సోఫాలో మంచి బాలుడు రాములాగా సిగరెట్లు కాల్చకుండా కూర్చో. నేనిప్పుడే లోపలకు వెళ్ళివస్తాను" అని హాలులో సోఫా చూపించి, లోపలకు వెళ్ళాడు హరి.

ఇంతలోనే ఒక వ్యక్తి బయటనుంచి వచ్చి,

# కథేనండి

13-వ పేజీ తరువాయి

"ఎవరు నువ్వు" అన్నాడు. రఘు అదిరిపోయి 'రాము' అన్నాడు మంచిబాలుడు అనిపించుకోవాలని. "ఎందుకొచ్చావ్" అన్నాడా వ్యక్తి. రఘుకు వణుకువచ్చి 'హరి' అన్నాడు.

"ఏం కొంప మునిగిందనిరా గావుకేకలు పెడతావ్" అంటూ వచ్చి, మామయ్యను చూచి, "హల్లో! మామయ్యా" అని షేక్‌హాండ్‌యిచ్చి, ఆయన చేతిని విడుస్తూ, "ఈయనేరా మా వేలు విడిచిన మేనమామ" అంటూ ఆయన వేలు వదిలేసి కూర్చున్నాడు.

"ఇతనిపేరు రఘూనా! మరి రామూ అని చెప్పాడే" అన్నా రాయన.

"అదా మంచివాడని మే మందరము అట్లా పిలుస్తుంటే అదే వాడి పేరనుకున్నాడు. ఇకపోతే వీడి అసలు పేరు రాఘవేంద్రరావు. బరువు మూట ఇరవై పౌనులు. ఛాతీ మామూలుగా ముప్ఫై నాలుగు, గాలి పీలిస్తే ముప్ఫై ఆరు. కాని, ఈమధ్య ఒక ప్రేమ కథలో హీరోగా చిక్కుకుని ఊపిరి సలపటంలేదు. కనుక నువ్వు కొంచెం సహాయం చెయ్యి వాడు. రామనాధంగా రమ్మాయి మాలతిని పెళ్ళి చేసుకునేట్లు చేసి, ఆ రెండంగుళాలు ఛాతీ పెరిగి తగ్గేట్లు చేస్తే, మీ 'పద్మ' ను పెళ్ళి చేసు కుని ఋణం తీర్చుకుంటాను మామయ్యా' అని కథంతా చెప్పేశాడు హరి. వీడికి హీరోయిన్‌వుందా అని ఆశ్చర్యపోయాడు రఘు.

"చాలా మంచివాడంటున్నావు గనుక నేను ఆయనతో మాట్లాడతాను. వీళ్ల నాన్నగారికి టెలిగ్రామ్ఇచ్చి పిలిపించండి" అని లేచా డాయన.

"చాలా థాంక్స్‌సార్" అన్నాడు రఘు తన పోర్షను బొత్తిగా తగ్గిపోవటం గ్రహించి.

* * *

ఆ మరునాటిరోజు హరి ఆఫీసుకు సెలవుపెట్టి, రఘును ఇంటర్వ్యూకిపంపి, ఏమి తోచక, సిగరెట్ కాలుద్దామని అగ్గిపెట్టెకోసం వెతుకుతుండగా, చేతులో సిగరెట్ దానంతటదే వెలిగింది. హరి ఆశ్చర్యపోయి, వాకిలివైపుచూసి, అగ్గి బుగ్గిఅయి కోపంగా వస్తున్న సూర్యనారాయణగారిని చూచి, "అరే! మీరా! ఏమిసార్ ఇంత ఫైర్అయి పోతున్నారు. మనవాడు ఇంటర్వ్యూకెళ్ళాడు కూర్చోండి" అని, నాలుగు ఐస్‌క్రీములు తెప్పించి, ఆయనకి ఇచ్చి కొంచెం చల్లబడిన తరువాత, "ఎల్లాగైనా మనవాడికి పెళ్ళి చెయ్యాలనుకున్నారుకదా? అందుకని నేనే ఒప్పించానుసార్! వాడు ససేమిరా చేసుకోనన్నాడు. ఎలాగో నానా తిప్పలుపడి ఒప్పించాను. నాణ్ణేమీ అనకండి. అసలే యుద్ధం కూడా వచ్చేట్టుందేమో, కోపమొస్తే మిలటరీలో చేరిపోతాడు. మీరు నాలుగు ఐస్‌క్రీమ్‌లు తింటేనే ఇంత చల్లబడిపోయారు. వాడా మంచుకొండల్లో కెళ్తే మళ్ళీ తిరిగొస్తాడా"

"అది సరే ననుకోవోయ్! కాని, అసలు పెండ్లి చేసుకో నన్నాడు, నేను చూచిన పిల్లనుకాదని ఇప్పు డద్దంతరంగా ఒప్పుకోవటమేమిటి" అని అంటూ "సరే కానియ్, ఏమి చేస్తాము" అన్నారు సూర్యనారాయణగారు.

ఇంతలో రామనాధంగారు బయటకువచ్చి, సూర్యనారాయణగారినిచూచి, కోలెడు ఆశ్చర్యపడిపోయి, కింద పడబోయి "ఓహో బావగారే! అబ్బాయిని కూడా తీసుకొస్తున్నారే" అన్నారు.

హరి కలుగజేసుకొని, నిన్ననే వచ్చాడండి అని సంగతంతా చెప్పాడు.

"మొత్తంమీద భలేవాడివోయ్! నిన్నటినుంచి నా కెందుకు చెప్పలేదు" అన్నా రాయన.

ఇంతలో రఘు ఈలవేసుకుంటూవచ్చి, లాస్టు సీనుచూచి, అదిరిపోయి, ముద్దాయిలావచ్చి తలుపు చాటునున్న మాలతి అందాన్ని, హరి ఇచ్చిన మంచి నీళ్ళలో కలిపి త్రాగుతూ "నాకు ఉద్యోగం దొరికిందోచ్" అన్నాడు. అది నా ప్రతిభ అనుకున్నాడు హరి. మాలతి అదృష్టం అనుకున్నారు సూర్యనారాయణగారు. నేనూ ప్రయోజకుడినే అనుకున్నాడు రఘు. హరి చెప్పగా అసలు కథ విని, పెళ్ళయిం తరువాత మాలతితో ఎట్లా మాట్లాడాలో 'రిహార్సల్స్' వేసుకుంటూ!

ఇంకా ఏముందండి. కథ అయిపోతేనూ! ★

# మనమూ-మనదేహస్థితి

17 వ పేజీ తరువాయి

ణామాలను తీసుకు వస్తుంది.

ఆందోళన, దీర్ఘమయిన భయాన్నీ, తనమీదనో, ఇతరులమీదనో దీర్ఘమయిన కోపాన్నీ కలిగిస్తుంది. అది శరీరంలో అనిచ్ఛాధీన కండరాల్లో సంకోచాన్నీ కలిగిస్తుంది. ఆ సంకోచం మ్యూకస్ మెంబ్రేనులో ఆహార రాహిత్యాన్నీ, గాయాన్నీ ఏర్పరుస్తుంది. ఆ గాయం, నిత్యమూ జరిగే తరంగచలనంతోనో, ఏ మానసిక కారణాలవల్ల ఈ పరిస్థితి ఏర్పడిందో ఆ కారణంచేతనే జీర్ణ రసముల అధిక స్పందనం, అల్ప స్పందనం, అకాల స్పందనం, ఏర్పడి పెద్దదవుతుంది. దీనికితోడు, అకాల భోజనమూ, కాఫీగా నమిలి మింగకపోవడమూ, ఆదరా బాదరాగా ఆహారం మింగడమూ, వేడిగావుండే పానీయాలు తీసుకోంగానే చల్లని పానీయాలు తీసుకోడము, చల్లని పదార్థాలు తినడంతోనే వేడి పదార్థాలు తీసుకోడం ఈ గాయాన్ని పెద్దవి చేస్తవి. వేడి, వస్తువులను విస్తరిస్తుందనీ, శీతలం, వస్తువులను చిన్నవి చేస్తుందని ప్రకృతి శాస్త్రం చదువుకున్న అందరికీ తెలుసు. విజ్ఞానం తెలిసినంతమాత్రాన దానిని నిత్య జీవితంలో ఉపయోగించడం జరగదు. ప్రతి టీపార్టీలోనూ, ఐస్‌క్రీం ఇస్తారు. ఆ తర్వాత వేడికాఫీ ఇస్తారు. ఇది చాలా హానికరమైన పద్ధతి. కాని, సాంప్రదాయం, విజ్ఞానంకంటె బలమైనది. ఈ అలవాటు పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతి అయింది. తెల్లవారినుంచి సంక్రమించినవన్నీ దేవతా లక్షణాలు! సిరి అంటకపోయినా జీడి అంటుతోందని. వారి మంచి లక్షణాలు మనకంటవు. వారి శీతోష్ణస్థితికి విరుద్ధమైన మన శీతోష్ణస్థితిలో, విచక్షణ లేకుండా వారి పద్ధతులను అవలంబించే భావదాశ్యం మాత్రమే మనకు సంక్రమించింది.

ఆదరా బాదరాఆహారం తీసుకున్నప్పుడు అన్నంతో గాలి మింగడం జరుగుతుంది.

ఆనాటి కానాడు తినే ఆహారం లోపభూయిష్ఠమూ, తేలికగా జీర్ణం కానిదీ అవుతున్నది. ఉద్రేకములవల్లా, రక్త దోషాదులవల్లా జీర్ణరసము ఉత్పత్తి సరిగా జరగదు. ఈ పరిస్థితులలో జీర్ణక్రమం పూర్తికాదు. ఇందువల్ల ఆహారం అజీర్ణ స్థితిలోనో అర్ధ జీర్ణ స్థితిలోనో ప్రేగుల్లోకి వెళ్తుంది. అక్కడ దుర్వాయువులు చేరి గాయములు ఏర్పడి, ఉన్న ప్రేగుల్ని మరి సాగదీస్తవి. అర్ధజీర్ణ పదార్థముల నుండి, ముఖ్యంగా అర్ధ జీర్ణములయిన మాంసకృత్తుల నుండి తయారైన విషపదార్థములు పెద్ద ప్రేగులో ఇన్‌ఫ్లమేషనునూ అందులో అల్సర్లనూ ఏర్పరుస్తుంది. ఆ క్రిమి దోషం ఎపెండిక్సుకు పాకి ఎప్పెండిసైటిస్ ఏర్పడుతుంది.

స్థానికంగా ఏర్పడిన దుస్సంకోచం మ్యూకస్ పొరను నలిపి, అల్సరు ఏర్పడడానికి కారణ మవుతుంది. ఇల్లా ఒక పరిస్థితికి మరొక పరిస్థితి దోహదంచేసి, జీర్ణకోశంలో, ముఖ్యంగా జఠరాశయంలోనూ డుయోడినంలోనూ అల్సర్లు ఏర్పడుతవి.

ఈ ప్రదేశాలకు సింపతెటిక్ నరములు, సీలియాక్ గేంగ్లియాన్ అనే నరాశయ భాగము నుంచి పోతవి. యుద్ధభీతితో యీ గ్లేంగియాన్ అతి ప్రేరేపణ పొంది ఎవరికీ అర్థంకాని ఉదరశూల అమెరికాలో చాలామందికి వచ్చింది.

అవివేకమూ, ఆవేశమూ, ఆహార లోపములూ, ఆహార సంబంధములయిన దురభ్యాసములూ జీర్ణాశయంలో అల్సర్లు ఏర్పడడానికి ప్రధాన కారణాలు.

(సశేషము)

# పన్నీరు - కన్నీరు

11—పేజీ తరువాయి

సమయినా, ఇంక చాలించి ఏదో ఉద్యోగంలో చేరి కుటుంబపోషణ భారం వహిద్దామనుకున్నాడు ర్యం. సుబ్బారావుకూడా తటస్థంగా ఊరుకున్నాడు. పైకి చదవమనీ, వద్దనీ అనకుండా. అంతవరకూ కొడుకు ఎలాగైనా చదివి పైకి రావాలనిఉన్న ట్టుదల ఈ రెండుమూడేళ్ల నరకంతోనూ కొంత సడలింది. ఓర్చుకోలేని తనభుజాలికి కాస్త సర్దునే అవకాశం దొరికితే అంతే చాలనుకున్నాడు. కాని ంతవరకూ ఏమంత కలగజేసుకోకుండా ఉన్న తల్లి మణమ్మ పట్టుబట్టింది. "ఇన్నాళ్లుపడ్డాం. లాగే ఇంకోరెండేళ్లు పడతాము. అంతేగాని ప్పుడు నువ్వుతెచ్చే కొద్దిరాళ్లకోసం కక్కుర్తిపడ్డామంటే జీవితమంతా మేము, మాతోబాటు నువ్వూ తరవాతవాళ్లూ నీ పిల్లలూకూడా పడాల్సిందే ూ బాధలు. అయినా నీ చదువుకే అని మాకేం అవం లేదు గదా. స్కాలర్‌షిప్ మీద సాగినంతవరకేనా దువుకోవల్సిందే." అంది. నరసింహంగారు చెప్పాల్యకుండా అప్లికేషన్‌ఫారం డబ్బుకట్టిన చెలానూ ట్టుకుదిగారు. ఆయన ఎవరేం చెప్పినా వినలేదు. విధంగా సూర్యం మళ్లీ కాలేజీకీ హాస్టలుకీ వచ్చాడు నకిష్టమైన 'ఫిజిక్స్' తీసుకున్నాడు.

రెండేళ్ల కాలేజీచదువు కొంచెం మనిషిని ార్చింది. డిగ్రీకోర్సు కొచ్చేనాటికి కాలేజీకి పాతవయ్యాడు. ఒకళ్ల నిరసనలూ ఇకిలింతలూ ట్టించుకునేరోజులు వెళ్లిపోయాయి. అయినా రేనా ఏమయినా అంటానికేనా అతను డిగ్రీ స్టూడెంటు, తెలివిగలవాడూ. లెక్చరర్సు అందరికి ష్టుడు. ఇప్పుడు కాలేజీలో అతను వెడుతుంటే ందర్రావు ప్రైజు ఒచ్చినది ఇతనా అని చెప్పుకునేరు ఆడవాళ్ళుసైతం. కాలేజీల్లో జీనియస్‌గా చెలామణీ అయేవాళ్లు, కింద చిరిగి పీలికలొచ్చి ుమ్మకొట్టుకుపోయిన పంట్లాములూ, బొత్తాలులేని చొక్కాలూ, ఎప్పుడూరేగి తెగపెరిగి బ్బులాఉండే జుట్టూ ఇవన్నీ ఉన్నా ఒకవిధమైన తిపత్తిని నిలుపుకుంటారు. కొంతమంది మంచి ట్టలుండి శుభ్రంగా ఉండగలిగీ కూడా ఇలాంటి ప్రతిభ అవతారం ధరిస్తారు. నలుగుర్నీ ఆకర్షించేందుకు. అన్ని లక్షణాలు లేకుండా ఉన్నంతలో కాస్త శుభ్రంగాఉండ ప్రయత్నించే సూర్యం కూడా ప్రతిభాశాలుల కోవలోకి వెళ్ళిపోయాడు.

ఫిజిక్స్ అతని ఆకర్షించింది. ఏదో తెలుసుకోవాలిసింది చాలా ఉంది. అనేకులు అనేకదారులు చూపారు. కొన్ని హద్దుల్లో ఈ శాస్త్రం దారి అతనికి నచ్చింది. ఇందులో భగవద్విలాసాలూ, నమ్మకాలూ, దెయ్యాలూలేవు. చూడదలుచుకున్నదేదో సూటిగాచూస్తూ, నేర్చుకుంటూపోడమే. ఇది అనాదినించి మానవుడు తన జ్ఞానేంద్రియాలద్వారా సేకరించిన సమాచారానికి తన కార్య కారణ సంబంధమైన ఆలోచనాశక్తిద్వారా కూర్చిన కనుగొన్న సూత్ర సమన్వయం. ఇది సృష్టి రహస్యం బేధించి మనకి అరటిపండొలిచినట్టు చెప్పలేకపోవచ్చు. దీని ఆవరణలోకి రాని విషయాలూ, విశేషాలూ, అనుభవాలూ, అనుభూతులూ చాలా ఉనాయి. ఇది అంతాకాదు. కాని, ఉన్నంతలో ఇది విజ్ఞానదాయకమైన శాస్త్రము. వేదాంత చర్చల్లో సైన్సు ప్రభావాన్ని గమనికకు తెచ్చే కొన్ని పుస్తకాలు చదివాడు. రస్సెల్, ఎడింగ్‌టన్ మొదలైన వాళ్లవి.

తన అభిప్రాయాల్ని సూచనగా ఒకమాటు జనార్దనంతో అన్నాడు. జనార్దనం ఒప్పుకోలేదు. "బోడి సైన్సు ఏదో విమానాలనీ, ఏటంబాంబుల్నీ, రేడియోల్నీ కనుక్కుందని పెద్ద పొగిడేస్తున్నావు. మన పూర్వుల విజ్ఞానం ఇంత కెన్నిరెట్లో ఉండేది తెలుసా. రామాయణంనాటికే పుష్పకవిమానం ఉండేది. అప్పుడు దివ్యదృష్టి, దూరగమనంలాంటి శక్తులుండేవి."

"అదికాదు జనార్దనం. అవి పురాణాలు. కవి భావనాశక్తితో అనేకమైన ఊహలు పోతాడు. అవి యధార్థం చేసింది శాస్త్రం మాత్రమే. అయినా శాస్త్రం మనకి ఈ వస్తువులు ఇచ్చిందని పొగడటంలేదు నేను. ప్రకృతి రహస్యాలని కొంతలో కొంత మనం అర్థం చేసుకోగలుగుతున్నది శాస్త్రం అభివృద్ధి చెందడంవల్లనే గదా.

"ఆ ఆదేముంది. ఎప్పుడో ఉపనిషత్తుల్లోనూ, వేదాంగాల్లోనూ ఈ ప్రకృతి రహస్యాలనీ ఇదివరకే క్షుణ్ణంగా చర్చించేశారు తెలుసా. అయినా సైన్సులో కూడా నిన్న ఒప్పుకున్నది ఇవాళ ఒప్పుకోటంలేదు. పదార్థంయొక్క నిజ స్వరూపం ఏమిటో ఇప్పటికి తెలియదుకదా. ఒకమాటు పదార్థం, శక్తి వేరు వేరు. ఒకమాటు మళ్ళీ కలుస్తాయి. ఒకమాటు అణువులో అణువు, ఒకమాటు పదార్థానికి కూడా తరంగ స్వరూపం తప్పించి, ఇంకేమీలేవు. నాయనా, నేటికాలపు గొప్ప గొప్ప సైంటిస్టులు కూడా పందొమ్మిదవ శతాబ్దపు 'మెటీరియలిజమ్' ఒదిలేశారు."

"ఒప్పుకుంటాను. అయితే ఒకటీ, ప్రకృతి పరస్పర సంబంధాలుకల పరిణామాల కట్టడం. వేదాంతి, కవీ, సైంటిస్టూ తమ స్వంత సంజ్ఞాపూర్వక భాషలో దాన్ని గురించిన భావాల్ని చెబుతారు. ఇందులో ఎవర్నీ చులకనచేసి, మాట్లాడవలసిన అగత్యంలేదు. సృష్టి రహస్యపు టంతర్కోణాల్లో ఒక్కొక్కళ్లకి ఒక్కొక్కటి అనుభవంలో చేరవవుతుంది."

"ఒక్క సైంటిఫిక్ థిసిస్ కాని, ఒక్కసూత్రంకాని, ఒక మహా కావ్యం చదివినలాంటి మహత్తర అనుభూతి నిస్తుందా చెప్పు."

"సైన్సులో కూడా, కవిత్వం, ప్రచారంలలో లాగా కొన్ని కదలే కదలించే గుణాలున్నాయి. సైన్సు సంబంధమైన కొన్ని రచనలు, రసస్ఫూర్తి కలిగించే ఆశయంతో రచింపబడకపోయినా, వాటి శైలి వల్లకాక, అందులోఉన్న విషయంవల్ల అట్టి ఫలితాన్నిస్తాయి. ఇప్పుడు నే వన్నమాట రస్సెల్

# పన్నీరు-కన్నీరు

పుస్తకం 'ఎ. బి. సి. ఆఫ్ రిలేటివిటీ' చదివితే కొంత బోధపడుతుంది. సైన్సుయొక్క భావ భవనాలకి ఏవి మూలాలో ఆ సిద్ధాంతాలూ, కర్కశమైన తర్కాలూ సహజస్ఫూర్తియొక్క కాంతి పడకుండా సిద్ధించేవికావు. ఈ సహజస్ఫూర్తి సాహిత్యానికీ విస్తిసిజానికీ మాత్రమే లక్షణంగాదు."

"ఇంకా నయం. ఇకముందు సాహిత్యసృష్టి సైంటిస్టులవల్లే జరగాలన్నావుకాదు."

"అందులో కూడా కొంత నిజముంది. నేటి ప్రపంచపు మహా కావ్యాలు అతీతమైన సైన్సు ప్రగతిని అర్థం చేసుకున్న కవిచే తనే వ్రాయబడుతాయి. సైన్సుమీద అతనికున్న పట్టు అతని భాషని మలుస్తుంది. అతని భాష అతని సైన్సుని నడపదు."

## 18
## డిగ్రీ

"ఒరేయ్ సూర్యం ఎందుకురా అలా దిగులుగా ఉన్నావు? అవతల కాలేజిడే హడావిడి, రిహార్సల్సు, ఎరేంజిమెంట్లతో కొప్పగిరిపోతుంటేనూ."

"చూడు జనార్దనం. మనం నాలుగేళ్ళు కాలేజీలో చదివాం. ఓపికున్నంత రాస్తాం. డిగ్రీ ఫస్ట్ క్లాసో, సెకండ్‌క్లాసో ఏదో ఒకటి వస్తుంది. ఏమిటి తరువాయి కథ. మనకేదేనా బ్రతుకు తెరువు దొరుకుతుందంటావా"

"దాందేముంది. ఎలాగోలాగా ఎమ్. ఎస్‌సి. లో సీటు సంపాయించేస్తే మళ్లీ వాల్తేరులో ఇంకో రెండేళ్లు గడిపెయ్యొచ్చు. అప్పుడు సంగతి చూసుకోవచ్చు."

"ఇక్కడికీ ముద్దదిగనీ, ఎం. ఎస్‌సి. చదివినంత ఫలం. ఇంకా ఎన్నాళ్లని అమ్మా నాన్నా, తమ్ముడు చెల్లాయినీ మాడబెట్టి నేను చదువుకోను. రాఘవుడు మళ్లీ ఏడాది స్కూల్ ఫైనల్. ఇంక కాలేజీ కొచ్చేస్తాడు. వాడి చదువుకేనా నేనందుకోకపోతే ఎలా."

"ఆ మాట నిజమేకాని, నువ్వేదో డిగ్రీ డిగ్రీ అంటున్నావు. కాని, ఈ రోజుల్లో ఏదో ఓ డిగ్రీలేగీ వాజమ్మేవడు. అందుకని ఏదో ఇంకాస్త పై డిగ్రీలు తెచ్చుకుంటేగానీ, కాస్త మంచి ఉద్యోగం దొరికేటట్టులేదు. అందుకని అన్నాను."

"అయితే నేను ఎలాగా ఎం. ఎస్ సి. చదవలేను. ఏదో ఇంతవరకేనా స్కాలర్‌షిప్‌ల మూలాని లాగ్గలిగాను. అక్కడ మన కెవరు కూడెడతారు. అంచేత నా పని హుళక్కేనంటావు."

"లేదులే. దిగులుపడకు. నీలాంటివాడికి లక్ష అవకాశాలుంటాయి. బోల్డు పరీక్షలూ వగైరాలు. నే ననేది నాలాంటి మామూలు గాంధి తరగతి డిగ్రీ హోల్డరు మాటలే. ఇంకో టేమిటంటే ఏదో సైన్సు సైన్సు అని అఘోరిస్తున్నావు. కాబట్టి ఆ ఎం. ఎస్‌సి. తగులడితే శాస్త్రియోద్యోగం ఏదేనా దొరుకుతుందనీను. బి. ఎస్. సీ. ల కెవరూ అలాంటి ఉద్యోగాలివ్వరుగా!"

"పోన్లే అసలంటూ ఏదో ఒకటి దొరికితే అంతే చాలు"

రెండేళ్ల డిగ్రీ చదువు అతి కష్టంమీదే లాగించాడు. కాలేజి ఫీజు, వాళ్ళు కట్టేసినా, మిగిలిన

అసేక విషయాలకి డబ్బు అవసరమయ్యేది. తండ్రి వడిగితే వాళ్లని బాధ పెట్టడం తప్పించి లాభ ముండదు. నరసింహంగారు సాధ్యమైనంతచూసి వెళ్లేవారు. కాని, ప్రత్యేకం కావాలని అడగడం సూర్యానికి అభిమానంగా ఉండేది. అందుకని ఉన్న చదువే తనకి చాలా ఉన్నా, రెండు మూడు ప్రైవేట్లు తీసుకున్నాడు. హైస్కూలు స్టూడెంట్లకి ఒకటి, తను కాలేజీలోనే ఇంటర్ చదివే ఒకబ్బాయికీ. ఆ విధంగా సంపాయించిన డబ్బు కొంతవరకూ తన అవసరాలు గడుపుకొని, అప్పుడప్పుడు కొంత తండ్రికి పంపేవాడు. రోజు రోజుకీ పెరిగిపోతున్న ధరలు. సుబ్బారావు జీతం గొర్రెతోకలాటిది. ఏడాదికి రెండు రూపాయల ఇంక్రిమెంటుమాత్రం. అందు కని ఇంటివద్ద వాళ్లు నానా అవస్థలూ పడ్డారు. తమ్ముడికి స్కూల్లో ఏదో మెరిట్ స్కాలర్‌షిప్ ఉన్నా పుస్తకాలకి ఎప్పుడూ స్నేహితులిళ్లకిపోయి చదువుకోవలిసొచ్చేది. చదివించాలని పెద్దలికీ, చదువు కోవాలని ఆమెకీ ఉన్నా తాహతు చాలక వాళ్ల చెల్లెలు చదువుమానిపించేశారు. సూర్యం ఇంటికెళ్ళినప్పుడు ఇంకెన్నాళ్లో. నా చదువైపోనీయండి మనం సుఖంగా. ఉందాం అనేవాడు.

పరీక్షలముందు పై పుస్తకాలన్నీ పక్కకి పెట్టేసి ఏకాగ్రతతో మంచి రిజల్ట్సు తెచ్చుకుని ఉన్నతి పొందాలనే దీక్షతో చదివాడు. మెదడులోకి చదివిన పాఠాలు ఇంకే విషయాలూ చొరనియ్య నంతగా పట్టేశాయి. ఆ కొద్ది రోజులూ కుటుంబ పరిస్థితులూ, దారిద్ర్య బాధలూ అన్నీ మరిచి పోయాడు. అర్జునుడికి చెట్టు చిటారు కొమ్మ మన్న పక్షి తప్పించి, చుట్టూ ఇంకేమీ కనపడనట్టు సూర్యానికి పరీక్షలు పాఠాలు తప్పించి మిగిలిన ప్రపంచం లేనట్టే. లక్ష్యసిద్ధి కావాలంటే కొంత వరకూ అటువంటి లక్ష్యశుద్ధి కూడా ఉండాలి.

చిట్టచివరి పరీక్షలయి, కాలేజినించి బయట కొస్తుంటే సూర్యానికి ఇంతవరకూ మోస్తున్న బరువంతా దింపేసి ఏదో తేలికైపోయినట్లయింది. గట్టిగా గొంతెత్తి అరుద్దామనిపించింది. గెంతుతూ పరిగెడదామనిపించింది. కనబడిన ఫ్రెండుని వీపు మీద గట్టిగా చరుద్దామనిపించింది. కాస్త మరీ రోడ్డు కాకుండా చూసుకుని, ఆ పనులు చేసేశాడు కూడాను. ఇది తను చాలా బాగా రాశానన్న సంతోషం కాదు. ఒక బరువైన బాధ్యత ఒదిలిపోయిందని హుషారు. ఆరోగ్యంగాఉన్న లేగదూడ చెంగు చెంగున పరుగు లెడుతుంది.

తను చాలా బాగా రాసినప్పటికీ, స్వతహాగా కొంచెం తగ్గించి అంచనా వేసుకోటం అలవాటు. అలాగయినా ఫస్టుక్లాసు తప్పకుండా వస్తుందనుకున్నాడు. తన కొక విలువైన డిగ్రీ వస్తుంది. చిన్నో, పెద్దో ఉద్యోగం దొరుక్కపోదు. తను పది మందిలో నిలబడి నేనూ ఉన్నాననిపించుకోగలడు. సిరిపాలెంవెళ్లి తను ముఖం చూపడానికి అభిమానపడక్కర్లేదు. తనకి లేని ఆస్తులు వాళ్లకుంటే, వాళ్లకిలేని డిగ్రీ తన కుంది. తను బ్రతకడానికీ, తనవాళ్లకి కొంచెం మంచి రోజు లొచ్చాయనిపించడానికీ ఈ డిగ్రీ ఆధార మవుతుంది. తమ్ముణ్ణి తనకంటె బాగా చదివించాలి. చెల్లెలికి పెళ్లి చెయ్యాలి. తల్లి దండ్రుల్ని సుఖపెట్టాలి.

మరి కమల. ఏమీలేని తనకి నరసింహంగారు కమల నిస్తారా. తండ్రి వైదీకులతో సంబంధాని కొప్పుకుంటాడా. మనసు ఊరికే ఉరకలు వేస్తోంది.

# 19
## ఉద్యోగం

ఇంటికి చేరుతూనే ఉద్యోగంకోసం ప్రయత్నా లారంభించాడు. రోజూ పేపరు తెచ్చి 'వాంటెడ్ కాలమ్‌లు' అన్నీ తిరగేసి ఎక్కడ గ్రాడ్యుయేట్ కావాలన్నా వాట్లకి అప్లికేషన్లు పెట్టాడు. కొన్నిటికి రిప్లై రాలేదు. కొన్నిటికి సెక్యూరిటీలు వగైరా కావాలంటూ ఉత్తరా లొచ్చాయి. కొన్నిటికి ఎక్కడికోరమ్మనిఇంటర్‌వ్యూలకి పిలిస్తే డబ్బుసర్దుబాటవక వెళ్లలేదు. ఇలా సెలవులు గడుస్తున్నాయి. ఇంతలో రిజల్ట్సు వచ్చాయి. యూనివర్శిటీకంతకీ ఫస్టు రాంక్‌లో పాస్యయ్యాడు. వాళ్ల చీఫ్ లెక్చరర్ అభినందనలు తెల్పుతూ తంతి ఇచ్చి పిలయితే ఎం. ఎస్‌సి. కూడా చదవమని సలహా యిస్తూ ఉత్తరం రాశారు. అతను ఆ ప్రమేయం ఎదురు కున్నానని కృతజ్ఞత తెలుపుతూ రాశాడు.

సూర్యానికి చివరకి ఆ ఊరి ఇన్‌కంటాక్సు ఆఫీసులో టెంపరరీ గుమాస్తా ఉద్యోగం దొరికింది. తను అప్లై చేసిన పెద్ద ఉద్యోగా లేవీ కాలేదు. మనవాడనే వాడెవడేనా పైనుండి లాగితేనే అలాంటి ఉద్యోగాలయ్యేది. తెలివిగల కుర్రాళ్లు కావాలనే ప్రైవేటు కంపెనీల్లో ఇతను ఇంటర్‌వ్యూకి రాగానే దరిద్రం ఓడుతూ కనిపించే ఇతని దుస్తుల్నీ, వాలకాన్నీ, చూడగానే ఆ లక్షాధి కారి డైరక్టర్లకి విసుగు పుట్టేది. కాలేజీలో లెక్చరరు ఒకాయన సూర్యం అంటే అభిమానంగా ఉండేవారు. సూర్యాన్ని సర్వీస్ కమిషన్ పరీక్షలకు కూర్చోమన్నాడు. అవంటే ఏమిటన్నాడు. ఐ. ఎ. ఎస్. మొదలైన పరీక్షలలో నెగ్గితే కలెక్టర్లు, పోలీసు సూపరెంట్లు అవుతారని చెప్పాడు. అమ్మ బాబోయ్! అంత పెద్ద ఉద్యోగాలు మన కెవరిస్తా రన్నాడు. అయినా ఇంటర్‌వ్యూల్లో అక్కడా నా వాలకం, నా మాట్లాడ్డం చూసి,. ఎవరు సెలక్టు చేస్తారన్నాడు. అదేంలేదు. ఏదేనా ఉద్యోగంలో చేరితే, కొంచెం సంపా యిస్తూంటే ధీమా, శీవి, వస్తాయి. అప్పుడే వెళ్లచ్చు పరీక్షకి అన్నా డాయన.

ఇన్‌కంటాక్సు ఆఫీసులో గుమాస్తా ఉద్యోగంలో 125 రూపాయిల జీతంమీద ప్రవేశించాడు. అదే అతనికి పెన్నిధిలా తోచింది. తండ్రిని ఇక ఉద్యోగం మానెయ్యమన్నాడు. సుబ్బారావు అన్నాడు: "నేను ఉద్యోగంలో ఉన్నన్నాళ్లు నన్ను చుట్టుకుని కొన్ని బాధలుంటాయి. నేను ఎప్పుడైతే మానేసి, నీకు పూర్తిగా బాధ్యత అప్పగించానో అప్పుడు అవన్నీ నీకు తేనెటీగల్లా ముట్టుకుంటాయి. ఏది అయినా ఇంకా తమ్ముడి చదువు, చెల్లాయి బాధ్యత ఉన్నాయి కదా. ఏదో ఓపికున్నన్నాళ్లూ తంటాలు పడనీ."

తమ్ముణ్ణి కాలేజీ చదువులకి జేర్చాడు; ఎందు కేనా మంచిదని స్కాలర్‌షిప్‌మీదే; ఆ హాస్టల్లోనే. తండ్రీ, తనూ తెస్తూండడంవల్ల సంసారం కాస్త కుదుటపడింది. కాని, ఇంక ఇంతేనా జీవితానికి? ఇంకే దేనా దారి ఉందా అని ఆలోచించేవాడు.

ఇంతలో నరసింహంగారమ్మాయి పెళ్లివయసు కొచ్చి, వాళ్లు పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారని తెలిసింది. తను ఏ సంగతీ తేల్చుకోవాలి. తండ్రి నడగ డానికి భయంటి. నరసింహంగార్నే అడిగి చూశాడు. ఆయన ఇది తప్పా—ఒప్పా అని ఆలోచించారు. సాంప్రదాయం ప్రకారం ఇది విరుద్ధం. కాని, శాస్త్రంలో ఎక్కడా నియ్యోగి వైదీకి తేడాలేదే? నిర్ణయాని కేమిటి ప్రమాణం. పిల్ల లిద్దరికి ఇది ఇష్టమని తెలుస్తోంది. ఎప్పుడో వందల, ఏళ్ల క్రిందటి అప్పటి పరిస్థితులకోసం ఏర్పరుచుకున్న సాంప్రదాయంకోసం ఇప్పుడు వీళ్లని దుఃఖపెట్టడం భావ్య మౌతుందా. కొంతసేపు ధ్యానించి నరసింహంగారు కర్తవ్య నిర్ణయం చేసేశారు.

కాని సుబ్బారావు అలాంటి విశాల హృదయం చూపలేకపోయాడు. కొడుకు నరసింహంగారి కూతుర్ని చేసుకుందామనుకుంటున్నాడని భార్య ద్వారా విని అపర రుద్రుడయ్యాడు. వైదీకుల్తో సంబంధం తన బొందిలో ప్రాణముండగా ఒప్పుకోనన్నాడు. "నా జీవితమిలాగా కడగళ్లపాలయింది. వీడేనా కాస్త వెనకాసరా ఉన్న వాళ్లమ్మాయిని చేసుకుని బాగుపడతాడనుకుంటే ఇదేం విపరీతము: ఏదో నాలుగు కట్నం డబ్బులొస్తే, అమ్మాయి పెళ్ళికేనా ఉంటాయి. ఇప్పట్నించి తన పెళ్లాన్ని తనే చూసుకునే దగుల్బాజీ అయితే ఇక మనల్ని సుఖపెట్టే దేవిటి?"

సూర్యం తండ్రిమాట కెప్పుడూ ఎదురు చెప్ప లేదు. ఎప్పుడూ కొంచెం ఒదుగ్గానే ఉండేవాడు. అందుకని ఇప్పుడూ అలాగే ఉండిపోయాడు. పైగా



"గునపం ఓటుంటే యిస్తారూ! కారు బైటికి రాడం లేదు!"

తల్లి కూడా చెప్పింది "చెల్లెలి పెళ్లిజరగాలిగదా. నువ్వు మంచి కట్నంతో ఉన్నవాళ్లమ్మాయిని చేసుకోకపోతే ఎలా?"

"మనం ఇంత బాధపడుతున్నాంగదా కట్నం ఇవ్వటానికి, ఇంకోళ్లు మనకి ఇవ్వాలనుకోవడమేం ధర్మమమ్మా"

"కాదురా. ఇప్పుడు నువ్వు తీసుకోకపోతే ఈ

## పన్నీరు - కన్నీరు

కట్నం సమస్య దేశంలో తీరుతుందా. పోనీ నువ్వు లాంటి సంఘ సంస్కర్తవని నీ చెల్లెలిని కట్నం లేకుండా చేసుకోడానికి ఎవరేనా ముందుకి వస్తారా? ఎటొచ్చీ నువ్వు కట్నం తీసుకోకపోతే రెండు విధాల చెడేదీ మనమే. ఆలోచించు. నీ చెల్లెలి సౌఖ్యంకోసం ఆమాత్రం నీ ఆశయాన్ని త్యాగం చెయ్యడం అవసరమో కాదో.

అంతటితో ఆ ఆశ వదులుకున్నాడు. నరసింహం గారు నొచ్చుకోకుండా మెల్లిగా తెలియజేశాడు. వాళ్ళ తరవాత ఏవో ప్రయత్నాలుచేసి ఒక వైదీకుల అబ్బాయికే, చదువుకున్న తని కిచ్చి కమల పెళ్ళి చేసేశారు.

# 20

## అన్వేషణ

గుమాస్తాగాఉంటూ, పెద్ద ఉద్యోగాలకి అప్లై చేస్తే ఇవ్వరన్నాడు నారాయణరావు. ఒకసారి అంత తక్కువ తాహతుగల ఉద్యోగానికి తల ఒగ్గిన వాడికి మొదటి తరగతి ఉద్యోగంచేసే అర్హత ఉండదని సాధారణంగా గవర్నమెంటువారి అభిప్రాయం అన్నాడు. నారాయణరావు చేసేది చిన్న ఉద్యోగమైనా, చేసేది కాలేజిలో కనక అతనికి కొంచెం గొప్పగా ఉండేది. ఇద్దరూ డిప్యూటీ కలెక్టర్ ఉద్యోగానికి, పరీక్షలకి అప్లై చేశారు. ఆ రోజుల్లో వీరికి డైరెక్ట్ రిక్రూట్‌మెంటు కూడా ఉండేది, మన రాష్ట్రంలో.

ఇద్దరూ కలిసి చదివే వారు. రోజల్లా ఆఫీసులో పనిచేసి కొంచెం చదవడం, ఇబ్బందిగానే ఉండేది. కాని, సూర్యానికి తను కమల విషయంలో పొందిన నిరాశనించి తట్టుకోవాలంటే ఏదో ఎందులోనో నిమగ్నమయ్యే ఇంటరెస్ట్ కావాలనీ, వీలైతే ఈ వాతావరణాన్నించి తప్పుకోవాలనీ అనిపించేది. అందుకని తీవ్రంగా చదివేవాడు. ఇద్దరూ పరీక్షలు రాశారు. సూర్యానికి ఇంటర్‌వ్యూ కాల్ వచ్చింది. నారాయణ సూర్యంతో మాట్లాడ్డం మానేశాడు.

చాలామంది ఫ్రెండ్సు వచ్చి కంగ్రాచ్యులేట్‌చేసి, ఇంటర్‌వ్యూలో ఇలా చెయ్యాలి, అలా చెయ్యాలి అని సలహా లిచ్చారు. ఎలాంటి ప్రశ్నడిగినా తక్కువ జవాబు చెప్పాలన్నా డొకడు.

"నువ్వు దేనిమీద వచ్చావు అని అడుగుతారనుకో. టాక్సీమీద అంటే, నంబరు ఎంత అంటారు. రైలుమీద అన్నావనుకో, రైలుకి పెట్టెలెన్ని అంటారు. తప్పో రైటో తడుముకోకుండా సమాధానం చెప్పాలి."

"ఒక మాటు ఐ. సి. ఎస్. ఇంటర్వ్యూ మేడమీద జరుగుతోందిట. ఒక కాండిడేటుని నువ్వెక్కి వచ్చిన మెట్లెన్ని అన్నార్ట. లెక్కపెట్టలేదు అన్నాడట. రెండోవాణ్ణి అదే ప్రశ్న అడిగితే మహా లెక్కపెట్టినట్లు 29 అన్నాట్ట. వాణ్ణి సెలక్టు చేశారట."

"లేదురా అబ్బాయి. మూడవ వాడు కూడా ఉన్నా డింద్దులో. వాడు "లిఫ్ట్ ఉన్నచోట మెట్లెక్కడం నా కలవాటులేదు. జీవితంలో కూడా అంతే" అన్నాట్ట. వీడురా మనకి తగినవాడని వాణ్ణి తీసుకున్నార్ట."

వీళ్లెవళ్లకీ కూడా ఇంటర్‌వ్యూ ఎలా ఉంటుందో తెలియదు!

ఆవేళ జనార్దనం వచ్చాడు సెలవలకి ఇంటికి. చివరి సంవత్సరంలో ఉన్నాడు. కుశల ప్రశ్నలూ, కంగ్రాచ్యులేషన్లూ, అయ్యాక మెల్లిగా లోకాభిరామాయణంలోకి దిగారు. ఇంకా వేదాంత చర్చలు చేస్తూనే ఉన్నావా అన్నాడు జనార్దనం. "జీవితం మీద ఉండే దృక్పథమే వేదాంతం. ఇంక చర్చంటూ

ఏమిటి, ఏం మాట్లాడినా వేదాంతం వస్తూనే ఉంటుంది"

"అసలు వేదాంతంయొక్క లక్ష్యమేమిట్రా?"

"తెలుసుకోడం."

"ఏమిటి తెలుసుకోడం?"

"అది తెలుస్తే సగం సమస్య తేలిపోయినట్టు కాదూ. ఏమిటి తెలుసుకోవాలో తెలుసుకోడం కూడా ఫిలాసఫీయొక్క లక్ష్యంలో భాగమే."

"సరే. అయితే ఈ తెలుసుకోడానికి సాధనా లేమిటి"

"ధ్యానం (Contemplation) అంటారే అది తప్పించి, దీనికి వేరే మార్గం కనపడదు. అంటే ఊక దంపుడు పుస్తకాలు చదవడం కాకుండా చెబుతున్నాను. కొంత సహజజ్ఞానం తోడ్పడాలి. చూడు. మామూలుగా ఆలోచించడం అంటే ఒక సీక్వెన్స్ ఉంటుంది. ఒక ఆధారం నించి ప్రారంభం చేసి ఒక కారణం, దాని ఫలితం ఈ రెంటి మిశ్రమంవలన మరో పరిణామం, ఇలా పోతుంది ఒక ప్రవాహం; మెట్లు మెట్లుగా ఆధారాలు నిర్మించు కుంటూనూ. ఇది చాలదు తెలుసుకోడానికి. లోపలి వెలుగు కావాలి దీనికి. తెలుసుకోవల్సిందాంట్లో ఒక లక్షోవంతైనా తెలుసుకునేందుకు."

"లోపలి వెలుగు అన్నావే అదేమిటి?"

"జ్ఞానసౌధం ఢిల్లీలో విగ్యానసౌధ (అలాగే పలుకుతారు అక్కడివాళ్లంతా) లాగా ఇటికమీద ఇటిక పేరుస్తూ పోతే తయారయ్యేదికాదు ఇది లెకోర్‌బుసియెర్ వాస్తుశాస్త్రం లాంటిది. దాని అనుభూతి కలుగుతేనే గాని అదేమిటో అర్థంకాదు."

"సరే గాని ఇదంతా ఏమిటి. ఏమిటా తెలుసు కునేది"

"మొదటికొచ్చావు. ఏమిటి తెలుసుకోవాలో తెలుస్తే మూడొంతులు ప్రయాణం అయిపోయి నట్టు కాదూ. అయితే ఒకటి: అనాదినుంచి వేదాంతులు, కవులూ సాధారణులూ కూడా ఈ ధ్యేయాన్ని ఇన్ని ముక్కల్లో ఇముడుద్దామని చూస్తూనే ఉన్నారు. నువ్వెవరవో తెలుసుకో అన్నారు కొందరు. విశ్వ—రహస్యం తెలుసుకోవాలన్నారు కొందరు. జరామృత్యువుల్ని చూసి, రాజ్య పరిత్యాగంచేసి, "ఇవే మిటి, వీటినుండి విముక్తి ఏమిటి" అని ధ్యానానికి వెళ్లాడు సిద్ధార్థుడు. చావు పుట్టుకల రహస్యమేమిటని ప్రశ్నించినవాళ్లు బోల్డుమంది. బంగారు చెయ్యడం తెలుసుకోడం వేదాంతుల చరమలక్ష్యంగా అను కున్న సమయాల్లేకపోలేదు. అణువు పొట్టకోసి, లోపల సరుకు బయటపెట్టడం కూడా ఈ 'అర్జ్' వల్లనేకదా. ఏ పరిస్థితుల్లో ఎంత డబ్బు చేసుకునే అవకాశముందో "తెలుసుకోడ"మే ధ్యేయంగాగల వేదాంతులు కూడా బోల్డుమంది."

"అయితే నువ్వు వేదాంతంయొక్క లక్ష్యం, యథాతథా జీవితధ్యేయం జ్ఞాన సముపార్జనం అంటావు."

"మళ్లీ పప్పులో కాలేశావు. జ్ఞానం ఏదో డబ్బు లాగా సంపాదించి కూడబెట్టి బ్యాంకులో వేసుకునే దనుకుంటున్నావు. నేను—అందుకనే కావాలని, నామ వాచక శబ్దం వదిలేసి మనక్కావలిసింది 'తెలుసు కోడం' అన్నాను. ఏం తెలుసుకుంటామో అది ఒక భౌతిక పదార్థం లాంటిదికాదు. దానికొక్కటితప్పేవు. ఎవరైతే తెలుసుకుంటాడో అతన్ని "జ్ఞాని" అంటే అసమంజసంకాదు. అయితే "జ్ఞానం" అనే ఒకరకమైన సొమ్ము చేకూర్చుకున్నా డను కుంటే పొరపాటే. ఇది మన ప్రాచీన సంస్కృతిలో వాడకంలో ఉన్న శబ్ద చిత్రాల గారడీవల్ల వచ్చిన చిక్కు."

"ఒక మాటబ్బాయి. ఇలాంటి తత్వ విచారణ చేసేవాళ్లు నూటికి తొంభై మంది తమని తాము మోసగించుకుంటూ, పరుల్ని కూడా మోసగిస్తున్నారని పిస్తుంది. ఇలాంటి ఆలోచనలు చాలావరకు మేకాని కల్‌గా ఉండటం, అంతమంటూ ఉండక పోవడం జరుగుతుంది. పైగా ఏపని చెయ్యడానికీ మంచి, చెడ్డ నిర్ణయం చేయ్యడానికి ఈ రకం తత్వం ఇష్టపడదు. అందుకని ఏ పనీ చెయ్యకుండా పడక కుర్చీవేదాంతిగా మిగిలిపోతారు ఇలాంటివాళ్లు. మరోటి, ఈ తత్వంవాళ్లు జీవితంలో సాధారణంగా చాలా అహంభావం కలవారుగా ఉంటారు. "నేను తెలుసుకోవాలి" అనే ధ్యేయం కూడా ఇందులోంచే పుడుతుంది. వాళ్లు ఇలాంటి వేదాంతాన్ని తమ స్వార్థ ప్రయోజనాలకి నిస్సంకోచంగా వాడుకుంటారు. "అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా. అందుకని ఈ పొడుపొట్టకు అన్నమే వేదాంతమురా" అనే రకంగా ఉంటుంది. మరోరకంవాళ్లకి ఈ వేదాంతం, యదార్థాలనించి, జీవితంనుంచి దూరంగా ఉంచుతుంది."

"నిజమే ఒప్పుకుంటాను. ఈరకం ధ్యానం మితి మీరితే, పూర్తి సాధారణ జీవితంతో లంకెలు తెగి, విశాఖ పట్టణం పిచ్చాసుపత్రికి చేరే అవకాశం లేకపోలేదు. బహుశా "నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు. మిగిలినది భగవంతునకు విడిచిపెట్టు" అనే గీతావాక్యాన్ననుసరించి, ఆ కర్తవ్యానికి కొంచెం మానవత్వం జోడించి పరులకోసం, తనకోసం పాటుబడేవాడిదే నిజమైన ఆదర్శ జీవితం కావచ్చు. కాని, నేను అలా చెయ్యలేను."

"బాబా! మరి తెలుసుకోవాలి తెలుసుకోవాలి అంటున్నావే. ఒక ధ్యానమొక్కటే చాలుతుందా దీనికి. నువ్వు సంపూర్ణంగా జీవించాలి. ఏది తెలుసు కోవాలో అది అనంతమైనది కావచ్చు. ఇది మహా ప్రవాహంలో కొట్టుకుపోతున్నవాడికి గడ్డిపరక దొరికినట్టు ఎప్పుడో ఎక్కడో సూక్ష్మ రూప సాక్షాత్కారం అవుతుంది. తప్పతాగి, రోడ్డుమీద నడుస్తూ, పేవ్‌మెంట్‌మీద నిద్దరోయే పసిపాపని తొక్కి, ఆ పాప కెవ్వుమన్న కేక విన్న క్షణం నిషా దిగిపోయి, గుండె బెదిరిన నాగరిక యువకుని మనో—సరోవరంలో ఎక్కడో ఒక అల లేస్తుంది. భార్యా బిడ్డల్ని విడిచి దూరంగా ఎక్కడోఉండి, నీరసించిపోయి, ఉదాసీనంగా ఉన్నప్పుడు బిస్మిల్లా ఖాన్ భైరవిరాగం వింటుంటే అంతరాళంలో కలుక్కుమంటుంది. నిషాదుని బాణం పక్షి జంటలో ఒకదాన్నికొట్టితే ఆ పక్షుల బాధ చూసిన ముని హృదయంలో ఒక మహా కావ్యం ఉదయిస్తుంది.

"ఏక్ బార్ ప్రభూ హాథ్ పకడ్‌లో
మనసాదీప్ జలాఉఁ మై, ప్రభూ"

అని సైగల్ కంఠంలోంచి ఎలుగెత్తే సూర దాసు "ఈ తెలుసుకోడం" కోసమేనేమో, ఈ బాధ అనిపిస్తుంది.

(సశేషం)

పడ్డాం, బాధపడ్డాం!.... ఆయన నీ అంత అందంగా ఉండకపోవచ్చు. అసలు ఆయనలో అందముందని నే ననను. కాని, ఆయన మనసు నీకన్నా, నాకన్నా, యింకా చాలామందికన్నా ఉత్కృష్టం!.... నిజానికి నాఅంత అదృష్టవంతురాలుండదేమో అనుకుంటాను, నువ్వు నవ్వుకున్నా సరే!...." జానకి ఏమిటేమిటో చెప్పుకు పోతోంది, అద్దంలో తన ప్రతిఫలాన్ని బావగా ఊహించుకొని.

"ఇవాళ నా యిరవైఆరో పుట్టినరోజు బావా! యివాళ ఆయనతో ఓ విషయం చెప్పాలని ఎన్నాళ్లనుంచో ఉవ్విళ్లూరుతున్నాను.... కాని ఏమని చెప్పను ? ఎలా చెప్పను?.... ఒకోసారి ఆయన ముం దెలా అనుకుంటానో తెలుసా! నేనేదో పసిపిల్లనయినట్టు, ఆయన నాన్నో, యింకెవరో పెద్దమనిషి అన్నట్టు అనిపించి ఏమేమో పసిపిల్లలాగే వాగుతాను.... ఆ తర్వాత అనిపిస్తుంది, ఆయన విసుక్కుంటారేమోనని!.... అంతా నా భయమే గాని ఆయన దేవుడు బావా! నేను బాధ పడ్తానంటే మొగంకూడా చిట్లించరు..... అవును, ఆయనకించుమించు నా వయసే ఉన్న కొడుకున్నాట్ట; నేను చూడలేదనుకో! అత నిక్కడుంటే నాలాగే మాట్లాడే వాడుగా! అతనంటే ఎంత ప్రేమ ఆయనకీ! ఒకోసారి, నిజం చెప్పాలంటే నాకు బాధకలుగుతుంది—యీర్ష్యఅన్నా తప్పు లేదేమో! ఆయనెప్పుడూ అతన్ని గురించే మాట్లాడతారు! ప్రతిక్షణం ఆయన కళ్లముందు అతను మెదుల్తూంటాడన్పిస్తుంది."

జానకి కొసదాకా అల్లిన జడని బలంగా వెనక్కి విసిరి, రెండు చేతుల్తోనూ తడిమి చూసుకుంది. ఆరోజు తలంటుకొందేమో, వెంట్రుకలు సమంగా అణగకుండా అల్లిబిల్లిగా తిరుగుబాటు చేస్తున్నాయి. యిప్పటికి పదిసార్లు విప్పడం, అల్లడం అయింది—తృప్తి కుదరలేదు. మళ్లీ విప్పడం మొదలెట్టింది.

ఆరోజు ఆయన కా విషయం చెప్పాలని ఎన్నాళ్లనుంచో ప్రయత్నం! తీరా, ఆరోజు వచ్చాక, ఎలా చెప్పాలో తోచడంలేదు. అదాలోచించుకోవాలనే ఆయన్ని కాలేజికి పంపించింది. తన పుట్టిన రోజు కాబట్టి, సెలవుపెట్టి ఎక్కడో ఊరిబయట కొండ మీద దేవుడి దగ్గరకి తీసుకెళ్తామన్నారు! కాని, తనే యిప్పుడు కాదని పంపించేసింది. ఎలా ? ఎలా చెప్పడం ?

ఆయనకి పిల్లలంటే యిష్టమున్నట్టు కన్పించదు. ఎప్పుడో మాటల సందర్భంలో అన్నారు, "మనకి పిల్లలొద్దు, జానీ! యిలా యెప్పటికీ యిద్దరమే ఉండిపోదాం. మనో ఒకడున్నాడు చాలదూ, జన్మజన్మాలకీ సరిపడగా!"

నిజంగానే ఆయన కిష్టంలేదా! అందుకేనేమో, రెండుమూడు నెలల్నుంచీ అంత చనువుగా ఉండడం లేదు. ఏమిటోఆలోచిస్తూకూర్చొనిపోతారు, గంటల తరబడి, పిల్చినా పలక్కుండా. అడగాలని నోటిదాకా వచ్చింది కాని, కాలేజీ విషయాలేమోనని సరిపెట్టుకూరుకుంది.

తను చెప్పకుండానే ఈ సంగతి గ్రహించారేమో! తెలుసుకోలేకపోవడానికంత అమాయకులు కారుగా! మనో కాకుండా వేరే తనకో పాప ఉండడం యిష్టంలేదా ఎందుకో!

# నల్లమబ్బులు

8-వ పేజీతరువాయి

జానకి మనసు ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో రెపరెపలాడింది.

సవతి గురించి, సవతి—కొడుకుగురించి, జానకి కేమీ తెలియదు. మూర్తి ఎంతసేపూ మనో గురించి మాట్లాడతాడు గాని, తల్లి గురించి ఏమీ చెప్పడు. ఎలా ఉండేదో తెల్సుకోడానికి యింట్లో ఒక్క ఫోటో అయినా లేదు! అక్కయ్య చెప్పడం—అతన్ని కన్నాక పదకొండురోజుల్లోనలే పోయిందని, అప్పట్నుంచీ అతను తాతగారి దగ్గరే పెరగడం.

ఎలా ఉంటాడో! తండ్రి ప్రేమ నింతగా పొందిన వాడు ఎంత అదృష్టవంతుడై యుండాలి? ఒక్కసారి చూడాల్నంటుంది. కాని, ఆయనతో చెప్పడమెలా ? అతని కించుమించు తన వయసేట. తీసుకు రమ్మంటే ఆయన ఏమనుకుంటారో! ఏమిటో వెర్రి వెర్రి ఆలోచనలన్నీవచ్చి మనసు వెనకాడుతుంది.

పోనీ, మనో ఎంత గొప్పవాడైనా, తెలివైన వాడైనా, తనకి పిల్లలుండడానికీ, అతనికీ సంబంధ



మేమిటి? తన పిల్లలు అంత గొప్పవాళ్లు, అందగాళ్లు కాలేరనా ? లేకపోతే, అతని అదృష్టం వీళ్లకు పంచాల్సి వస్తుందనా! జానకి ఆలోచనలకి ఓ అంతూ పొంతూ కుదరడంలేదు.

పెళ్లికాకముందు, ఆమె కోరిక ఒక్కటే. అది కాస్త తీరాక, ఆ స్థానాన్ని మరోటి ఆక్రమించింది. మనో ఆస్తిలో వాటా కోరకుండా, పోనీ, ఆడపిల్లయినా సరె! తన బాధల్నీ, సంతోషాన్నీ, ఆశల్నీ, ఆశయాల్నీ విప్పి చెప్పుకోడానికి ఒక్క పాపాయి! జానకి కళ్లు చెమ్మగిలాయి.

"దానికి చదువు చెప్పించమనీ, పెద్ద కట్నాలు పోసి, పెద్దసంబంధాలు తెచ్చి పెళ్లిచెయ్యమనీ బాధపెట్టను!.... కాని నాది అని చెప్పుకోడానికి ఒక్కపాప!" యింతకన్నా ఈ జన్మకింకేం కోరదు! జానకి దేవుణ్ణి ప్రతిమలాడింది, కళ్లనీ చెంపల్నీ తుడుచుకొని.

ఆరోజు నాలుగ్గంటలకే మొగమంతా శుభ్రంగా కడిగి కళ్లనిండా దట్టంగా కాటుక పట్టించింది. ఈ నీళ్లన్నీ కారి, అదంతా చెంపలమీదికి పాకింది; తుడవడంతో మరీని! ఆయన చూస్తే ఏమనుకుంటారో! ఏడుస్తోందనుకుంటారేమో!

జానకి గబగబా పంపుదగ్గరకి పోయి, మళ్లీ మొగం కడిగి, తిరిగ్గా కాటుక, బొట్టూ తీర్చింది. ఒక్కొక్కరోజు అన్నీ చక్కగా అమరుతాయి, వాటంతటవే; తనెంతో అందగత్తెనని మురిసి పోతుంది. కాని, అదేమిటో, తీరా, తను అందంగా తయారవుదామనుకునేప్పటికి అంతా వక్రంగా తయారవుతుంది — 'ఫర్వాలేదు' అనుకోడానిక్కూడా వీల్లేకుండా ఈ జడొకటి! ఎన్ని సార్లు అల్లినా, ఎత్తులు పల్లాలు, వంకరలకింద తయారైంది.

అయిదున్నర కావస్తోంది. యింకా రారేం! జానకి మనసు ఆలోచనల్లోపడి ఆలస్యమయిందన్న సంగతి గమనించలేదు అంతవరకూ. బయటకొచ్చి చూసింది.

దూరంగా మెట్లమీదనుంచి మూర్తి దిగుతున్నాడు; వెనక ఆకాశం తప్పించి ఏం కనబడదు. ఎత్తైన విగ్రహం, బూడిదరంగు సూటు, నల్లఫ్రేం—కళ్లద్దాలు, చేతిలో గొడుగు, వయ్యారంగా నడక—జానకి మెదడ్లో ఆ బొమ్మ అచ్చుగుద్దినట్టు, ఎప్పుడు తల్చుకున్నా కనబడుతుంది.

ఈ రోజు, రోజూలాంటిదికాదు. ఈరోజు అంతా యిదివరకట్లా జరగదు.... పైగా యింత ఆలస్యంగా రావడమేం? జానకి గబగబా వెళ్లి మంచం మీద, గంటల తరబడి గాఢ నిద్రపోతున్నట్టు పక్కంతటినీ వంకర టింకరగా రేపేసి పడుకొంది.

లోపలికొచ్చి చూశాడు మూర్తి.

ప్రపంచంలో అంతా మంచి తప్పించి చెడే లేనట్టు ప్రశాంతంగా మూసుకున్న కళ్లు, చిరునవ్వు విరిసిన పెదిమలు,— మూర్తికి లేపబుద్ధికాలేదు. మంచం మీద వారగా చేతినవతల పెట్టి కానించి కూర్చొని అట్లా ఆమెకేసే చూస్తుంటే ఎన్ని క్షణాలు గడిచాయో తెలియదు. చెవుల్ని కప్పినజుట్టు నెమ్మదిగా వెనక్కి తోశాడు. కళ్లకింద ఎత్తుగా లేచిన భాగంలో, కనురెప్ప—వెంట్రుకల నీడలు పడినచోట మృదువుగా పెదాల్తో స్పృశించాడు, ఆమె లేస్తుందనే ఆశతో. జానకి కదిలి యిటునుంచి అటుతిరిగింది, కాని లేవలేదు.

"అదుగో, మళ్లీ మొదలెట్టారు!" జానకి ఉలిక్కి పడ్డట్టు కళ్లు తెరిచి కోపంగా చూసింది, జడవిప్పుతున్న మూర్తివంక.

"నిద్ర పోడంలేదన్నమాట, దొంగ!"

జానకి నవ్వేసి, వళ్లో తలపెట్టుకుంది; మూర్తి నెమ్మదిగా జుట్టంతా మొగంమీద పరుస్తుంటే బొమ్మలా కళ్లుమూసుకుని.

"యివన్నీ నల్లమబ్బులు, పేటివాటూ చందమామ ఇదీ!"

"ఛా! మరీ పుస్తకాల్లో రాసినట్టు!" సిగ్గుపడింది జానకి.

"యివాళ నీ పుట్టినరోజుకి, ఓ మంచివార్త జానీ, చెప్పమంటావా ?"

"నేనూ చెప్తానో మంచివార్త."

"ముందర నన్ను చెప్పనీ."

"కాదు, నేను చెప్పాలి." పెంకిగా అంది జానకి, మూర్తికూడా పట్టుపడతాడని ఆశించి. కాని ఆమె ఆశ నెరవేరలేదు.

"ఊఁ, చెప్పు." అన్నాడు మూర్తి.

జానక్కి వెంటనే ఏం చెప్పాలో తెలియలేదు.

కాస్సేపటికి నెమ్మదిగా అంది, బోర్లా తిరిగి తల అతని ఒళ్లో దాచుకుని—

"మనోకి తమ్ముడో, చెల్లాయో ! .... ఇంకా నాలుగు నెలల్లో!"

ఆమె తలలో బుజ్జగిస్తున్నట్టు కదిలిన వేళ్లు ఒక్కసారిగా ఆగిపోయాయి. మూర్తి మాట్లాడ లేదు., కదల్లేదు. ఇద్దరూ అలాగే ఉండిపోయారు చాలాసేపు.

ఎంతో ఆశించింది, ఏమేమిటో ఊహించింది. అత నా మాట వినగానే అలా గడ్డకట్టుకు పోతా డని మాత్రం అనుకోలేకపోయింది. ఈ ఘోర వార్త వినాల్సి వస్తుందని ఎప్పట్నుంచో భయ పడ్తున్నట్టు, ఇప్పటికిలా పాపం పండి శిక్ష పడి నట్టు మాట లేకుండా, నిశ్చలంగా గది మూల కేసి చూస్తూ కూర్చుండిపోయాడు మూర్తి.

ఎంత నిరాదరణ ! నరకం ! పెల్లుబికి వచ్చే దుఃఖాన్ని కష్టంమీద ఆపుకుంటూ, రోషంగా లేచి కూర్చుని అటు తిరిగింది జానకి.

"అయితే, నువ్వక్కడి కెళ్లాలా ? ఇక్కడే పోసుకుంటావా ?" గోడతో మాట్లాడుతున్నట్టు అడిగాడు.

"నిన్న అక్కయ్య ఉత్తరం రాసింది. రేపో యెల్లుండో బావకూడా రాస్తాట్ట !" అలాగే సమా ధాన మిచ్చింది, జానకి.

"ఏమని ?"

"ఓ వారం రోజుల్లో మంచిరోజు చూసు కుని నన్నక్కడికి రమ్మని. ఇక్కడ బండెక్కిస్తే అక్కడ బావ వచ్చి తీసుకెళ్తాడు."

అంతా ముందే నిర్ణయించేసినట్టు చెప్పింది జానకి. అంత త్వరగా వెళ్లాలనుకోలేదు అసలు. అక్కయ్యకి అప్పుడే రావని రాయాలనుకొంది. కాని, .... అనుకున్నట్టేదీ జరగదు. ఆయన ధోరణి సహించి ఉండటం కష్టం. కొన్నాళ్లయినా ఎక్క డికో వెళ్లిపోవాలి. ఇక్కడ్నుంచి వెళ్లిపోయి, సుఖ పడ్తుందని కాదు; అయినా తప్పనిసరి .... పాపని చూశాకయినా మనసు మారుతుందేమో ! .... జానకి క్షణాలమీద ఒక నిశ్చయానికి వచ్చేసింది.

"ఏదో చెప్తామన్నారు !" అరగంట అలాగే కూర్చొన్నాక వినపడీ వినపడనట్టు నెమ్మదిగా గుర్తు చేసింది.

"ఏంలేదు, ఇక అది కుదరదులే" మూర్తి నిర్లి ప్తంగా అని, ఆమెకేసి చూడకుండానే, బట్టలు మార్చుకొని బయటి కెళ్లిపోయాడు, యిప్పుడే వస్తానని. ఇక మాటలు పొడిగించలేకపోయింది.

ఆయనలో ఏదో చీకటి మూల ఉంది. దాని మీద కాంతి పడేలా సూచ నేదీ చెయ్యడంలేదు. తనూహించే కారణాలన్నీ ఆయనకి తనంటే ఏవో నీచమైన అభిప్రాయా లున్నట్టు చిత్రిస్తున్నాయి. కేవలం ఆయన అవసరాలు తీర్చుకోడానికే తెచ్చు కున్నారా, తనని ! .... మెదడంతా పెద్ద ప్రయోగ శాలలా తయారైంది. ఒక్కొక్క ఆలోచనా, ఎన్నో ముళ్లు గుచ్చి ఎంతో బాధనీ, దుఃఖాన్నీ మిగిల్చి వెళ్లిపోతుంది. ఏదీ తేలదు. తేల్చుకోవాలనే ఆరాటం మాత్రం క్షణక్షణానికి ఎక్కువగా క్షోభ నింపు తోంది.

జానకి గుండెల్ని ఎవరో కొలిమి తిత్తులు—చేసి, ఊదుతున్నట్లుంది. ఆ రోజల్లా కళ్లలో నీరు ఇగిరి పోతుందన్నట్టు ఏడ్చి ఏమీ తేల్చుకోలేకపోయింది అమ్మో

ఆ వారం రోజులూ ఒకర్నొకరు తప్పేదో చేసి నట్టు, తప్పించుకు తిరిగారు. మాటలు బొత్తిగా తగ్గిపోయినై.

* * *

ఓ బల్లమీద కిటికీవార కూర్చొంది జానకి.

"కళ్లలో నిప్పురవ్వలు పడతాయి, ఇటుసక్క కూర్చో." మూర్తి ప్లాట్‌ఫారంమీద నిలబడి ఎదురు కిటికీలోంచి బయట గూడ్సుపెట్టెలకేసి చూస్తూ అన్నాడు. జానకి మాట్లాడలేదు, కద ల్లేదు. ఇన్నాళ్లనుంచీ పేరుకున్న విచారమంతా ఒక్కసారి రెండింతలయినట్లుంది, ఇద్దరికీ. ఇద్దరూ ఏదో ఘోరమైన నేరం చేసినట్టు బాధపడ్డారు.

బండి కదిలింది, పెద్దగా రొదచేసి.

"నేను వెళ్తాను" మూర్తి తల వొంచుకుని గిరుక్కున తిరిగి గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడు, తన మొగం ఆమెకి చూపడం ఇష్టంలేనట్టు.

కోర్టులో కేసు విచారణ జరుగుతోంది. ప్రాసిక్యూషన్ లాయర్ గారు తమ 'వాదన' ముగించి కూర్చున్నారు. జడ్జి గారు, వెంటనే "డిఫెన్సు లాయర్ మాట్లాడక్కరలేదు! ప్రాసిక్యూషన్ జయించినట్లే" అనేశారు.

డిఫెన్సు న్యాయవాది కంగారు పడిపోయి, తన వాదన కూడా వినవలసిందని ప్రాధేయపడ్డాడు, జడ్జీగారు ఏలాగయితే నేమి ఒప్పు కున్నారు. డిఫెన్సులాయరుగారు కూర్చోగానే న్యాయాధిపతి ఆశ్చర్యపడిపోతూ "అరే! ప్రాసిక్యూషన్ దే కేసనుకుంటే మీదే నెగ్గిందే!" అన్నారు.

అరుణ (ఉదయగిరి)

జానకి గాజుపొరల్లాంటి నీళ్లు నిండిన కళ్లతో కనబడేంతవరకూ అతనివంకే చూసింది. ఆఖరి సారి దూరాన్నుంచయినా తనవంక చూస్తాడేమో నని ! కాని, తనేం పాపం చేసిందో ! పోనీ అంత ఇష్టం లేకపోతే అస లీ స్థితి రాకపోయే మార్గ మేదన్నా చూసినా బాగుణ్ణు!

చెట్లూ, చేలూ, ఇళ్లూ, మనుష్యులూ అన్నీ ఎంతో వేగంగా వెనక్కి వెళ్లిపోతున్నాయి. అమిత మైన వేగంతో దూసుకుపోతూంది రైలు, కొన్ని స్టేషనలో ఆగకుండా. రైలు ఆగినచోట ప్లాట్ ఫారంమీద చెట్ల ఆకులు, కాగితాలు, దుమ్ము—అన్నీ కలిసి పైకి రేగి గాలిలో ఎగురుతున్నాయి. అలుక్కు పోయినట్టు, ఒక్కటీ సరిగ్గా, స్పష్టంగా కన బడకుండా; ఆమె మనసులో ఆలోచనల్లాగే. జానకి తల వెనక్కి విరగిలా ఆనించి అటే చూస్తూంది.

మనో ! ఎంత అందమైన పేరు ! అంత చక్కటి పేరు పెట్టాలనిపించాలంటే, అతనెంత అందగాడై ఉండాలో ! జానకి మనసులో ఒక ఆకారం వెలిసింది—ఆరడుగుల విగ్రహం, నాజూగ్గా, సన్నగా. నొక్కులు తిరిగిన జుట్టు; పసివాడిలా అమాయకంగా నవ్వే నోరు; వినయంగా చూసే కళ్లు.

తెల్లని చిక్కటి పాలలా వెలిగే తన జీవితంలో విషం విడిచి నల్ల మరకలు చేశాడు మనో. మనో లేకపోతే తన పాపకోసం ఎంత ప్రేమతో, ఆత్రంగా ఎదురుచూశేవారు ఆయన ! ఇప్పుడు తన పాప అతనిలా ఉండదనేగా ఆయన భయం ! లేకపోతే మనోకి పోటీగా మరో వారసు డొస్తాడనా ! అంత నీచమా ఆయన ఆలోచన ! .... కాని, నీచమేముంది? సహజమేనేమో !

రైలేదో స్టేషన్లో ఆగింది. ప్లాట్‌ఫారంమీద ఎవరో దంపతులు. తనలాగే పురుటికి వెళ్తున్న ట్టుంది. ఆమె సామాన్లన్నీ రెండు చేతుల్లోనూ, చంకల్లోనూ ఇరికించుకొని పక్కగా నడుస్తున్నాడు మొగుడు; ఆ ఫ్లాస్కు ఒక్కటీ ఆమె పట్టు కుంటే అలిసిపోతుందని భయపడ్తున్నట్టు ! వాళ్ల వంకే తదేకంగా చూడసాగింది జానకి. తనున్న పెట్టెలోకే వస్తున్నారు.

"జాగ్రత్త. రాత్రులు ఎక్కువగా మేలుకు ఉండరు. బరువులు ఎత్తడానికి ప్రయత్నించకు. జాగ్రత్త. ఇంట్లోనా శ్లేవరికోసమో కనిపెట్టు క్కూర్చోకు; నువ్వు సరిగ్గా ప్రొద్దునా పదింటికి, రాత్రి ఎనిమిదింటికీ తినేసి నిద్రపో; జాగ్రత్త. నిన్న తెచ్చిన మందు రోజూ రెండు పూటలా అన్నం తిన్న వెంటనే మర్చిపోకుండా తాగు ....." అత నలా అందరిమధ్యా గట్టిగా మాట్లాడుతుంటే, సిగ్గుతో తలొంచుకుని గబగబా రైల్లో ఎక్కేసిం దామె.

ఎన్నిసార్లు అంటున్నాడో "జాగ్రత్త" అని ! పది, పదకొండు .... జానకి లెక్కబెట్టింది. రైలు కదలినా, ప్లాట్‌ఫారం అయిపోయేదాకా కూడా కిటికీ కమ్మీ పట్టుకుని పరుగెట్టి జాగ్రత్తలు చెబుతూనే ఉన్నాడు. వేగం హెచ్చాక ఇంక అందుకోలేక, దిగ బడిపోతూ, "నే నిచ్చిన ముప్పై కవర్లూ వారానికి రెండు చొప్పున ప్రతీ ఆదివారం, లక్ష్మీవారం రాసి పడెయ్యి, జాగ్రత్త !" అని ఆఖరుసారిగా కేక బెట్టాడు. రైలు కదిలి ఎంతోదూరం వచ్చి, తెల్లని మచ్చలా అతనక్కడ నిలబడిపోవడం చూస్తోనే ఉంది జానకి.

ఒక్కసారి నవ్వొచ్చింది, ఆ అమాయకత్వానికి. కాని, వెంటనే నీడలాగ, మూర్తి తనకిచ్చినవిడ్కోలు మనసులో మెదిలి బాధపెట్టింది. ఆమె ఎంత అదృష్ట వంతురాలో !

"పాపం, అతనంత యిదిగా చెబుతోంటే మాటే పలకవేమమ్మా" ప్రక్కామె ఎవరో అడి గింది నవ్వుతూ.

"ఏం చెప్పను, చెప్పండి. యింటిదగ్గిర రోజూ నెల్లాళ్నుంచి పాఠం అవుతూనేఉంది. అక్కడికి వాళ్లంతా ఎవరో రాక్షసులన్నట్టు, తమరొక్కరే మనిషన్నట్టు చెప్పుకొస్తారు. మరీ వేలంవెర్రి ! చాదస్తం !" అమ్మాయి ముచ్చటగా విసుక్కొంది.

"వెర్రేమిటమ్మా ! అమాత్రం అభిమాన

మున్నవాళ్ళు ఎక్కడో నూటికి, కోటికి !" నిట్టూర్చింది పక్కామె.

జానకి ఆ మాటలు తన కన్వయం చేసుకుని చురుక్కున ఆమెవంక తిరిగి చూసింది. పెట్టెలో కెక్కగానే తనేవో ఆలోచన్లమధ్య యిరుక్కుని, లోపలెవరు ఎక్కుతున్నారో, ఎవరు దిగుతున్నారో సరిగ్గా గమనించలేదు.

ఆ మూల ఎవరో ముసలాయన, పొడుంపీల్చే ట్టున్న ముక్కు, అసలు వెంట్రుకే లేని బట్టతల! ఆయన కెదురుగ్గా ఒకతను; వయస్సెంతుంటుందో చెప్పడం కష్టం. అష్టావక్రంగా ఉన్నాడు. "పాపం, నవ్వకూడదు." అని చెంపలేసుకుంది జానకి ఆ ఆకారాన్ని చూసి నవ్వొచ్చినందుకు తనని తానే తిట్టుకొని. ఆ తర్వాత ఎవరో పల్లెటూరు మోతుబరి పెద్దచుట్ట వెలిగించి, అసలు ఈ రైలు, ఈ లోకం అంతా ఎలా నడుస్తున్నాయా అని ఆలోచిస్తున్నట్టు తల పైకెత్తి దూరంగా ఎక్కడో ఆకాశంలోకి చూస్తున్నాడు, అదే పనిగా. ఎదురుగ్గా, ఈ కబుర్లుచెప్పే ముసలామె. ఆ పక్కన ఆ అమ్మాయి. ఆ అమ్మాయి బాగా ముగ్గురికి సరిపడే స్థలం ఆక్రమించింది. హోల్డాలు పొడుగునా పరిచేసి, ఎవరొచ్చి అడిగినా చుట్టవద్దని చెప్పి మరీ వెళ్ళాడు మొగుడు. కాళ్ళు కిందకి వేలాడేస్తే నొప్పెట్టాయని పెద్దపెట్టె ఒకదాన్ని బల్లకిందికి తోయకుండా అడ్డంగా దారోన్లే పెట్టాడు. ఒకవైపు పెద్ద మరచెంబు, చామంతిపూలు, మరువం. మరోపక్క బత్తాయిలు, పత్రికలు— అంతా మహారాణిలా పకడ్‌బందీగా ఉంది వ్యవహారం.

ఆ పక్కనున్న ముసలామె అమ్మాయితో కబుర్లు కలిపేసింది. వాళ్ళిద్దరూ ఆత్మీయులైపోయారా కాసేపట్లోనే. ఆ పెట్టెమొత్తానికి తను కాకుండా, వాళ్ళిద్దరే ఆడవాళ్ళు. వాళ్ళతో మాట్లాడకపోతే తనింక మూగనోము పట్టాల్సిందే. జానకి వాళ్ళకేసి చూసి మాటలు శ్రద్ధగా వింటోంది. అలా చేస్తేనన్నా కాసేపటికి వాళ్ళంతట వాళ్ళే తనతో మాటలు కలుపుతారనే ఆశతో.

"ఏ ఊరు వెళ్ళాలమ్మా మీరు!" జానకి కోరిక ఫలించి ముసలామె అడిగింది.

ఆ తర్వాతి ఎన్నో ప్రశ్నలు ఆమె గురించి, తల్లి, తండ్రి, అక్క, బావ, మొగుడు, ఊరు, ఉద్యోగం గురించీ.. జానకి అన్నిటికీ సమాధానాలు ఓపిగ్గా చెప్పుకొచ్చింది.

"అయితే నువ్వు మా మూర్తి రెండో పెళ్ళాని వన్నమాట !" ముసలామె ఆశ్చర్యం, ఆత్రం, ఉత్సాహం, ఉద్రేకంలాంటి భావాలెన్నో మిళతమైన స్వరంలో పరిస్థితిని సూక్ష్మంగా తేల్చేసింది.

జానకి అంగీకారంగా తల దించుకొంది.

"ఇదుగో చూశారా ! ఈవిడేట మూర్తి రెండో పెళ్ళాం!" ముసలామె, దూరంగా కూర్చొన్న బట్టతల మొగుడివంక చూసి అరిచింది. ఆయన హఠాత్తుగా యిటు తిరిగి ఈమెవంక అదే పనిగా చూడసాగాడు.

జానకి ఊహించని కలయిక అది. చాలా అయోమయంగా అసంబద్ధంగా కనబడింది.

"ఇదుగోరా, అబ్బాయి, పిన్ని !" ముసలామె మూల అబ్బాయిని చూసి అంది.

"ఏదీ! ఏదీ! నా పిన్నే! నా పిన్నే! పిన్నంటే ఎవరే అమ్మమ్మా !" వెంటనే ఎగిరొచ్చి పక్కన కూలబడ్డాడతను.

# నల్లమబ్బులు

"మీ నాన్న రెండో పెళ్ళాం !"

"నాన్న—పెళ్ళామా! యెంత బావుందో! అయితే ఇంక రేపట్నుంచి నేను, నాన్న—పెళ్ళాం జత. నీతో మాట్లాడితే ఒట్టు !..."

ఏమిటో అరుస్తూ వెంటనే సీటు మార్చి జానకి పక్కన జేరాడు. ముసలామె కళ్ళలో నీరు చిమ్మింది.

"ఒరేయ్ వెధవా, ఇటు రా ! నిన్నిక్కడ నోరు మూసు కూర్చోమంటే, అక్కడ కెందు కెళ్ళావు?" ముసలాయన ఆ మూలనుంచి అరిచాడు.

"బాబోయ్ ! బాబోయ్ ! నేను రాను. పిన్నీ, నన్ను నీతో కూడా తీసుకుపో. తాతయ్య చంపేస్తాడు !" జానకి చేతిని గట్టిగా పట్టుకొని ఏడుస్తున్నట్టు అరుస్తున్నాడు కుర్రాడు.

"రా, బాబూ. తప్పు. నీకు తాయిలం పెడతా" చేతులు చాచి లాక్కొంది ముసలామె.

జానకి కేదో కలలో ఉన్నట్టుంది.

"వీ డీ లోకంలో పడి, దాన్ని సాగనంపాక యిరవై యేళ్ళయింది..... పుట్టిం తర్వాత ఒకసారి వచ్చి చూశాడు; ఆ తర్వాత పదేళ్ళకో ఎప్పుడో మళ్ళా

మామగారు : ఏం బాబూ ! రేపుకదా పండుగ. నేడే వచ్చావ్ !

అల్లుడు: రైలుబళ్ళు మామూలుగా లేటుగా వస్తాయనుకున్నాను.

ఆదిశేషు (కైలాసపురం)

ఒకసారి చూశాడు. అంతే. ఇంక మళ్ళీ ఇటువైపే రాలేదు .... నెలనెలా వందలు పంపిస్తాడు; అవి కొనండి, ఇవి కొనండి అంటూ ..... ఎందుకు ? ఆమాత్రం డబ్బు మాకు లేకనా ? తనొకసారి వచ్చి చూసిపోతే, వాడికి తండ్రిని చూసినట్టు ఎంత తృప్తి ఉండేది ! తండ్రి అన్నాక అంత మాత్రమైనా చెయ్యలేకపోతే, ఎందుకు ఉండి మత్రం" ముసలామె స్వగతంలోలాగ చెప్పుకుపోతోంది.

"ఆయనస్తమానం, మనో, మనో అంటూ కలవరిస్తూనే ఉంటారు !"

"ఆమాత్రం గుర్తున్నాడన్నమాట ! అంతే చాలు .. ఎవడో మన్మథు డవతరిస్తాడని ఇద్దరూ ఏమేమిటో ఊహించుకుని ముందుగానే పేరు పెట్టుకున్నారుట, 'మన్మోహన్' అని ! అది కాస్తా యిలా తేలింది! .... అది ఆ బాధతోనే బెంగెట్టుకొని ప్రాణాలు ఒదిలిందా ! తనిలా దూరమయితే, ఇంక వాడి గతేం కాను, మా తర్వాత !" ముసలామె కళ్ళు కడవలయ్యాయి.

జానకి అతనివంక పరిశీలనగా చూసింది. ఇరవై యేళ్ళ మనిషికి తగినట్టు కళ్ళు, ముక్కు, నోరు పెరిగాయి గాని, నుదురు, తల పైభాగం పెరగలేదు. ఒక కన్ను చిన్నది, మరోటి పెద్దది. రెంటికీ మెల్ల. నెత్తిమీద వెంట్రుకలు అక్కడక్కడ చాలా పల్చగా అసహ్యంగా ఉన్నాయి. చేతులు, పొట్ట సమంగానే ఉన్నాయి గాని, కాళ్ళు ఒకటి పొట్టి, రెండోది పొడుగు. పైగా వంకరపోయాయి. ఈ వక్రాలు చాలవన్నట్టు, తుట్టపెదిమలు, చొంగ కార్చే నాలిక బయటపెడ్తూ వెకిలి మాటలు ! యేళ్ళతోబాటు శరీరంలో భాగాలు, మెదడూ సమంగా పెరగలేదు.

జానకి చూడలేక తల తిప్పుకొంది.

"అతగాడ్లో ఉన్నవే, యివన్నీ. ఎక్కడికి పోతాయి పోలికలు ! ఏ డాక్టర్నడిగినా అదే మాట! సంప్రదాయం తండ్రినిబట్టి వచ్చింది, చేయగలిగిందేం లేదని ! అతగాడిలో స్పష్టంగా కనబడనివన్నీ వీడిలో మరింత కొట్టొచ్చినట్టు తయారైనాయి ! అంతే తేడా ! అందుకే అతగాడికి వాణ్ణి చూడ్డానికి మొహం చెల్లదు. తన ప్రతిబింబమేగా !" ముసలాయన ఆవిడతో అంటున్నట్టు అన్నాడు, జానక్కి నాటాలని. స్వరం కోపంతో కంపిస్తున్నట్టుంది. ముసలామె చేసిన ఏదో సంజ్ఞ అర్థంచేసుకున్నాక ఆయన మాటలు ఆపి, అటు తిరిగాడు

మూర్తికి నుదురు విశాలంగానే వెనక్కి ఒరిగినట్టుంటుంది. ఒక కన్ను కొద్దిగా మెల్ల. ఒక కాలు పొట్టయితే కావచ్చు. కాని నడక కుంటుతున్నట్టుండదు. పైగా అదో షోగ్గా ఉంటుంది. జుట్టు పల్చనే—జానకి మూర్తికీ, పిల్లాడికీ పోలికలు వెతుక్కుంది.

ఒక తుఫాను చెలరేగి సద్దుణుగుతూం దనుకునేంతలో మరోటి లేచింది; జానకి హృదయంలో. పాత మబ్బులన్నీ దూరంగా పోయి, కొత్త కొత్తవి జేరుకుంటున్నాయి. ఈ ఆలోచనలు చేసే అలజడిలో గడ్డిపోచలా తనెటో కొట్టుకుపోడమే గాని, ఏదీ స్పష్టంగా కనబడదు, ఇదమిత్థంగా తేలదు.

కాని, ఇంతదాకా గుండెలమీద బలంగా కూలబడిన బండ ఏదో దించినట్టుంది. తేలిక్కైనట్టనిపించి, హాయిగా ఊపిరి సలిపింది జానకి.

బండి ఆగింది. అక్కయ్యా, బావని చూడగానే ఎక్కడలేని ఆనందం, ఉత్సాహం వచ్చాయి. అక్కయ్య నిజానికి అందరు అక్కల్లాంటిదీ కాదు. అమ్మ ఉంటే ఎలా చూసేదో తెలియదు గాని, ఒక్కోసారి "అమ్మా" అనే పిలవాలనిపిస్తుంది అక్కయ్యని. బావ! వెర్రిబావ! తన ఇంట్లో ఉన్నందుకు ఎక్కడ బాధపడుతుందోని అతిగా ఆదరించి గారాబం చేసేవాడు. జానక్కి లోకమంతా దేదీప్యమానంగా వెలుగుతున్నట్టనిపించింది.

"వెళ్తానండి. ఈసారి నే నక్కడికి వెళ్ళాక, ఆయనకి నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాను, తప్పకుండా. ఆయన మీ రనుకునేంత రాయి కాదు." జానకి ముసలి దంపతులకి భరోసా యిచ్చి, మనో చేతిలో ఓ పది రూపాయల నోటు పెట్టింది, పెద్దవాళ్ళిద్దరూ వద్దంటున్నా వినకుండా.

రెండు రోజుల తర్వాత, ఇంటికి క్షేమంగా జేరినట్టు మూర్తికి ఉత్తరం రాస్తూ జానకి చివర చేర్చింది.

"మిమ్మల్ని భయపెట్టేవన్నీ ఉత్తి నల్లమబ్బులు. నల్లమబ్బులు ఉరుముతాయి గాని, వాన కురవ్వు. నే నిక్కడ కోవెల్లో స్వామివారి దర్శనం చేసుకున్నాను. ఆయన మాటకి తిరుగుండదని అంతా గట్టిగా నమ్ముతా రిక్కడ ..... పండులాంటి కొడుకు నెత్తుతావని దీవించారు స్వాములవారు."



# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

దగ్గర ఆగిపోతుంది. యింకా నందు ఎంత పొడుగున్నా సరే! దీని వెనకాల ఏదో అంతరార్థం ఉందని చిత్ర విచిత్రంగా అనుకోవటం కద్దు. ఇక శుభ్రం చూడబోదామా, ఏ వీధి చూసినా, ఎందు కాలిడినా, నగర పాలకుల అలక్ష్యం ప్రత్యక్ష మవుతూనే ఉంటుంది. ఇల్లు చూసి ఇల్లాల్ని ఊహించుకున్నట్టుగానే పట్నాన్ని చూసి, పురజనులను ఊహించుకునేట్లుండాలి. నగరపాలకులు ఎంతో శ్రద్ధ, ఆసక్తి కనపర్చాల్సినచోట, ముభావంగా ఊరుకున్నట్లే కనబడుతుంది. నిజమే; పురజనుల సహాయ సహకారాలు ఎంతో అవసరం; కాని మునిసిపాలిటీవారు తమకు తాముగా తమ విధుల్ని సమర్థవంతంగా పాటిస్తున్నామని చెప్పకలుగుతారా ?

బిచ్చగాళ్లకు వేరే చోట ఉండటానికి వసతి ఏర్పాటు చేస్తామని ప్రతియేటా చెప్పుకుపోవటమే కాని, అమలుజరపటం శూన్యం. రోజు రోజుకు వాళ్ల బెడద ఎక్కువయిపోతోంది. దీర్ఘ రోగాలవారు, అంటురోగాలవాళ్లు, బస్సుస్టాండుల దగ్గర గుమిగూడి అసహ్యకరమైన దృశ్యాల్ని సృష్టించటమే కాకుండా, వీధివీధినా తిరుగుతూ అంటురోగాలు పాకటానికి కావలసిన వాతావరణాన్ని కూడా కల్పిస్తున్నారు. ఈ విధంగానే యింకా కొన్నాళ్లపాటు సాగనిచ్చినట్లయితే ఆరోగ్యశాఖ వారికి కావలసినంత పని ఏర్పడే ప్రమాదం కూడా ఉంది. ఈమధ్య మా యింటికి మునిసిపల్ ఆరోగ్య శాఖ నుంచి ఒక వ్యక్తి వచ్చాడు, మీ యింట్లో ఎవరికైనా జ్వరా లున్నాయా అంటూ. ఆయన అడిగే తీరూ, లక్షణం అట్లా ఉంది. ఎవరు నువ్వు, ఎందుకొచ్చావు అని తిరుగు ప్రశ్న వేసిన తర్వాత, తాను ఫలానా అని చెప్పుకున్నాడు. అయితే నేనో ప్రశ్న వేశాను: జ్వరాల బాధవుతే లేదుగాని, దోమల బాధ ఎక్కువగానే ఉంది; దీనికేదైనా నివారణోపాయం చూడమన్నా. చప్పున సమాధానం చెప్పేశాడు: ఆ సెక్షన్ లేదుట, తనకేమి సంబంధం లేదుట, ఆయన కేవలం జ్వరాలు వచ్చినవాళ్లనే తెలుసుకుని, తనకు చెప్పిన ప్రకారం చేసిపోతాడుట. తీరా అడుగుతే, ఆ సెక్షన్ కూడా, చిక్కడపల్లిలో తన ఆఫీసులో ఉన్నదే! అయితే ఆ వచ్చిన గుమాస్తాను నిందించి ప్రయోజనం లేదు. ఒక శాఖలోనే సమన్వయం లేకుండా, బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్న దానికి యిదొక నిదర్శనం. విడివిడిగా విధులు నిర్ణయించచ్చు. సెక్షన్లు వేరు చెయ్యొచ్చు. ఇదంతా పరిపాలనా సౌలభ్యం కోసం. అయితే ఈ శాఖ మొత్తమంతా, పురజనుల ఆరోగ్యాన్ని కాపాడటానికి ఏర్పడిందీ అనే మాట మరుస్తే ఎట్లా! ఈ భావన పై ఆఫీసర్ల నుంచి వస్తేనే, మొత్తం సెక్షన్ అంతా సమర్థవంతంగానూ, ప్రజోపయోగంగానూ పనిచేయ కలుగుతుంది.

ఇదే విధంగా, కల్తీలు నివారించటానికి ఏర్పడ్డ శాఖ కూడా పనిచేస్తోందంటే ఆశ్చర్యపడాలసిన అవసరమేమీ లేదు. ఆహారపదార్థాల్లో నూటికి 66 వంతులు నిరాఘాటంగా కల్తీలు జరుగుతున్నాయని, అందులోనూ పాలల్లో కల్తీ అన్నిటికంటె బాగా హెచ్చుగా ఉంటోందని ప్రభుత్వంవారి లెక్కలు. తర్వాత వస్తుంది నెయ్యి. దీంట్లో కల్తీ, పాలకంటె తక్కువ కావచ్చేమో గాని, మిగతావాటి కంటే ఎక్కువే! కోర్టుదాకా వెళ్లిన కల్తీల కేసుల్లో, శిక్షలు, జరిమానాలు బాగానే పడుతున్నాయి. అయితే కల్తీలు చేసే వ్యక్తుల్లో నూటికి ఏ యిద్దరో, ముగ్గురో కోర్టుల కెక్కుతారు. మిగతావాళ్ల మాటేమిటి! వీళ్లను పట్టించి, దీన్ని నివారించే బాధ్యత ఎవరిది! ఫలానాచోట, ఫలానా వస్తువులో కల్తీ ఉందని, కంప్లయింట్ చేస్తేనే, మునిసిపాలిటీ సిబ్బంది కదలా లేమిటి! దీనికి ఒకళ్ల రిపోర్టు ఎందుకు? ఇందుగల డందు లేదని సందేహము వలదు అన్నట్లు ఈ కల్తీ పిశాచం ఎక్కడ బడితే అక్కడే ఉంది. హఠాత్తుగా దుకాణాల్లోకి వెళ్లి పరీక్ష చెయ్యొచ్చునే! అమ్మే వస్తువులను నమూనాలు తీసుకుని, కల్తీ ఎంతఉందో యిట్టే కనిపెట్టచ్చే! చిల్లర దుకాణదార్లను అడిగితే మాకేం తెలుసు, టోకు వర్తకుల్నించి కొన్నాం, మీ కమ్ముతున్నాం, మే మేం చేశాం అంటున్నారు. నిజమే కావచ్చు. అధికారులు యీ టోకు వర్తకుల సంగతేమిటో తెలుసుకోవచ్చుగా! వీటిల్లో ప్రజల సహకారం లభించక పోవటమంటూ ఉండదుగా! కల్తీలేని ఆహారపదార్థమే లేదంటున్నారు. ఇంత ఘోరంగా, మార్కెట్టులో వస్తువులు అమ్ముడు బోతుంటే, మనకు సంబంధం లేనట్టు మౌనం వహించటానికి కారణం ఏమిటి ?

పరిశుభ్రానికి, ఆరోగ్యానికి సంబంధించినంతవరకు తగిన చర్యలు తీసుకోలేని, యీ మునిసిపాలిటీ, యింకా ఏవేవో చెద్దామని ప్లాన్లు వేయటం హాస్యాస్పదంగానే ఉంటుంది. ఈ ముఖ్యమైన రెండు విషయాలపట్ల శ్రద్ధాసక్తులు చూపించిననాడు వీళ్లు తలపెట్టిన కొత్తకార్యక్రమాల్ని కూడా సమర్థవంతంగా నిర్వహించగలరనే విశ్వాసం ప్రజల్లో కలుగుతుంది.

ఐ. ఎల్. ఎన్. ★

# న్యూఢిల్లీ లేఖ

6-వ పేజీ తరువాయి

మూడునెల్ల తర్వాత, ప్రభుత్వం, కాగితాలమీద సైనిక సమీకరణ ప్రయత్నంచేసింది. భారత దేశం ఏ విధంగా రక్షణ ఏర్పరచుకుంటుందన్న విషయాన్ని పరిశీలించి ప్రభుత్వానికి తగు సలహాలివ్వటానికి, లండన్, వాషింగ్టన్‌ల నుంచి సైనిక ప్రవీణులు రావల్సివచ్చింది!

ఇప్పుడు జరిగిన యుద్ధవిరమణం కేవలం చైనాకు అనుకూల పరిస్థితుల్లోనే జరిగింది. ప్రజా చైతన్యం రోజురోజుకీ సన్నగిల్లిపోతోంది. మళ్ళీ ఏదైనా అవాంతర పరిస్థితి ఏర్పడితే దేశం ఇంత ఉత్సాహంతోటే ప్రతిఘటిస్తుందనుకోవటం శుద్ధ బుద్ధి విహీనత.

సైనిక బలిష్టత సంపాదించుకోవాలంటే ముఖ్యంగా డబ్బు కావాలి. ఆర్థికమంత్రి ఒకప్రక్కన అదనపు పన్నులద్వారా రాబోయే ఆదాయాన్ని పరోక్షంగా హెచ్చరిస్తూనే ఉన్నారు. అన్నిటికన్న ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే అదనపు పన్నులద్వారా రు. 300 కోట్లు ఎలా సంపాదించ గలుగుతారనే! వీటికితోడు, ఈ పంచవర్ష ప్రణాళికలో మూడవ సంవత్సరానికి కావలసిన ధనం ఎలా వస్తుందనేదికూడా ఓ ప్రశ్నే. అభివృద్ధి ప్రణాళికకుగాను ఇంకో రు. 200 కోట్ల అదనపుపన్నును దేశం నెత్తినేసుకునేందుకు సిద్ధంగా ఉందని ప్రణాళికా సంఘం అభిప్రాయం. వీటిల్లో పడి, ఆర్థికశాస్త్ర తత్వాన్నే మర్చిపోయారు! కేంద్ర వ్యయంలో దాదాపు 50 వంతులు, "విద్యా, ఆరోగ్యం వ్యవసాయం, సమాజాభివృద్ధి, సాంఘిక సేవాదళం లాంటి రాష్ట్రప్రభుత్వ విషయాలపైనే ఖర్చు చేయటం జరిగింది." అంటే ప్రభుత్వం 1963—1964 సంవత్సరంలో దేశరక్షణకు పంచవర్ష ప్రణాళికకుగాను, లోటు బడ్జట్టుద్వారాగాని, అదనపు పన్నులద్వారాగాని సుమారు రు 500 కోట్లు వసూలు చేయగలనన్నమాట. ఆ అదనపు పన్నులు దేశానికి భారమౌతాయి. లోటుబడ్జటు వల్ల దేశం ద్రవ్యోల్బణానికి గురియ్యే ప్రమాదం ఉంది. ఇదంతా ఒకభాగం. రక్షణ సన్నద్ధతకు విదేశాల భారీ సహాయం అవసరమవుతుంది. పాశ్చాత్యులుకూడా ఇంతవరకూ భారత దేశానికి సహాయంపట్ల సంసిద్ధులుగానే ఉన్నారు. ఆసియాలోని ఉపఖండంలో ప్రజాస్వామ్య మనుగడను రక్షించుకునేందుకు సిద్ధంగా ఉన్నామని మనం నమ్మించాల్సింది పాశ్చాత్య ప్రజలనేకాని, వాళ్ళ ప్రభుత్వాలను మాత్రంకాదు. చైనా భారత్ సరిహద్దు సమస్యవలన పాకిస్థాన్ లాభం పొందుతుందని అమెరికాలోని పాక్‌అభిజ్ఞ వర్గాలు భావిస్తున్నాయని మన ప్రభుత్వం నమ్ముతున్నది. భారతదేశానికి అండగాఉండి సైనికమైన సహాయం చేస్తున్న పాశ్చాత్యదేశాలు, భారతదేశం శత్రువుతో పోరాడాలని దృఢసంకల్పంతో ఉన్నదనీ, అయినా తామిచ్చే సహాయాన్ని చాలా పొదుపుగా వినియోగిస్తున్నదని, తమతమ దేశాల్లోని పన్నుచెల్లింపుదార్లను నమ్మించాలి. ఈ పాశ్చాత్య సహాయం కూడా ఆయా దేశాల్లో అధికంగా పన్నులద్వారా వసూలుచేసిందే నన్న విషయం మనం గమనించాలి.

సరిహద్దులో యుద్ధవిరమణ జరిగిందనగానే ఈ యుద్ధం ఇంతటితో చక్కబడ్తుందనీ, మళ్ళీ మామూలు పద్ధతిలో ప్రశాంతంగా ఉంటుందనే భావాలు ఈవరకే ఏర్పడ్డాయి. వత్తిడి తేగల వర్గాలు, తమతమ ఇష్టమైన పద్ధతుల్లో క్రమంగా, ఖర్చును తగ్గించుకోకుండా ఉండాలని ఈవర నుంచే పథకాలు సిద్ధపరచారు. కమ్యూనిస్టులు తత్సంబంధీకులు ఇంటా బయటాకూడా పాశ్చాత్య విద్వేషాగ్నిని ప్రజ్వలింప జేస్తున్నారు. భారత పాకిస్తాన్ సంబంధాలు ఈ వరకున్నంత ముదనష్టంగానే ఉన్నాయి. ఈ ప్రస్తుత వాతావరణంలో పాశ్చాత్యదేశాలు భారతదేశానికి తమ సహాయం క్రమేపి తగ్గించే ప్రమాదం ఏర్పడవచ్చు. అందువల్ల భారీ, దీర్ఘకాలిక లాభాల దృష్ట్యా, భారత దేశాన్ని సైనికంగా బలపరచి ఉద్యమాన్ని ఆపకుండా ముందుకు తీసుకుపోవటమే ఉత్తమం. చైనాతో ఏర్పడే శాంతి ఒడంబడిక, సైనికంగా భారతదేశం బలపడటానికి చేసే ప్రయత్నాలకు అడ్డురాదని ప్రధానమంత్రి హామీ యిచ్చారు కూడా. భారత్, చైనాలశాంతి పూర్వక చర్చలు ఎలాతేలినా, ఈదేశాలసరిహద్దు సమస్య కొన్నేళ్లపాటు నలుగుతూనే ఉంటుందనేది తేలిపోయింది. చైనాతో భారీ యుద్ధాన్ని కొనసాగించేందుకు భారతదేశం సిద్ధపడాలి. భారతదేశంలో ప్రజాస్వామ్యం బ్రతికి బయటకు లంటే, దేశం సైనికంగా పటిష్టం కావటం వినా గతి లేదు. ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రాబోయే ఆకర్షణలు!

'[illegible]'

రచన

బొంబాయి సినిమా తార

ఆశా పరేఖ్

•

రూప విచిత్రం

## వచ్చే వారమే!

•

పట్టపగలు హత్య

సిరియా రాజధాని డామస్కస్

పోలీస్ అధికారి ఇబ్రహీంగాజీ రచన

'నా అనుభవంలోకెలా పెద్ద పరిశోధన'

వ్యాసాలలో మొట్టమొదటిది!

**15-2-63**

సంచిక నుంచి

ప్రారంభం!

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనలు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

